# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1960



## మార్చి సంచికలో

# వార్తలు

## ఆంధ్రప్రదేశ్ నూతనమంత్రివర్గం

శ్రీ నీలం సంజీవరెడ్డిగారు అఖిలభారత కాంగ్రెస్‌కు ఈసారి అధ్యక్షులుగా ఎన్నికైన కారణంగా, ముఖ్యమంత్రి పదవికి రాజీనామాయివ్వడంవల్ల ఆంధ్రప్రదేశ్‌లో శ్రీ దామోదరం సంజీవయ్యగారు ముఖ్యమంత్రిగా నూతనమంత్రివర్గం జనవరి 11 వ తేదీన ఏర్పడింది. ఉపముఖ్యమంత్రిగా శ్రీ కొండా వెంకటరంగారెడ్డిగారు నియమించబడ్డారు. శ్రీయుతులు అల్లూరి సత్యనారాయణరాజు, పి. వి. జి. రాజు. మల్లిపూడి పళ్లంరాజు, ఎస్. బి పి. పట్టాభిరామరావు, కల్లూరి చంద్రమౌళి, కాసు బ్రహ్మానందరెడ్డి ఏ. సి. సుబ్బారెడ్డి, నూకల రామచంద్రారెడ్డి, కొండా లక్ష్మణ్ బాపూజీ, మందుముల నరసింగరావు, శ్రీమతి మాసూమాబీగంగార్లు ఇతరమంత్రులు.

## 65 వ కాంగ్రెస్ మహాసభ

65 వ కాంగ్రెస్ మహాసభ శ్రీ నీలం సంజీవరెడ్డిగారి అధ్యక్షతన బెంగళూరులో దక్షిణ కన్నడ స్వాతంత్ర్యోద్యమ వీరుడు శ్రీ సదాశివరావు స్మారకంగా ఏర్పాటుచేసిన సదాశివనగర్‌లో జనవరి 12 వ తేదీ నుండి 18 వరకు వైభవోపేతంగా జరిగింది. అగ్రరాజ్యాలమధ్య ప్రచ్ఛన్నయుద్ధం కొంత తగ్గుముఖంపట్టినందుకు హర్షం ప్రకటిస్తూ తీర్మానించింది. సరిహద్దు సమస్యలు సంప్రతింపుల ద్వారా పరిష్కరించుకోవాలనే విశ్వాసం ప్రకటిస్తూ మరొక తీర్మానం చేసింది. భారతదేశం ఏ అగ్రరాజ్యకూటంలోనైనా చేరి సైనిక సంధులో మొదలయినవి చేసుకోజాలదని కాంగ్రెస్ తన అభిప్రాయం స్పష్టపరచింది. దేశాభివృద్ధి ప్రణాళికలను అందులో కాంగ్రెస్ వాదులు నిర్వహించవలసిన ప్రధానపాత్రకు సంబంధించిన మరొక తీర్మానం చేసింది. ప్రణాళికలకు సంబంధించిన తీర్మానాన్ని ఆచరణలో పెట్టవలసిన బాధ్యత కాంగ్రెస్ సంస్థదేనని అధ్యక్షులు శ్రీ సంజీవరెడ్డిగారు హెచ్చరించారు.

## కేరళ ఎన్నికలలో కమ్యూనిస్టుపార్టీ ఘోరపరాజయం

కేరళ శాసనసభకు ఫిబ్రవరి 1 తేదీన జరిగిన ఎన్నికలలో కమ్యూనిస్టుపార్టీ పరాజయం పొందింది. మొత్తం 126 స్థానాలలోను కాంగ్రెస్‌కు 63 స్థానాలు, పి. ఎస్. పి. కి 20, ముస్లింలీగుకు 11, కమ్యూనిస్టుపార్టీకి, ఆ పార్టీ సమర్థించిన వారికి 29 స్థానాలువచ్చాయి. లోగడ కమ్యూనిస్టు పరిపాలనలో మంత్రులుగ ఉన్నవారు పలువురు కూడా ఓడిపోయారు.

## శ్రీ కాశేశ్వరరావుగారికి 'పద్మభూషణ్' బిరుదు

పదకొండవ రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఈసారి 31 మందికి బిరుదులిచ్చారు. వీరిలో తెలుగువారు ఇద్దరున్నారు. ఆంధ్రప్రదేశ్ శాసనసభ స్పీకరు శ్రీ అయ్యదేవర కాశేశ్వరరావుగారికి 'పద్మభూషణ' బిరుదు ఇవ్వబడింది. ట్రాంబేవద్దగల అణుశక్తి కేంద్రంలో ఒక శాఖకు అధిపతి అయిన శ్రీ అయ్యగారి సాంబశివరావుగారికి 'పద్మశ్రీ' బిరుదం ఇవ్వబడింది. రాష్ట్రపతి అగ్నిమాపకదళం పతకాలు ముగ్గురు తెలుగువారికి లభించాయి.

ఇంగ్లీషు ఛానల్ ను ఈదిన భారతీయ కన్య ఆరతీసాహా, కాన్పూర్ క్రికెట్ ఆటపోటీలలో అపూర్వ ప్రతిభ చూపిన శ్రీ జాసూపటేలుకు 'పద్మశ్రీ' బిరుదం ఇవ్వబడింది.

## భారతదేశానికి సోవియట్ అధ్యక్షుని రాక

సోవియట్ అధ్యక్షుడు శ్రీ కె. ఇ. వోరోషిలోవ్ జనవరి 20 వ తేదీన ఢిల్లీకి వచ్చారు. ఆయనకు భారత ప్రభుత్వము, ప్రజలు అఖండస్వాగత మిచ్చారు. ఆయన 16 రోజులపాటు భారతదేశంలోని వివిధ ప్రాంతాలను చూచారు. నిరాయుధీకరణ, మున్నగు విషయాలపై ప్రధాని నెహ్రూ మున్నగు వారితో చర్చలు జరిపారు.

## శ్రీ డి. వి. సుబ్బారావు మృతి

సుప్రసిద్ధనటుడు 'నటరాజశేఖర' శ్రీ డి. వి. సుబ్బారావుగారు జనవరి 7 వ తేదీన బందరులో గుండెజబ్బుతో మరణించారు. వీరివయస్సు 66 సంవత్సరాలు. భార్య, ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె ఉన్నారు.

## అమెరికా కొత్తబడ్జెటు

అమెరికా అధ్యక్షుడు శ్రీ ఐసెన్‌హోవర్ జనవరిలో కాంగ్రెస్‌లో ప్రతిపాదించిన అమెరికా కొత్త బడ్జెటులో రాకెట్లనిర్మాణానికి, రాకెట్లు ప్రయోగించే సబ్‌మెరీన్లు నిర్మించడానికి ఎక్కువ మొత్తాలు కేటాయించబడ్డాయి. బడ్జెటు ఆదాయం అంచనాలు 7,980 కోట్ల డాలరు. దినిలో, సగానికి పైగా-4 100 కోట్ల డాలర్లు - మొత్తం రక్షణకార్యాలకు కేటాయించబడింది.

# హేమంత శృంగారము

శ్రీ శనగన నరసింహస్వామి

1

కాంతసరోరుహ ప్రసవ కానన కుంతము, పక్వశాలిభా
స్వంతము, నూత్నపల్లవ విశాలసముద్గమ సస్యసుందర
ప్రాంతము, సంపతత్తుహిన పాండు దిగంతము, వంతు మీఱ హే
మంతము ఫుల్లలోధ్రరుచిమంతము వచ్చెను జూడు, ప్రేయసీ!

2

ఘన కటిసీమలందు మణికాంచన సంగమ చిత్రమేఖలా
గుణములు సంతరింత్రు; నవకోకనదచ్ఛవిభాక్పదద్వయీ
వనజములందు హంసరుతభాగ్రసిక ప్రియనూపుర ద్వయ
మ్మును సమలంకరింత్రిపుడు ముగ్ధలు, మోహననీలకైశికా!

3

మందరగామినీ కఠిన మాంసలతుంగకుచోపగూహనా
స్పందనిపీడనప్రభవ సంభ్రమఖేదము శీతకాల మా
క్రంద మొనర్చు వానరముఖమ్మునయందు తృణాగ్రతీరని
ష్యందతుషారబిందునయనాశ్రుసహస్రమిషం దలోదరీ!

4

సమధిక శాలికాప్రసవసంపద సొంపులు సంతరింపగా,
భ్రమణవిలోలలైన మృగభామలయూధ మలంకరింపగా,
కమనములైన క్రౌంచముల కంఠరవమ్ములు మిన్నుముట్టగా,
ప్రమదము నించు సీమముల ప్రాంతము లాత్మలయందు, సుందరీ!

5

పధపద ఫుల్ల కీచక కువాల సుమమ్ములు శోభ నింపగా,
మదకల రాజహంసములు మండనసామ్యము సంఘటింపగా,
నదములు నిర్మలత్వము సముత్కట శైత్యము సంగమింప, పుం
హృదయము లొక్కసారి హరియించు సరస్సులు నేడు, సచ్చెలీ!

6

హిమశిశిరాంబుపూరముల నిచ్చ మెయిం బయనించి, పక్వతా
గమనము నొంది వాయుపృథుకమ్ము లహర్నిశముం గదల్పగా;
రమణవియోగఖేదగత రాగిణివోలె ప్రియంగు నామ వృ
క్షము పరిపాండు వర్ణమును సంక్రమియించు, సరోజలోచనా !

7

ప్రసవ సుగంధిలాసవ నిపానత మోదములు తావు లీన, ని
శ్శ్వసన మరుత్తు లంగముల సౌరభవీచుల దేల్చ, నంగభూ
రస భృశతానువిద్ధ జనరాజి పరస్పర దేహాలగ్నతా
శ్వసన శయానతావశత; స్వాపసుఖమ్ము గమించు, కామినీ !

8

ప్రియతమ తీవ్రదంతముఖపీడన సవ్రణ దంతవాసముల్,
దయిత నఖాభిలేఖన విధాన నిధాన కుచప్రకుంభముల్,
నయనమనోజ్ఞ యౌవన సనాథకురంగ విలోకనా సని
ర్దయసురతోపభోగ బహుధాత్వము సూచనజేయు, శ్రీమతీ !

9

నాతి యొకర్తు హస్తనలినమ్మున దర్పణరాజ మూని బా
లాతపమందు నిల్చి వదనాబ్జ మలంకృతి నించుచుం ప్రియా
పీతరసమ్ము దంతముఖభిన్నము నోష్ఠము సాగలాగి సం
ప్రీతి మనమ్ములో నిగుడ ప్రేక్షణసేయును, కీరవాదినీ !

10

పొలతి యొకర్తు భర్తృపరిభుక్త శరీరము గాంచి హర్షసం
వలనము మీఱ బింబరదవాసము సుందర శోభనించు; వి
హ్వలమతి లంబినీల లలితాలక కుంచితనేత్రయై ప్రియా
కలిత నఖక్షత స్తనయుగమ్మున కంచుక మూను, భామినీ !

[ఆంధ్రీకృత ఋతుసంహార కావ్యము నుండి]

# భారతీయ కళా సంకేతాలు: ఆదర్శాలు

శ్రీ తిరుమల శ్రీనివాసశర్మ

భారతీయశిల్పి రచియించిన ప్రతి కళాకృతియందును అతని ఆంతరంగిక భావావేశము, సృష్టికి ప్రేరేపించిన అతని ఆనందాతిరేకము, దానిద్వారా అతడు సాధించిన ఏకాగ్రత అడుగడుగున గానవచ్చుచుండును. కళాకారుని ఉద్రిక్తభావదృష్టిలో ప్రకటనోద్దేశము తిరుగు దేశకాలపరిమితులకు లోబడక ఉన్నదున్నట్లు వ్యక్తమగుచుండును. విషయమునకు, భావమునకు సమైక్యము సిద్ధించుటవలన కళాసృష్టిలోని వేగమెక్కువైనపుడు తాత్కాలికములు, భౌతికములునైన వాంఛలు నిరాఘాటముగ సాగు సృష్టికి విఘాతమును కలిగింపలేవు. ఒక మంచుబిందువులో దాని పరిసర ప్రపంచము వివిధ వర్ణములతో నొప్పుచు ప్రతిబింబించునట్లు కళాకారుని హృదయమున కూడ నతని రచనోద్దేశము దేశకాలముల కతీతమై, ఉద్వేగరంజితమై క్షణములో వ్యక్తమును, లయమును పొందును. అతడు ధ్యానకాలమున దేని సాక్షాత్కారమందునో ఆ పరమరహస్యమునకు మూర్తికల్పన మొనరించి శిల్పముగనో, చిత్రముగనో లోకమునకు ప్రసాదింపదలచును. సహజముగ మారని ప్రకృతి నియమములు భౌతిక ప్రపంచ సీమలనుదాటి లోకాంతరముల సంచరించు కళాకారుని సృష్టిని నిరోధించుటలో అశక్తములగును. మహాకవి మూర్ధన్యుడగు వాల్మీకి వానరశ్రేష్ఠుడగు ఆంజనేయుని శౌర్యమును వర్ణించునప్పుడతడు గంధమాదన పర్వతమును మోసికొని సముద్రమును దాటినట్లు చెప్పెను. దానిని చదివి మన మాశ్చర్యపడము. శ్రోతలెట్టి అద్భుతములనైన విశ్వసించునట్లు సిద్ధమొనర్చుటకై వాల్మీకి యవలంబించిన పద్ధతిలోని మహత్వమట్టిది. దశవదనములతో, నిరువదిచేతులతో మూర్తీభవించిన క్రౌర్యమనదగు రావణాసురుని చర్యలును, ధైర్యశౌర్యములతో నొప్పు హనుమంతుని శౌర్యములును రామాయణ కథాశ్రితములు, పఠనాసక్తిలో నేమాత్ర మసంభవములనిపింపవు. ఇట్లే యోగశాస్త్రమును జదువునపుడు యోగులు నిరాహారులై భూగృహములలో నెలలకొలది సమాధిస్థితియందుండుట సాధ్యమని తెలియును. కవికూడ ప్రకృతినేమముల ననుసరింపక తన యిష్టానుసారముగ పాత్రలను సృజించుచున్నాడు. సుప్రసిద్ధ లాక్షణికుడగు మమ్మటుడు కళాసృష్టిలోని ప్రత్యేకతను గమనించి తన గ్రంథారంభముననే "నియతికృతనియమరహితాం" అని వర్ణించినాడు. కళాకారుని రచనయందును కవితాసృష్టి వైచిత్ర్య స్వభావములు గోచరించును. బుద్ధుని తల్లియగు మాయాదేవికి బుద్ధుని జనన కాలమున నొక గొప్ప యేనుగ గర్భమున ప్రవేశించునట్లు తీర్చబడిన ప్రతిమను గాంచెదము. శిల్పి పరిమాణమున మాయాదేవితో సమమగు నేనుగామె సంకుచితగర్భమున ప్రవేశింపజాలదను నాలోచనలచే సుంతయు కలత జెందినట్లు లేదు. ఈ సంఘటన మసంభవమను తలంపు కళాకారునకు గలుగనే లేదని మనము తీర్మానింపరాదు; అది మిగుల స్పష్టము. అతడు కళాత్మక చైతన్యమును పరిమిత మొనర్చు ప్రకృతినియమములను పాటింపలేదనియే భావింపవలెను.

వివిధాంశములతో నొప్పు కొన్ని ప్రతిమలు మొక్కలతో, తీవలతో కలిపి తీర్చబడినప్పుడు ప్రత్యేకముగ ప్రతిమలు తమ వైశిష్ట్యమును వ్యక్తమొనర్పలేవు. కళాకుశలుడు తన ప్రతిభచే ప్రతిమాకల్పనమున కొంతక పరచు నితర విషయముల కప్రధానతను కనబరచెను. (అట్లు చేయనిచో నముఖ్యములగు విషయములు ప్రధానమూర్తిని మరుగుపరచును.) కళాకారునిదృష్టి కేవలము కొన్ని భాగములపైగాక పూర్ణవిషయముపై నుండును. కావున అన్నిభాగములును ప్రధానవిషయమునకు లోబడియుండును. పూర్ణవిషయమున నొకే యభిప్రాయముండి, యొకే చైతన్యము దాని కాత్మగా రూపించబడినది. ఇది బుద్ధుని ముఖముపై తాండవించు శాంతభావము కావచ్చును, లేదా మృగ పక్షి వృక్షాదుల చైతన్యధారకును, మానవాత్మకునుగు ఏకత్వము ప్రదర్శించుట కావచ్చును.

ఈ మూలసత్యము కళాకారుని మానసికానుభవములలో ముఖ్యాతిముఖ్యమని అనేక సంకేతములతో నొప్పు కళామయమైన వస్తువులచే స్పష్టము చేయబడినది. భూమిమీద బుద్ధావతరణమును సూచించుటకై

కలానిర్మాత ఒకనిచ్చెనను, దానిపై కమలములను జూపును. నిచ్చెననుండి క్రిందికి దిగుచున్న బుద్ధమూర్తిని చెక్కవలసిన పనిలేదని అతని అభిప్రాయము. మరొకచోట జ్ఞానోదయము, సన్యాసము, వానిలోని కతని ప్రవేశమును సూచింపవలసినపుడు కమలములతోగూడిన మూడు నిచ్చెనలు ఒక బోధివృక్షము, ఒక బుద్ధాసనము, దానిచుట్టు కొన్ని దేవ, మానవ ప్రతిమలు కొందరు కూర్చున్నట్లు, నిలచినట్లు, చూపబడినవి. బుద్ధుని ఆవిర్భావము, ధర్మసంఘములు, సర్వోత్కృష్టములైనవనియు, బుద్ధునికి రూపకల్పన మొనర్చిన అది మూలసత్యమును గాక, అనవసరముగా చూపరనాకర్షించుననియు శిల్పి భావించెను. బుద్ధావతారము, జ్ఞానోపదేశము, సన్యాసవిధులు మొదలైన విషయములన్నియు చర్మచక్షువులకు గోచరించు బుద్ధుని భౌతికరూపముతో నేమాత్రము సంబంధము లేనివి. ఆచారశీలురగు థేరవాదులు సదాచారముల నావశ్యముగ చేసికొనగా, మహాసాంఘికులు బుద్ధునే ఆదర్శమొనరించుకొనిరి. ఈ ఆదర్శపద్ధతి శాక్యబుద్ధుని కల్పితబుద్ధులతో సమైక్యమొనరించి అతని చారిత్రక వ్యక్తిత్వమును విస్మరింపజేసినవి. బుద్ధులందరును లోకాతీతులని తలచబడిరి. బుద్ధుడు సామాన్యునివలె జీవితమును గడపలేదు. అతడు నిద్రాస్వప్నము లెరుగడు. అతడెప్పుడు ననంతసత్యములనె చూచుచు, వానిలో లీనమైయుండెను. దీనిఫలితముగ బుద్ధత్వము దేశకాలములను మీరి విశ్వవ్యాపితాదర్శముగ మారినది. కావుననే బోధిసత్వుని భౌతికజీవితమును స్వప్నములతో, నాలోచనలతో నింపివేసినది.

అమరముగు బుద్ధుని ధర్మకాయమునుండి అతని ప్రాకృతజీవితమును నాగార్జునుడు గుర్తించెను. బుద్ధుని ఐతిహాసికతను గుర్తించి అతడు బుద్ధుని అసామాన్య వ్యక్తిత్వమొక సంకేతమని నిర్వచించెను. బుద్ధమతతత్త్వముచే జ్ఞానస్వరూపుడని నిర్ణయింపబడిన బుద్ధుని అవతరణాదికము విచ్చుచున్న కమలములతో, నిచ్చెనతో కలాముఖమున వ్యక్తము చేయబడినది. ఈ వ్యక్తీకరణ పద్ధతులు దేశకాలరహితము, ఆత్మైకవేద్యమునగు దివ్యసృష్టిని కళద్వారా ప్రదర్శించురీతి అని తెలిసికొనవలెను. కలాకుశలుడు తన ప్రతిభకు దప్ప మరేధర్మములకును లోబడడు. మమ్మటుడు తన "కావ్యప్రకాశ" మున కావ్యసృష్టిని గూర్చి తెలుపుచు కవి స్వీయనియమములను దప్ప నితరముల లెక్కింపదని స్పష్టపరచెను (అనన్య పరతంత్రాం.)

ఏ భారతీయశిల్పమును గాని, వర్ణచిత్రమును గాని ఉదాహరణముగా గ్రహింతము. సాధారణముగా ఎక్కువ వాడుకయందున్న యొక కళాప్రతీకము చూడనగును. విశ్వస్థితి కారకుడగు విష్ణువు పాలకడలిలో వేయిపడగలతో నొప్పు ఆదిశేషునిపై పరుండినట్లు రచింపబడినది. అతని నాభికమలమున సృష్టికర్తయగు నలువ నలుమొగములతో గూర్చుండియున్నాడు. విష్ణుమూర్తిపాదముల చెంత మహాలక్ష్మి శాంతముగ కూర్చుండియున్నది. విష్ణువు నిదురబోవుచున్నాడు. ఈ చిత్రమును సునిశితముగ పరిశీలింపవలసియుండును. సంస్కృతమున 'శేష' మనగా అన్నియు నశింపగా మిగులునదని యర్థము. పై చెప్పిన వర్ణచిత్రమున గాని, శిల్పమున గాని రచింపబడిన సర్పమనంతుడై, సహస్రఫణములతో కనబడుచున్నాడు. అతనిపై విష్ణుభగవానుడు ప్రశాంతముగ పరుండి కదలకున్నాడు. సర్పము భగవంతుడు పూర్ణుడని, విశ్వమునకంతము కలదని బోధించును. అతని వేనవేలు మొగములు స్థిరముగు విశ్వమనేక మార్గములతో సాగిను అశాశ్వత పదార్థ సృష్టిని దెలుపును. ఆ దృశ్యమంతయు, అందలి భాగములన్నియు లక్ష్మీవిష్ణువులు స్త్రీపుంభేదములతో సృష్టికి మూలబీజములను భావమును తేటపరచును. ప్రాకృతసృష్టి నుండి అనంత మస్థిగరూపమును దాల్చి బయల్పడుచు తనలో లీనమగుచుండును. సృష్టికర్తయగు బ్రహ్మ నలుమొగముల సాగు సృష్టికి చిహ్నమై లక్ష్మినాభి నుండి రావలసియుండెను; కాని అట్లు జరుగలేదు. సాంఖ్యశాస్త్రప్రకారము నానావిధములతో నొప్పు హైందవమతమున కళలయందు ప్రకృతి పురుషులను రెండు ముఖ్యవిషయములు గైకొనబడినవి. ప్రకృతి స్త్రీగా భావింపబడును. అది నిరంతరము వస్తూత్పత్తిని జేయుచు విశ్వమును ప్రకటించును. మానసిక, శారీరిక విషయము లామె సృజనాత్మక శక్తినుండి వెలువడినవి. ప్రకృతి తనకు సమానస్థాయిలో నుండు పురుషుని సేవింపవలయునని తలచి, వికలత్వమునొంది సృజనశక్తితో ప్రపంచమును వెలువరచును. పురుషుడు చేతనామయుడు; నిర్వికారుడు. మార్పులన్నియు ప్రకృతికి సంబంధించినవి. పురుషుడు బహుదూరముగ నుండి ప్రకృతిలో శేషించువాడై యొప్పును. పురుషునకై వ్యయింపబడని ప్రాకృతిక సృజనశక్తియంతయు

యోగనిద్రపోవును. ఈ యభిప్రాయమును దెలుపుటకే మృణాళ నాళము బ్రహ్మను మోయుచు విష్ణువు నాభి కమలము నుండి వచ్చుచున్నట్లు చూపబడినది. లక్ష్మి అతని పాదముల చెంత సేవ చేయుటకై వేచియున్నది. కమలము క్రమవికాసమునకు చిహ్నము, 'లక్ష్మి' యను పేరు ప్రకృతిలోని సౌందర్యరామణీయకమును దెలుపును. సృష్టి, సౌందర్యముల యుత్పత్తి ధ్యానయోగములోని మౌనమునుండి యునికి వచ్చునట్లు, అశరీర ప్రకృతి స్వేచ్ఛగ అస్థిర పదార్థముల సృజించునట్లు కల్పించబడుట శేషాహిపై పవ్వళించిన విష్ణుమూర్తియందలి విషయములని గ్రహింపవలెను. వేదాంత తత్త్వము, సౌందర్యతత్త్వము కలయుచుండును, కళాకారునియందును గానవచ్చును.

భారతీయ కళాకృతులలో సర్వజనామోదము బొందిన సత్యములు, దోషములు, విశ్వాసములు కానవచ్చుట గమనింపదగినది. తరుచు కళాకారులు భావవీచికలలో తేలుచున్న మహాపురుషులను ధ్యానమగ్నులుగను, సంఘమును కార్యోన్ముఖముగను జేయగల శాశ్వతాదర్శములకు మూర్తికల్పనము జేయుట తమవిధి యని తలచిరి. తత్త్వరహస్యమును వ్యక్తమొనరించునపుడు భారతీయకళావేత్త ప్రకృతికిని, మానవునకుగల సన్నిహితసంబంధమును మరువడు. మానవుడు ప్రకృతిలో భాగమనియు, ప్రకృతి మానవునిలోనిదనియు, నత డెరుగును. భారతీయ పునర్జన్మ సిద్ధాంతానుసారము మానవుడు మరల ఓషధిగను, ఓషధి మానవుడుగను పుట్టవచ్చును. ఓషధులయందును, ప్రాణులయందును ప్రవహించు చైతన్యధారలో నంతరమేమియు లేదు. ఈ కారణమువలననే కళాకారులు ప్రాణులకును, మూలికలకు ఒకేవిధము సంకేతములను నెలకొల్పిరి.

ఇచట సహజముగ నొక ప్రశ్న పుట్టును. కళాకారుని కల్పితప్రపంచము తనవరకే సీమితమైన, నది భౌతికప్రపంచముతో సంబంధరహితముగ నుండనే వలయునా? కళాకారుడు తనసృష్టి ప్రకృతి కనుకరణము కాదని తలచునా? "చిత్రసూత్రము"ను చూచినచో నృత్యము, వర్ణచిత్రణము ప్రకృతికనుకరణములను విషయము మనకు తెలియును. అయిన నృత్యమెట్లు ప్రకృతి ననుకరించును? భారతీయ నాట్యశాస్త్రమున వివిధ భావభంగిమలు, నృత్యకళావిశేషములు విస్తరముగ దెలుపబడినవి. ఈ భంగిమలలో నేదియు ప్రకృత్యనుకరణమని చెప్పబడలేదు. నృత్యావిర్భావమునుగురించి చెప్పుచు "చిత్రసూత్రము"నాత్మ సృష్టికి ముందు ప్రళయ తాండవము, తరువాత సముద్ర తరంగములపై విష్ణుతాండవము జరిగి దానినుండి సృజనాత్మకానందము నృత్యము నుద్భవించెనని చెప్పుచున్నది. ఈ మాటలలోని యంతరార్థమును జాగ్రత్తతో బరిశీలించిన నృత్యము సృష్టికిని, సృజనాత్మక శక్తికిని మూలమనుట స్పష్టమగును. నాట్యము ప్రకృతిలో దేని యనుకరణము గాకున్నను, వాస్తవమున కది సృష్టిచైతన్యమువలె విశ్వమూలతత్త్వానుకరణమై యున్నది. భారతీయ కళాకారుడు వస్తువులో దాగిన సత్యమేది, దాని సారాంశమేమి, అవి మనకెట్లు కనబడుచున్నవి?–అనువిషయములకు ప్రాధాన్యమొసగును.

సంస్కృత సాహిత్యమును పరిశీలించిన నెందరో రాజులు రాణులయొక్క, ప్రేయసులయొక్క రూపచిత్రములను చిత్రించినట్లు తెలియవచ్చును. ఇవి మూలవిషయములతో నెక్కువ సాదృశ్యము కలవై భ్రమ గలిగించుచుండెను. అయితే వారొక మూలవస్తువు నెదుట నుంచుకొని దాని ననుకరించిరని చెప్పజాలము. పై చిత్రములన్నియు చిత్రకారుల ఊహాబలముతో వ్రాయబడినవి. కళాకారుని మనస్సుపై నొక విషయము తన ప్రభావమును వెదజల్లును. అప్పుడతడు దాని నంతరంగమున నవలోకించి, ఆ భావనాబలముచే దానికి రూపమొసగును. ఇట్లే దుష్యంతుడు తనచెంత లేని శకుంతలా చిత్రమును, మేఘదూతలోని యక్షుడు వియోగములో నున్న తన ప్రియురాలి చిత్రమును గీయుదురు. ఇట్టి భావచిత్రములు గీయుపద్ధతులు గూడ భారతీయ శాస్త్రగ్రంథములలో వివరింపబడినవి. భారతీయుల కన్నులు సకలపదార్థములను చూడగల్గును. మనస్సులు వాని రూపములకు ప్రభావితములగును. మన మనస్సులలో గల ప్రపంచము భౌతికప్రపంచముతో సంబంధము గలదయ్యును నూత్నశోభతో ప్రకాశించును. హైందవ-కళాకారులు బాహ్యవస్తువుల యథాతథానుకరణమునకు ప్రయత్నింపక తమ ధ్యానదృష్టిచే దర్శించిన మానసిక ప్రతిబింబమునో, ఒక ప్రత్యేక చిత్రమునో చిత్రించుటకు పూనిరి. ఎచటనో-యున్న ప్రతిబింబమును చూపదలచినపుడు క్షణకాలము దానిని తన మనోనేత్రమున దర్శించి కళాసృష్టికి పూనుకొనుట హైందవ కళాకారునకు క్రొత్తవిషయము కాదు. ఈ కారణమువలన నృత్యము చిత్రకళకన్నను పరిపూర్ణమని తలపబడెను.

శాస్త్రగ్రంథములలో స్వప్నమునందు కానీ, ధ్యానమునందు కానీ దర్శింపబడు ఆధ్యాత్మిక ప్రవాహమే సమస్తసృష్టి చైతన్య రహస్యమని అనేకోదాహరణములచే నిరూపించబడినది. ఉపనిషత్తులలో భగవంతుడు బహుముఖ ప్రపంచమును సృష్టించుటకు ముందు ధ్యాన మొనర్చెనని చెప్పబడినది. ఈ ధ్యానయోగమునందలి నిర్వికారతయే వికారయుత ప్రపంచమును సృజించును. ఇది కేవలము కలాసృష్టి రహస్యమే కాదు; దైవసృష్టి రహస్యము నైయున్నది. దుష్యంతుడు శకుంతలాచిత్రమును వర్ణించుచు తానెంత యత్నించినను భావనలోని సౌందర్య ప్రసన్నతను వ్యక్తమొనర్పలేకపోయితినని చెప్పెను. భావనలోని ప్రతిబింబ ముద్వేగముతో గూడినదగుట వలన రేఖలతో గీయబడిన చిత్రమునందు కోరికలు, ఆలోచనలయొక్క ఏకదేశమును మాత్రమే ప్రదర్శింపవీలగును. మనశ్చిత్రానుకరణము వాస్తవిక కలాసృష్టి ముందు శోభాహీనమగును.

ప్రాచీనభారతమున చిత్రలేఖనకుశలురు పలువురుండిరనియు, వారనేక చిత్రములను రచించిరనియు, సజీవ విషయమును తమయందుంచుకొనలేదనియు, కలాముఖమున ఆంతరదృశ్యమును ప్రకటించుటయే వారి యుద్దేశ్యమనియు తెలిసికొంటిమి. మానవాకారమును చిత్రింపదలచితిమేని దేహమునందలి ప్రత్యంగమును యథాతథముగ అనుకరించుటకంటె, మనోభావనలను ప్రకటించుట ముఖ్యము. క్షణక్షణమున రేకెత్తు ఆలోచనలకు, అనుభవములకు మనముఖము దర్పణమగును. ముఖభంగిమలవలన భావములు వ్యక్తము కావలెను. భావవ్యక్తీకరణముకొరకు ముఖభంగిమలు మార్పులకు లోనగును. సామాన్యకళాకారుడు తనముందొక మనుష్యుని నిలుపుకొని ఒక విగ్రహమునో, చిత్రమునో కల్పించదలచినచో అతడు బాహ్యరూపమును ప్రదర్శింపగలడేకాని, ఆంతరిక క్షణక్షణ భావపరివర్తనములను చిత్రింపజాలడు.

పదునెనిమిది, పంతొమ్మిదవ శతాబ్దములలో కళయందలి వాస్తవికతావాద, ఆదర్శవాదములకు సంబంధించిన సమస్యలు 'జోలా', 'కోరట్' మొదలైనవారిచే రేకెత్తింపబడెను. కాని, వాస్తవికతావాద స్వరూపమును గూర్చి, లక్షణములను గూర్చి అగమ్యస్థితి కూడ విశేషముగనుండెను. చిత్రము మూలవిషయమును యథాతథముగ రూపింపవలయునేకాని యెట్టి సూచనలను వ్యక్తము చేయరాదనుట వాస్తవికతావాదము యొక్క ముఖ్యోద్దేశ్యము నిజమాలోచించిన నొక మానవాకృతిని చిత్రింపదలచినపుడు బాహ్యరూపమును యథాతథముగ జిత్రింప పనిలేదు. ఈ రేఖలు మానవుని మానసిక ఆధ్యాత్మికభావములు ముఖభంగిమలచే వ్యక్తమగునట్లుండవలెను.

సుప్రసిద్ధుడగు కలావిమర్శకుడు "రోజర్ ఫ్రై" ప్రత్యేకముగ ప్రకృతి సౌందర్యానుభూతియొక్క అస్తిత్వము నంగీకరించెను. దానికి సామాన్యానందముతో అనివార్యముగ సామ్యమవసరము గాకున్నను, అదే తరువాత ఆనందలాభమును గలిగించును. పలువురు భారతీయ రచయితలు సంతోషమే అనివార్యముగ సాహిత్యకళను నిర్వచించునని చెప్పిరి. కాని, 16, 17 శతాబ్దములలో నున్న జగన్నాథపండితుడీ సంప్రదాయమును ఖండించి, సంతోషమునకంటె విభిన్నమగు నొక మానసికస్థితి నంగీకరించుచు, నది సంతోషముతో సామ్యము లేనట్టిదై, తప్పనిసరిగ సంతోషము నొసగని యొక సౌందర్యానుభూతి యని నిర్వచించెను. ఇట్టి మానసికస్థితి అనివార్యముగ సారస్వత కల ననుగమించునని అతని తలంపు. ఈ ప్రకృతి సౌందర్యానుభవస్థితి నతడు "చమత్కార"మని నిర్వచించుచు ఇది దానికి హేతువైన బహుముఖ మానసస్థితిని మీరుచున్నదని తెలిపెను. అతడు వర్ణించిన వివిధ భూమిక లిట్లున్నవి:

1. బాహ్యవిషయికములు, 2. వాని సేంద్రియ మానసిక ప్రతిబింబజములు, 3. వాని సమైక్యమువలన నేర్పడు ప్రత్యేకరూపము, 4. అంతఃప్రజ్ఞ బహిఃప్రజ్ఞలుగల మనఃప్రవృత్తియొక్క నిగూఢమైన మానసిక స్ఫూర్తులు, 5. వానివలన నుద్భవించు అంతస్స్ఫురణతో గూడిన రసానుభూతి. దీనినే జగన్నాథుడు చమత్కారమనెను. ఈ చమత్కారము లేక రసానుభూతి కలిగించు చేతనాశక్తినే "కలానంద" మనుచున్నాము.

ప్రకృతి దృశ్యములు కాని, కలాఖండములు కాని ప్రేరేపించు సాధారణ మానసికావస్థనుండి కలుగు ప్రత్యేక రసానుభూతియే సౌందర్యతత్త్వమునకు లక్షణమగును. ఒక చిత్రములో సాధారణముగ రూపకల్పనము, పృష్ఠభూమికలు సక్రమముగ నిర్వహింపబడియు రసానుభూతిని గలిగింపకున్నచో నది ఉత్తమ చిత్రము కాజాలదు.

# మాట్లాడే స్మృతులు

శ్రీ సి. నారాయణరెడ్డి

నా స్మృతులు నాల్కల్ని తోడుక్కొని
నడిరేయి యేమిటో పలుకుతున్నాయి.
గతమనే ముసలిగోవును కట్టేసి
నిర్దయగా అనుభవాల్ని పిదుకుతున్నాయి.

వెన్నెల చమురు ఒంటబట్టించుకొని
పన్నీటి కుల్యల్లో జలకాలాడుకొని
కమ్మకస్తూరి గీర్నామం దిద్దుకొని
కలువ పుష్పాల్లు మెయినిండా అద్దుకొని
తెమ్మెర పల్లకీపై షికారు తిరిగిన దినాలు
గమ్మత్తుగా మత్తుగా కరిగిన క్షణాలు—
కనిపిస్తున్నాయి పాత చుట్టాల్లాగా
తునిగిపోయిన కలలోని చిత్రాల్లాగా.

పగిలి పదారువక్కలైన అద్దంలో
ఆవురనే బీటవారిన ముఖాలు
రాతిబిళ్ళల్లా వున్న కంటద్దాల వెనక
పాతుకుపోయిన కనుపాపల ఖద్యోతాలు
పట్టపగలు జరిగిన సర్పరజ్జుభ్రాంతులు
నిట్టనిలువు పొగచూరిన చంద్రకాంతులు—
తేలుతున్నాయి చేపచిక్కని గాలాల్లాగా
కర్మ చాలక తోక తెగిన సృగాలాల్లాగా.

భయాల దుప్పట్లు కప్పుకొని ఇరుగ్గదిలో
చావుకు జీవంపోసే మొనగాళ్లు
ఆశల కుంపట్లు పెట్టుకొని ఆకాశంవేపు
చూపుల్ని ముడుపుగట్టిన మునిగాళ్ళు
పచ్చిగడ్డి అనుకొని గోతిలోపడ్డ పసిలేళ్ళు
చిచ్చుకౌగిట్లో వెచ్చగా పడుకొన్న ఊళ్లు—
అబ్బా! ఎంతటి చేదుజ్ఞాపకాలివ్వి.
అరుస్తున్నాయి పొగగొట్టాల్లా వికవికనవ్వి.

పన్నీట స్నానంచేసిన కోరమీసాలు
కన్నీట అభిషేకమాడిన నయనాంచలాలు
ఈ ద్వంద్వాలు నిన్నటివే—మరి తిరిగిరావా?
చేదూ తీపీ కలిసిన ఉగాదు లికముందు లేవా?
గానుగెద్దులా అస్తమానం తిరగడమేనా?
సానరాయిలా రోజంతా అరగడమేనా?
ప్రశ్నావళీవజ్రాయుధం అంచులా మెరిసింది.
పాపం! స్మృతులపై లాఠీలవర్షం కురిసింది.

# శారదా చట్టపు గ్రహకూటము

శ్రీ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు

"ఏమి కాలవైపరీత్యమో? ఎచ్చట చూచినా, సంఘములో పెండ్లికాకనే వయసు ముదురు చుండు కన్యకలు, వరులు అల్లాడుచున్నారు."

ఇటీవల నా మాననీయ మిత్రులలో నొక మహాశయుడు లోకాభిరాముముగా మాటలాడుచుండు సందర్భమున, ప్రసంగవశమున చేసిన విమర్శ ఇది. అతని అంతరంగమున కలిగిన నిర్వేదమున కిది సాక్షి. వాస్తవముగా, ఇప్పటి నడివయస్సు అవివాహిత స్త్రీ పురుషుల సమాజమును తలచుకొన్నచో, అతనికి ఎంతో జాలి.

"వివాహములు అక్కరలేదనిపించునట్టి సంస్కృతినే కదా, మనము వారికి సంపాదించి ఇచ్చుచున్నాము" అని చల్లగా నా ప్రతివచనం. అందుపై నతడు "అక్కరలేని వారి కథ పోనియ్యండి. అక్కర పడినవారికి, వరులకు తగిన కన్యకలుకానీ, కన్యలకు తగిన వరులుకాని, వెతకుకొని పోయినా, దొరకుట కష్టమైనది కదా?" అని పూర్వపక్షము నెత్తినాడు. అతని ప్రపంచానుభవము గొప్పది.

"సత్యమే కాని, కారణము వేరు."

"ఏమది?"

"వివాహమును కోరి సిద్ధపడుచున్న వరులలో కాని, కన్యకలలో కాని, ఏదో లోపమును వెతకి, కనిపెట్టి, తమకు వారు తగినవారు కారని నిరాకరించుట ఇప్పటి యువతీ యువకులకు పరిపాటి అయినది. తములో లోపములు లేవా, అని ఆత్మవిమర్శ చేసుకొను వివేకమును వారికి నేర్పినవారే లేరు. దాని ఫలమిది." అని సమాధానము చెప్పితిని. క్షణకాలమూరకుండి ఏదో ఆలోచించి, అతడు తనసమస్యకు మార్గాంతరము నిట్లు సూచించినాడు.

"ఏ దుష్టకాలములో వచ్చెనో కాని, ఇది అంతా ఆ శారదా చట్టపు ప్రభావము!"

"వాస్తవమే! ఏ కాలములో ఏది పుట్టునో, ఆ కాలపు ధర్మములు దానిలో నుండగలవు."

ఆధునిక విజ్ఞానశాస్త్రపారంగతులగు డాక్టర్ "ఐన్‌స్టీన్" పండితుడు చెప్పిన సూత్ర మిది. సత్యములలో సత్యము!

ప్రశంసలోనున్న శాసనము మనదేశమున వ్యాప్తికి వచ్చుట 1930 వ సంవత్సరము, ఏప్రిల్ నెల, మొదటి తేదీనాడని చదువరు లెరుంగుదురు. ఆనాడు, ఏమి దైవము మహిమయో, ఒక విచిత్రమైన, అసాధారణమైన, గ్రహస్థితి భచక్రములో ఏర్పడి యుండినది. ముఖ్యమయిన గ్రహస్థానములు మాత్రము ఈ క్రింద పట్టికములో చూపబడినవి. ఇవి సాయన స్ఫుటము ననుసరించినవని జ్ఞప్తిలో నుంచుకొనవలె యును.

| | రాశిలో | భాగలో | గ్రహము |
|---|---|---|---|
| (1) | మేషములో | 11°... | రవి |
| (2) | ,, | 11°... | వరుణుడు |
| (3) | ,, | 11°... | బుధుడు |
| (4) | మిథునములో | 11°... | గురువు |
| (5) | మీనములో | 11°... | కుజుడు |
| (6) | మకరములో | 11°... | శని |
| (7) | వృషభములో | 11°... | చంద్రుడు |

ఏమి అద్భుత గ్రహచారప్రణాళిక ఇది? ఎన్ని వేల సంవత్సరముల కొకమారు ఇట్టి అసాధారణ గ్రహస్థితి సంభవించునో, గణితశాస్త్ర విశారదులు తేల్చవలసిన సమస్య!

చూడుడు! పరమోచ్చభాగలో గ్రహరాజు కొలువు తీరియున్నాడు రవి. పండితుడు బుధుడు, ప్రతిభాశాలి వరుణుడు, జట్టుకట్టుకొని అతని నాశ్రయించినారు. అత్యుత్కటవ్యక్తిస్వాతంత్ర్యకాంక్ష, అపార విజ్ఞానాభివృద్ధి, సంఘ సంస్కరణాభిలాష, ప్రగతి కుతూహలము, అనునవి ఈ గ్రహకూటపు సామాన్య ధర్మములు. వికాస ప్రియుడగు బృహస్పతికి వీరినుండి ప్రబలమైన మిత్రదృష్టి! ఎంత అభివృద్ధికైనా, దోహదమిచ్చు శక్తికల దీ యోగము. లలిత కళాభిరుచి, విజ్ఞానవికాసశ్రద్ధ మాత్రమేకాక, దాంపత్యధర్మనియమములను చక్కబరచి సమాజ శ్రేయోభివృద్ధిని సమకూర్చు నేర్పు సహా, "మిథున" రాశి యందలి బృహస్పతికి కలదు. ఇంతేకాక, ఆనందేంద్రియమునకు సంబంధించిన భచక్రభాగలోనున్న చంద్రునకు సమాంతరములో ఒకవైపున ఈగురువు, నక్షత్రి యొకవైపున ఆ మేషరాశి గ్రహకూటము నిలచి

# శారదాచట్టపు గ్రహకూటము

యుండుట గొప్ప విశేషము. అగుటచే, వైవాహిక జీవితము ఈ గ్రహముల దృక్పథమునకు గురి అయినది. సనాతనాచార శ్రద్ధకలవాడు గురువు ఇతనికి ఆ గ్రహకూటమునుండి వచ్చిన ఉత్తేజనము ఎంతో స్పృహణీయమయినదే. కాని, ఇందులో ఒక చిక్కున్నది.

సైనిక ధర్మముకల మహాశూరుడు కుజుడు. స్పర్ధకు దిగినచో ముందువెనుకలు చూచువాడు కాడతడు. గురువునకు ఏకైక ప్రబలశత్రువీ కుజుడని యవనాచార్యుడు చాటిచెప్పెను. కుజగురువులు మిత్రులను సత్యాచార్యమతమును మన ప్రాచీనులే అనేకులు అంగీకరించలేదు. తామస గుణముల ఖడ్గధారితో సాత్విక స్వభావపు విద్యావంతునికి ఏటి మైత్రి? ఎక్కడి పొత్తు?

"అంగారక విరుద్ధస్య ప్రక్షీణస్య బృహస్పతేః" అని వ్రాసిన 'మృచ్ఛకటికా' రూపకకర్త కాలము నాటికే కుజగురువుల విరోధము వాడుకలో నుండినది. ఇట్టి కుజుని శత్రుదృష్టి ఇపుడు మన గురువుపై బడియుండుట! ఈ శత్రుబాధచే అతడు స్వభావసిద్ధమయిన తన యోగ్యతను కోలుపోయినాడు. అతని సనాతన సంప్రదాయదీక్ష కుజుని దెబ్బకు దిగజారిపోయినది. ఇట్టి పరిస్థితులలో, మేషమందలి ప్రబల గ్రహకూటము "స్వాతంత్ర్యము, సంస్కరణము" అని గోలపెట్టుచు, గురువును ముందుకు త్రోయసాగినది. అందులో రాజాజ్ఞ. సంఘసంస్కరణము జరిగితీరవలసినదే! కార్యక్రమ ప్రణాళికయొక్కటి కావలసియుండెను. ప్రణాళికా నిర్ణయ సంఘమునకు రాజప్రతినిధి వరుణుడు అధ్యక్షుడు. కాలదోషమువలన తుప్పుపట్టిన ప్రాత పద్ధతులు అతనికి రుచించవు. క్రమక్రమముగా వ్యక్తిత్వమును మార్గమునకు దారితీయుచు, వైవాహిక నీతినియమ శృంఖలములను తెగత్రెంచు సంస్కరణ ప్రణాళిక నొకటిని వరుణుడు సిద్ధపరచి ఇచ్చినాడు. వైవాహిక జీవిత శ్రేయస్సుకోరి పనిచేయుచున్న గురువునకు దొరకినదీ ప్రణాళికయే. రాజముద్రతో వచ్చుటచే, అనుసరించక విధిలేదు.

కాని ప్రాచీన పద్ధతులపై అచంచల విశ్వాసము కలవాడు శని, అతనికిచటి స్థానబలమున్నది. కాక చంద్రునితో మైత్రి! సాధారణముగా శనిది 'మకరి' పట్టే! మేషరాశి అతనికి నీచస్థానము. దానిలో పరిచేరిన గ్రహకూటములో ఇతనికి కేంద్ర శత్రుదృష్టి! ఆ గ్రహములు ప్రేరేపించు కార్యము 'నీచ'మని శని విశదించుకొన్నాడు; సంఘనీతి "మురారిమార్గము" పట్టగలదని కనుగొన్నాడు. గృహస్థాశ్రమ ధర్మము సంతాన వాత్సల్యము, దాంపత్యభక్తి అను అర్థము నియమములు భారతదేశములో పటాపంచలు కాగలవని భయపడినాడు; సహాయనిరాకరణ సూత్రముతో బెదరించినాడు; ఎన్నియో ప్రతిబంధకములు కల్పించి పోరాడి చూచినాడు! కాని అతి ప్రచండశక్తిగల ఆ గ్రహకూట పుధాటికి ఆగలేక నిస్సహాయుడై, చేతులు కాళ్లు ముడుచుకొని, అభావవిరక్తిని తెచ్చుకొని, "బలీయసీ కేవల మీశ్వరేచ్ఛా." అనుకొనుచు, నెమ్మది పడినాడు శని. వరుణుడు రాజకీయ ముద్రతో తన పట్టు సాధించితీరెను. ఆనాడే, బాల్యవివాహ నిషేధ శాసనము భారతపుణ్యభూమిలో వ్యాప్తికి వచ్చుట! ఎన్నియో శతాబ్దములనుండి పాదుకొని యుండిన సాంఘిక నీతి నియమములు క్షణములో కూకటివ్రేళ్లతో పెరికివేయబడినవి. ఏమి ఈ వరుణ ప్రభావము? అంతలేనిదే, సూర్యాస్తమాన సమయమున మన ప్రాచీనులు సూర్యుని ప్రతినిధిగా వరుణుని ప్రార్థించుచుండెడివారా, అనిపించును. సూర్యుని శ్రీ కార్యకర్తయగు అగ్నికి కాని, త్రిలోకాధీశుడగు దేవేంద్రునికి కాని చూపని గౌరవమును మనవారు వరుణమహాశయునికి చూపుటకు వేరు కారణమేమి?

ఒక్క ఊహ. ప్రప్రథమముగా వైవాహిక నీతి నియమములను మనదేశమున విధించిన వైదిక కాలములో, రజస్వలానంతర వివాహములను నిషేధించిన స్మార్తకాలములో సహా, ఇట్టిదే ఏదో, అసాధారణమయిన గ్రహకూటము కలిగియుండెను కాబోలు? లేనిచో, అట్టి ప్రబల సంఘసంస్కార కార్యము జరిగియుండదని నా ఊహ, శాస్త్రజ్ఞులిది పరిశోధించెదరని ఆశ.

సర్వ ప్రపంచ సామాన్యమైన ఈ గ్రహకూటములు మనదేశముపైన మాత్రము తమ మహిమను చూపనేల? అని శంకించువారలుందురేమో? ఆ గ్రహములతో ఏయే దేశములు సన్నిహిత సంబంధమును సంపాదించుకొనునో, ఆయా ప్రదేశములలో వానిఫలము చూపట్టవలసియుండును. భారతదేశమునకు మకరము లగ్నమని పాశ్చాత్యశాస్త్రవేత్తల సిద్ధాంతము. దాని అధిపతి శని ఆ రాశిలో నున్న కాలములోనే ఏర్పడిన గ్రహకూటమునుండి ఆశనికి ప్రబలశిక్ష వచ్చినది. లగ్నమునకు నాల్గవఇంట పడిన గ్రహకూటపు శేష గృహస్థాశ్రమ నీతి నియమములను సడలించివైచినది. జనసామాన్యమునకు ఈ మార్పు రుచించలేదు. అయినా తప్పినది కాదు. మనదేశమునకు గ్రహకూట ఫలము తగులుట కిదే కారణము కావచ్చును. భారతదేశమునకు లగ్నము కన్యారాశి అని మనవారు చెప్పుదురు. అది సత్యమయినచో, వేరు కారణములచే ఈ సంస్కరణము వచ్చినదేమో? ఇట్లే, ఏయే దేశములలో ఏమి సంస్కా

రములు వచ్చినవో, పరిశోధకులు కనుగొందురు. నా ఎరిగినంతలో ఒక చిన్న దృష్టాంతము కలదు. మన రాజధానితో ఇంచుమించుగా సమానమగు రేఖాంశ ప్రదేశము పశ్చిమార్ధ గోళములో (అనగా, మన పాతాళములో) ఉత్తరఅమెరికా సంయుక్తరాష్ట్రములలో నున్నది. ఆదేశపు నీతికి తగినట్లు అచట మహా సాంఘిక నీతి విప్లవమొకటి చెలరేగినదట!

ఈ శతాబ్దారంభములో జర్మనీ దేశమునందలి సాంఘిక శాస్త్రజ్ఞులలో కొందరు దిగంబర విహారము ఉత్తమమను అతివాదులు బయలుదేరిరట! వస్త్రముల తగులాటము లేక స్త్రీ పురుషులొకచోట సమావేశమయినచో, అనవసరములు, కృత్రిమములు అగు సిగ్గుబిడియములు తమంత సడలిపోయి. ఎంతో ఉపయుక్తముగా నుండగలదనుట వారిమతము. కాని, ఆ దినములలో ఈ వాదమునకచటి రాజాదరముకాని, ప్రజాదరము కాని లభించని కారణమున ఈ నూతనమతము సందుగొందుల చీకటులలో మెలగవలసివచ్చెను. అంతలో ప్రథమ ప్రపంచ సంగ్రామపు కల్లోలము రేగి ఈ ఉద్యమము చల్లబడినది. కాని, 1929 వ సంవత్సరమునకు ఇది ఎట్లో మెల్లగా సముద్రమును దాటి అమెరికాకు ఎగప్రాకి, సంయుక్త రాష్ట్రముల శిరమున జొచ్చెనట! జంకుగొంకు లేని ధీరులు, అచటి స్త్రీ పురుషులు, దానికాశ్రయమిచ్చి రక్షించినారు. దాని సూత్రములపైన వారికి గొప్ప అభిరుచి పుట్టినది. "జ్ఞానములేని పసువులకు లేనట్టి సిగ్గు బిడియములు జ్ఞానము కల మనకేల?" అని తోచినది వారికి.

"తల్లి గర్భమందు తా బుట్టినప్పుడు,
మొదట లేదు బట్ట; తుదిని లేదు;
నడుమ బట్టగట్ట, నగుబాటు కాదొకో?
విశ్వదాభిరామ. వినర వేమ."

అని మన యోగి వేమారెడ్డి సిద్ధాంతీకరించిన తత్త్వము వారికి ఎంతో నచ్చినది. ఇక, వారి సంకల్పమునకు తిరుగులేదు కదా! రహస్యసమాజములు. దొంగసమావేశములు వారికి గిట్టవు. వారిది రాజమార్గము. 1930 వ సంవత్సరమున ఏప్రిలు ప్రాంతమందే 'న్యూ జెర్సీ' రాష్ట్రములోని 'మే ల్యాండింగ్' (May Landing) పట్టణమున ప్రప్రథమముగా ఈ దిగంబర విహారోద్యమము కట్టి పునాదులతో బహిరంగముగా నొక సంస్థగా నిర్మింపబడినదట! దూరములోనుండి పేరు వినువారికి అశ్లీలత తోచరాదని, ఆసంస్థకు "సూర్యకిరణ స్నాన సంఘము" (The American Sun-bathing Association) అని శాస్త్రీయముగా వారొక మధురపు పేరు పెట్టినారు.[1]

మనదేశపు ప్రౌఢావివాహముల పద్ధతిని కాని, అమెరికా దేశపు దిగంబరసంఘ సభ్యుల ఆచారవ్యవహారములను కాని తప్పుపట్టుట సర్వథా నా ఉద్దేశ్యము కాదని మనవి. ఏ పద్ధతిలోనైనా, ఒకగుణమున్నచో ప్రక్కనే ఒకదోషము కనిపించుట సృష్టిచమత్కారము. ఇట్టి ద్వంద్వములు నశించుట ప్రళయములోనే. కాని, ఏగుణము గ్రాహ్యమో, ఏ దోషము పరిత్యాజ్యమో నిర్ణయించుకొనవలసిన బాధ్యత ఆయా సంఘముల నీతినియమములను చెందినది. సంస్కారము తగదని కాని. సంప్రదాయము దుష్టమని కాని పట్టుపట్టి వాదించుట మూర్ఖపద్ధతి.

అమెరికాలో జరిగిన సంస్కరణమువలన సంఘమున కేమి మేలు సమకూడినదో, ఏలోపము చూపట్టినదో మనకు దాని లోతుపాతులు తెలియవు ఆ ఉద్యమము క్రమముగా ఇతర దేశములకు ఎగప్రాకుచున్నదట! మనదేశములో అది వ్యాపించగలిగినచో అనుభవముమీద ఈ సమస్య తేల్చవలసి యుండును. సినిమారంగముల పుణ్యాన ఆదేశస్థుల అభ్యాసాదులు కొన్ని మన యువతీ యువకుల నాకర్షించుచున్నవి. మోకాళ్ళపైకి ఎగప్రాకు పరికిణీలు, పైటలేక పైకి ఉబుకుచున్న కంచుకములు నవనాగరికుల ఇండ్లలో ఇపుడు కన్నులపండువు కావించుచున్నవి కదా? క్రమక్రమముగా ఇది ఎంతకెక్కునో, ఎంతకు దిగునో ఊహించుట కష్టము.

మనకు వచ్చిన సంస్కరణము ఫలమును మాత్రమే ఇచట చర్చింతము. దీనితో సంఘమునకు అనేక సౌకర్యములు సమకూరినవనుట సత్యము. చదువరులకు అవి తెలియనివి కావు. కాని దీనిలోనున్న లోపమొక్కటే! సంస్కరణ మనగా, ఉన్న లోపములను సవరించి, పద్ధతిని చక్కబెట్టుటే కాని, దానిని సర్వనాశనము చేయుట కాదు కదా? ప్రాచీన సంప్రదాయపు ఆదర్శములకు ప్రత్యక్షవిరుద్ధములగు ఆశయములతో చేయబడినది ఈ శాసనము. ఏమందురా? ఇంత వయస్సు లోపల కన్యలకు వివాహము జరిగి తీరవలెననుట ప్రాచీన సంప్రదాయపు నియమము. ఇంత వయస్సు దాకా స్త్రీలకు వివాహ జరుగకూడదనుట ఇప్పటి నియమము. ప్రాచీనుల దృష్టిలో కన్యలకు వివాహము నియతము. ఇప్పటివారి దృష్టిలో స్త్రీకి వివాహము ఐచ్ఛికము! వివాహమును నియమించునది యొక్కటి; నిషేధించునది మరియొకటి. దాంపత్య బంధమును రక్షించునది మొదటిది. దానిని ఊడగొట్టునది

1. 1951 వ సంవత్సరపు మార్చి నెలలో ప్రకటితమయిన "బ్లిడ్జు" అను ఆంగ్ల పత్రిక నుండి పై విషయములు కృతజ్ఞతతో స్వీకరించబడినవి.

రెండవది. ఇదే ఇందలి తారతమ్యము. బాల్య వివాహములు జరుగరాదని శాసించుట మంచిదే. కాని అట్లే ఇరువది వయస్సుమీరి స్త్రీలు, ఇరువదియైదు వయస్సు దాటి పురుషులు అవివాహితులుగా ఉండరాదని శాసించి యుండినచో ఎంత బాగు!

ఎంతకాలమయినా పెండ్లిలేక స్వేచ్ఛగా ఉండవచ్చునను నివర్త్యప్రాయము శాసనమునుండ సిద్ధించుటచే మూడు పదుల "ముదుసలి" కన్యలు, నాల్గు పదుల "చత్వారి" బ్రహ్మచారులు సంఘములో నేడెల్లాడుచున్నారు.

"తాళితో నొక పెండ్లి,
తలప్రాలా నొక పెండ్లి
తరువాత నొక పెండ్లి, ఓ కూనలమ్మ"

అని మా 'కూనలమ్మ' పాడినట్లు, మూడు విధముల పెండ్లిండ్లు ఉండగా, మొదటి దానిని మాత్రము నిషేధించి ఏమి సాధించినట్లయినదో? తాళిబంధములేక తక్కినవి జరుగుటకు ఆక్షేపములేదని శాసనకర్తల అభిప్రాయమా? అట్టి పరిస్థితిని అరికట్టుటకు ఏమి సంస్కార మున్నది? ఎవరు పూటు? వయస్సుమీరిన స్త్రీ పురుషులకిపుడు పరస్పర సందర్శన సల్లాపములకు కోరనన్ని అవకాశములు నాగరిక జీవితము శ్రద్ధతో సమకూర్చియున్నది. నగరారామములలోని పొదరిండ్లు, సినిమా భవనములలోని చీకట్లు, విద్యార్థి గృహములందలి వ్యాసంగపు గదులు, ఇట్టివే ఎన్నియో సౌకర్యములు, వారి వారి శక్తియుక్తుల ననుసరించి వారు ఉపయోగించుకొగలరు. దీని పరిణామ మేమో!

వివాహపు ముడి పడనేని, సామాన్యముగా, తరుణీతరుణులకు కొన్ని నియమ నిర్బంధములు తమంతనే వచ్చును. పరపురుషులతో విచ్చలవిడిగా విహరించుట వివాహితలకు నీతికాదు. ప్రాపంచిక ప్రయోజన దృష్టితోనైనా, గృహస్థులు అన్యకాంతల వైపు స్వేచ్ఛగా దృష్టిసారించలేరు. గంతలు కట్టిన జట్కాబండి గుర్రములవలే, ఏకలక్ష్యముతో వారు సంసారయాత్ర సాగింపవలసియుండును. కాని, "చిన్న వయస్సునందే, ఈ నిర్బంధము లేల? కొంతకాలమయినా స్వేచ్ఛగా విహరించి, తరువాత అక్కర పడినప్పుడు గంతలు కట్టుకోవచ్చు కదా?" అనునదే ఈ సంస్కరణపు ఫలముగా తరుణీ తరుణుల కిపుడు నాటుకొనుచున్న అభిప్రాయము. సరేకాని, అంతలోగా స్వైరవిహారములోనో, నిర్బంధ బ్రహ్మచర్యము వలననో ఆరోగ్యము గంగపాలై, "రెంటికిం జెడిన రేవణ" లగుదురని, పాపము, వా రూహించలేరు. వ్యాసంగములో పడి పట్టాలు సంపాదించుకొన్న పాతికవయస్సుగల పడుచులనేకులు వివాహమాడు వరులు దొరకక నశియుచున్నారు. వాడుబారిన ముఖములతో, గుంటలుపడిన చెక్కిళ్ళతో, పలుచబారిన వక్షోభాగములతో, పాలిపోయిన దేహచ్ఛాయలతో దీనలైయున్న ఆస్త్రీలను చూచినపుడు శారదాచట్టము జ్ఞప్తికిరాక తప్పదు. వీరికి వరులను సంపాదించలేక తిరిగి తిరిగి చాలించుకొని అప్రతిపన్న మూఢమనస్కులయి యుండు పెద్దల గోడు వర్ణింపరానిది.

ఇక వరులకథ వేరు. వ్యాసంగమును ఎట్లో ముగించుకొని, వృత్తియొకటి కష్టపడి సంపాదించుకుని నగరాంతరములు చేరి పూటకూళ్ళింటి గదులలో, ఇతర బాధలలో, బాధ్యతలో లేక ఏదోరీతిగా, హాయిగా కాలక్షేపము జరుగుచుండు కాలములో అనేక బాధ్యతలు గల వివాహముపైన వారికి ఇచ్ఛయే రాదు. అధ్యాపకులైనచో విద్యార్థినులు, న్యాయవాదులైనచో అంతేవాసినులు, పారిశ్రామికోద్యోగి అయినచో పనికత్తెలు, వైద్యులయినచో "నర్సమ్మ"లు చుట్టుముట్టి కటాక్షములు క్రుమ్మరించుచుందురు. ఆయాచితముగా లభించు ఈ సౌకర్యములను పోగొట్టుకొని, కన్నులకు గంతలు కట్టుకొనుటకు ఏ తరుణుడు కోరగలడు? అదో ఇదో అనుచుండగనే 'చత్వారి' తొంగిచూడగలదు. తరువాత వివాహమేల? కావలెనని కోరితే మాత్రము, అంత వయస్సుముదిరిన వరులను శీలవతులగు ఏ కన్యలు పెళ్ళియాడగోరుదురు? ఏ మూడవమాటి ముత్తయిదువనైనా ఆశ్రయింపవలసినదే.

ఈ సందర్భమున ఒక చిన్న సన్నివేశము జ్ఞప్తికి వచ్చుచున్నది. అయిదేండ్లకు పూర్వ మొకనాడు బెంగుళూరు నగరములో ఉన్నతవిద్య, ఉపాధ్యాయవృత్తి, తగుపాటి అర్జనశక్తి, ఆకార సౌష్ఠవముగల తరుణు డొకనిని చూచి మాటలాడుచు ప్రస్తావవశమున వివాహపుమాట పుట్టించితిని. అతడేదో జుగుప్సతో నోరుచప్పరించి,

"తగిన కన్యక లెవ్వరూ రాలేదండీ!" అనిదీర్ఘము తీసినాడు.

"ఇంత నగరములో కన్యకలకు కరవా?" అని నా ఆశ్చర్యము వెలిబుచ్చితిని.

"అది కాదండీ! నేను ఆదర్శవాదిని. మంచి అందము, మేలురకపు వన్నె, ఆధునికవిద్య, చక్కని ఆకారము, నాగరిక సంస్కారము, అరణమిచ్చు శక్తి అయిదడుగుల మూడంగుళముల ఎత్తు, కనీసము నూరు పౌన్లకు తగ్గని తూకము, రమారమి పాతికవయస్సు కలిగి గృహకృత్యనిర్వహణదక్షురాలయిన కన్యకను నేను కోరుట. ఎందరో కన్యకలు వచ్చి చూచినారు. కాని, వారెవరూ నాకు నచ్చలేదు. ఏదో, ఒకలోపము."

ఈ ఉపన్యాస ధోరణిని విని నాకు నవ్వు వచ్చినది. ప్రయాసతో అపుకొని,

"ఇన్ని సుగుణములున్న కన్యక మిమ్ములను వెతుకుకొని వచ్చునా?" అంటిని.

"అందుకే వివాహము లేదు."

"పోనియ్యండి. మీరు కోరిన గుణములన్నీ కల ఇద్దరు కన్యల నెరుగుదును. కాని, వారిలో ఒక్కొక్కరొక కోరిక కోరుదురు. ఆ కోరిక అయినా, మీ శక్తికి మించినది కాదు. అది తీర్చగలిగితే, వారెవరైనా మీకు తగియుండగలరు."

"నా శక్తిలో ఉన్నచో, అవశ్యకముగా ఆ కోరిక నెరవేర్చగలనని వాగ్దానము చేయగలను. వారెవరో, కోరిక ఏమో, చెప్పండి." అని ఆత్రము కనుపరచినాడతడు.

"చాలా సంతోషము. వారి కోరికలు మొదట చెప్పెదను. ఎవరి కోరిక మీరు తీర్చుటకు సిద్ధపడుదురో తెలిసిన తరువాత, ఆమెను గూర్చిన ఇతర వివరములు తెలుపుదును." అంటిని.

"సరే!" అని సావధానత చూపినాడు అతడు.

"ఒకతె మంచి గుణవంతురాలు. శీలముపైన అపారమైన పట్టింపు. వయస్సు ముదురుపాకములోనున్న వరుడు శీలవంతుడుగా బ్రహ్మచర్యమును నిలుపుకొన్నాడనుటకు విశ్వసనీయమగు సాక్ష్యము నామె కోరును. వేరేమీ ఆమెకు ఆశ లేదు." అంటిని.

విచ్చు కన్నులతో నావంకజూచి బొమలు చిన్నగా ముడివైచి, తలవంచి ఆ వరుడు, మెల్లగా,

"రెండవ ఆమె కోరిక?" అనెను.

"రెండవ ఆమెకు శీలముపైన అంత పట్టింపు లేదులెండి (అతని ముఖమునకు కొంత వికాసము వచ్చినది.) "ఆమె యథార్థ వాదిని. ఏదో పొరబాటు జరిగి రెండుమార్లు ఆమె గర్భ విచ్ఛిత్తి చేసుకోవలసి వచ్చినది. తన్ను వివాహమాడగోరు వరునికి ఆ విషయమై అతృప్తి ఉండరాదని ఆమె కోరిక."

నేను ముగించీ ముగించకమునుపే ఆ వివేకవంతుడు తటాలున లేచి కంటుముఖముతో, చురచుర చూచుచు "నాకు వివాహము అక్కరలేదండీ!" అని తిరిగియైనా చూడకుండా వెళ్లిపోయినాడు. నవ్వుకొంటిని! ఇప్పటికినీ అతడు అవివాహితుడే. ఇంక వివాహమెందుకు?

"మాకేలరా, సంసారము?
మరునిగన్న శ్రీ రామచంద్రా"

అని 'రవిచంద్రికా' రాగములో శ్రీ త్యాగరాజు పాడిన కృతిని కొంత మార్పుతో పాడుకొనుచు శరీరయాత్ర గడుపుచు వచ్చినచో, అతనికి మాత్రమే కాక, సంఘమునకు సహా ఒక విధముగా క్షేమమే అని నా తలంపు. నా మిత్రుడు సెలవిచ్చినట్లు ఏమి కాలవైపరీత్యమో ఇది?

రాజ్యాంగమువారు ప్రజలపైన ఇన్నిపన్నులు వేయుచున్నారు కదా? 25 ఏండ్ల వయస్సు మీరి పెండ్లికానివారికి తూకముగా "బ్రహ్మచారి పన్ను" విధించినచో (కూలివారికి తప్ప), ప్రభుత్వమునకు ధనము వచ్చును. ఏడాది రెండేండ్లలో అవివాహితులుండరు కదా! ఈ అరణ్యరోదనమును చాలించి, ప్రకృతాంశమునకు వత్తము.

1930, ఏప్రిలు, మొదటి తేదీన సంభవించిన గ్రహకూటములో ఒక విశేషతను కనుగొంటిమి కదా? ఏదో రాశిలో భిన్న భిన్న భాగములలో అయినాను గ్రహములు చేరినచో, అది గొప్ప గ్రహకూటమని సాధారణముగా భావించుట వాడుక. ఒకటే భాగలో మూడు నాల్గు గ్రహములు చేరి, ఆ భాగకే నికరముగా ఇతర రాసులందలి గ్రహములనుండి దృష్టి వచ్చినచో, (ఇప్పటివలె) అది ప్రబల శక్తిగల గ్రహకూటమగును. "ప్రశంసలోని సందర్భములో మేషరాశి ని 11° వ భాగపైన ఏడు గ్రహముల ప్రభావము వ్యాపించియున్నది. దీనికి ప్రబల శక్తి యుండుట వింత కాదు.

కాని, ఈ గ్రహకూటము వ్యక్తి జీవితములో ఫలము చూపదా? అనవచ్చును. నిస్సందేహముగా చూపవలసినదే. ఆ దినమున జనించిన వారిలో ఈ కూటముతో సన్నిహిత సంబంధమును సంపాదించు కొన్న జాతకుల జీవితములను గమనించితిమేని, ప్రశ్నకు సదుత్తరము లభించగలదు. అటి జాతకములు సంపాదించుటకై ప్రయత్నించితిని కాని, కృతకృత్యతకు నోచుకోలేదు. శాస్త్ర విశ్వాసము గల పాఠకమహాశయులలో ఎవరైనా అట్టి సామగ్రిని సంపాదించి నాకు అనుగ్రహించిరేని కృతజ్ఞుడను.

జన్మకాలిక గ్రహములు తమతమ ప్రభావములను తమ స్థానములలో నిక్షిప్తము చేసి వెళ్ళగా, తరువాత చలిత గ్రహములో, చార గ్రహములో, కాలక్రమమున ఆ స్థానములకు వచ్చియో, వానిని చూచియో, తమ శక్తి ననుసరించి ఆ ప్రభావములను రగులుకొలిపి, వ్యక్తము చేయుననుట శాస్త్రమర్యాద గదా? ఈ గ్రహకూట స్థానములకు సయితము ఆ న్యాయము వర్తించునేమో అని కొన్ని వందల జాతకములను పరీక్షించితిని. ఈ గ్రహ స్థానములలో కాని, వాని మేధా స్థానములలో కాని (11°, 26° భాగలు). మూడింటికి తప్పక కాని నికరపు సంబంధములు గల జాతకములు కొన్ని లభించినవి. వానిలో జీవిత కథలు తెలిసినవి మాత్రమే మన చర్చకు పనికిరాగలవు. అట్టి వానిలో కొన్నింటిని మాత్రము పాఠక మహాశయుల కిచట నివేదింతును.

విద్య సామాన్యమయినా, యుక్తి చమత్కారములు హెచ్చుగాగల చతుర ఈమె. కార్యశూరురాలు. అపరిమిత స్వాతంత్ర్య శ్రద్ధ. పట్టు వదలని ప్రౌఢ మానిని. ఎన్ని ప్రతిబంధకములు వచ్చినా, ఎవరికి నచ్చకపోయినా, లక్ష్యపెట్టక, ఎన్ని ఉపాయములో చేసి, తాను నిర్ధరించుకొని యుండిన తరుణునినే పట్టుపట్టి పెండ్లియాడి, "నా ప్రతిజ్ఞ తీరినది. చాలు పొమ్ము." అని భర్తను సాగనంపి, తరువాత అతడెంత ప్రయాసపడినా, సంసారమునకు వెళ్లక, నిశ్చింతగా పుట్టినింట ఏదో వృత్తితో కాలము గడపుచున్న సాహసప్రియ ఈమె.

## II పురుషులు

(1) [మేషము 10°. రవి; మిథునము 11° క్షేమ సహమము; మేషము 25° శుక్రుడు లగ్నములో; మిథునము 26° కుజుడు.]

చక్కని విద్య, ఆర్థికవసతిగల వృత్తి, అంగసౌష్ఠవము, ఆకారపుష్టి, ఆభిజాత్యముకల వ్యక్తి ఇతడు. ఇతనిని గూర్చి విని నోరూరి విలక్షణవతులగు సజాతీయ కన్యకలు, ఎంతోమంది. పతింవరలై వచ్చి చూచినా, వారిలో ఈ విలాసపురుషునికి రంభగాని, ఊర్వశి కాని అగుపడలేదు. ఇతనిది ఒక విజాతీయ మనస్తత్వము! రాను రాను కన్యకలీ యాత్ర చాలించుకొన్నారు. ఏ దేవ కన్యక కాచుకొని యున్నదో ఎరుగరాదు. ఎవరు చెప్పినా వినడు. తన 'మురారి' మార్గమే తనది. వివాహము అక్కర లేదనును. తగిన కన్యక లేదని అతని హాసము. వయస్సు, ధనము, సౌకర్యములు, వివాహకాంక్షగల వ్యక్తి మూడుపదులు దాటినా కన్యను కుదుర్చుకొనలేకపోయినాడే? "దీని భావమేమి, తిరుమలేశ," అనుచున్నారు కొందరు.

(2) [మేషము 11° వరుణుడు; మకరము 11° శని; మిథునము 11° గురువు; మీనము 11° దశమ కేంద్రము.]

ఇతడు ఆగర్భ శ్రీమంతుల ఇంటి బిడ్డడు. అందమైన వ్యక్తి. విద్యావంతుడే. వివాహమైనది కాని, ఇతని రాసలీలావిశేషములకు అది ప్రతిబంధకము కాలేదు. స్వైరవిహారప్రియుడు. వయస్సు చిన్నదే. భావి ఎట్లు పరిణమించునో!

(3) [మేషము 11° శుక్రుడు; సింహము 11° లగ్నము; మిథునము 11° దాంపత్య సహమము; వివాహ సహమమునకు యమునివేధ.]

గ్రహకూటపు భాగలోనే శుక్రు డుండగా, దాంపత్య, వివాహ, సహమములు భిన్నములయిన ఇతని జీవితమునకు వ్యాఖ్యానము అనవసరము. వలచి వివాహమాడిన గుణవతి, రూపవతి అయిన భార్యను నిష్కారణముగా వదలిపెట్టి, కృష్ణలీలలతో కాలము గడుపుచున్న లలితకళోపాసి ఇతడు. దయాదాక్షిణ్యములు లేని స్వార్థపరుడైన కృతఘ్నుడు!

(4) [కుంభము 11° కుజుడు; మేషము 11° గురువు; సింహము 27° ఇంద్రుడు. కుంభము 26° శుక్రుడు; ధనుస్సు 26° చంద్రుడు.]

స్ఫురద్రూపము, ఉత్తమవిద్య, ఉన్నతోద్యోగము, ఆర్థికసౌఖ్యము, ప్రవీణురాలగు భార్య, అనుకూలదాంపత్యము, సత్సంతానము, వంశగౌరవము కల యువకుడితడు. సైనికతత్త్వముకల కార్యశూరుడు; సరససల్లాపచతురుడు; వ్యవహారదక్షుడు. అంతా సరే కాని, ఇతనిలో గొప్పలోపమొకటి కలదు. 'పరాంగనా రత్యభిచార పేశలః' అను వర్ణనము ఇతనికి చెల్లును. ఒంటిపాటున పరకాంతలను చూచెనేని, ప్రబల వ్యామోహపరవశుడై, మొండిచొరవతో వారిని చెనకి చీవాట్లు తిను స్వభావము ఇతని దోషము.

(5) [వృషభము 11° రవి; మిథునము 11° కుజుడు; కుంభము 11° లగ్నము.]

ఎట్టి కన్యక తనభార్య అగుటకు అర్హురాలో, ఉపన్యాసమును నాకు వినిపించి, కడకు వివాహము అక్కరలేదని వెళ్ళిపోయిన వివేకశాలి ఇతడే.

ఇంకా కొన్ని దృష్టాంతము లున్నవి. గ్రంథవిస్తరణభీతిచే, ఇంతటితో చాలింతును. ప్రశంసలోని గ్రహకూటము వ్యక్తిజీవితములలో ఎట్లు ఫలమును చూపెనో, పాఠకమహాశయులు గమనించెదరు. వైయక్తికముగా ఫలములలో వ్యత్యాసము కనుపించినా, ఇవి అన్నింటిలో సూత్రప్రాయముగా తోచు సమాన ధర్మమొక్కటే అనుటకు సందేహము లేదు. ఇతర గ్రహభావాదుల ననుసరించి వైయక్తిక భేదములు వచ్చియుండగలవు కదా?

ఇప్పటికి ఇంత చాలును. రైలుబండ్లలో బిచ్చగాడెవడో పాడిన కాలజ్ఞాన తత్త్వపుపాటలో కొన్ని చరణములు నాకీసందర్భమున స్ఫురణమునకు వచ్చుచున్నవి. ఈ క్రింది పంక్తులలో నున్నవే అవి:

హరి, గోవింద, గోవిందా.
హరహరా, శివగోవింద, గోవిందా. (పల్లవి)

1. పెండ్లి కూడ దనేరు; పిల్ల లెందుక నేరు;
   పెంకితనమును నేర్చి, పెరిగేరురా. ॥బ్రహ్మం॥
2. చుక్కలై మెరిసేరు; చూలు దిగతాగేరు;
   పెండ్లి మాటెత్తితే, బెదిరేరురా. ॥బ్రహ్మం॥
3. సిగ్గుబిడియము లేక, స్త్రీలు చెల్లాటమై,
   దిన్నమూతితో బైట, తిరిగేరురా. ॥బ్రహ్మం॥
4. పెండ్లిపేరంటాలు, పేరుకైనా లేక,
   పెద్దింట్ల వంశాలు, పెరిగేనిరా. ॥బ్రహ్మం॥

# విద్యా విధానం!

## శ్రీ పులుగుండ్ల రామకృష్ణయ్య

టంగ్, టంగ్, టంగ్ మని ఊళ్ళో బడిగంట వినబడ్తోంది. ఆ బడి రామాపురం ఊరి గవిళ్ళో ఉంది. పేదవాళ్ళ బిడ్డల చదువుకోసం ఏర్పాటయిన దిది.

ఆ బడికొచ్చి చదువుకొనే బిడ్డల గతి స్థితి ఎలా వుందో, అలాగే ఉంది ఆ బడి స్థితి కూడాను. తైల సంస్కారం లేక ఆ బిడ్డల జుట్టు ఎలా రేగిపోయి చిర్రపారి యెగుడు దిగుడుగా ఉంటో, అలాగే ఆ స్కూలు పై కప్పు కొంత గాలికి ఎగిరిపోయి, కొంత చెదలుతిని అవకతవకగా ఉండటమే కాక, చుట్టూ అడ్డగించిన దడి కూడ ఆ బిడ్డల ఒంటిమీద గుడ్డల్లాగే, చినిగి పీలికలు పీలికలై, అతుకులు బొతుకుల్తో పిల్లల ఒంటికి ఆచ్ఛాదనగా ఉన్నట్టే, ఆ బడికి నిమిత్తమాత్రం అడ్డగింపు. గర్భదరిద్రులబిడ్డలు ఊళ్ళో ఎంగిన, గాలిన అడుక్కొని తినటం మూలాన చెమటపట్టి, శరీరం ఆపాదమస్తకం, మట్టి చారల్తో ఉప్పు పేలిపోయినట్టే, ఆ బడి గోడలు వానకు తడిసి చారలుపడి, ఉప్పుగాసి పోయి కనుపట్టడమే గాక విద్యార్థులనుంచి వచ్చే దుర్గంధం బడినుంచి వెలుపలికి కొడ్తోంది.

ఈ బిడ్డలు ఊళ్ళో కవళం అడుక్కొని తింటూ బ్రతుకుతూంటె, వీళ్ళగురువు తనబిడ్డలు టౌనులో హైస్కూల్లో చదువుకొంటున్నారని, కూతుళ్ళు ఎదిగి పెళ్ళికి సిద్ధంగా ఉన్నారని, వాళ్ళకు పెళ్ళిళ్ళు చేయాలని యోచిస్తాడు. అంతే. కాని వాళ్ళకు వీళ్ళకు ఉండే తేడా ఏమిటంటే బడిపంతుళ్ళ చేతుల్లో మూకుళ్ళుండవు. బడిపంతుళ్ళ ఆకారం, వస్త్రధారణ, ఉనికంతా పగటి వేషాలవారికి నమూనాలుగ ఉంటాయి.

ఆ గ్రామంలో రాగయ్య ఓ పెద్ద ఆసామి శంకరయ్యగారి కమతం సేద్యగాడు. ఇతడికి పదిమందిబిడ్డలు. వీరిలో ముగ్గురు నలుగురు ఆస్కూల్లోనే చదువుకొంటున్నారు. తలిమూర్తవారు అర్భకులు-కూనా గురుజాబిడ్డలు. శంకరయ్య ఆ గ్రామపంచాయతి ప్రసిడెంటుకూడ— గ్రామంలో పార్టీపట్టుదలకోసం ప్రసిడెంటయ్యాడు. పంచాయతీ పరిపాలన, మంచిచెబ్బర్లు, ఈ పార్టీల గొడవల్లో పట్టించుకొనే ఎరుగడు అని వినికిడి.

తరాలుగ ఈ రాగయ్య కుటుంబీకులు ఈ శంకరయ్య కమతంలో సేద్యగాళ్ళు. సుబ్బయ్య—రాగయ్య తండ్రి ఇరవయ్యయిదేండ్లు సేద్యగాడుగ గడిపాడు. పినపసికుబడులు ఇన్నేళ్ళు కామందుకు కష్టంచేసి మిగిల్చుకొన్నది అరిగిన రెముకలు, కరిగిన కండలు, ముడతలుపడ్డ శరీరం, బరువులు బండలు మోసి మోసి కాయకాచిన బట్టశల. కూడా బుట్టిన దోషానికి అతడను కనిపెట్టుకొని ఉన్న వెంట్రుకలను చూస్తూంటే బ్రతికిచెడిన సంసారంలోని హంగు సంగులు ఏవీ ఉండీ లేనట్టు కనబడ్తున్నాయి. ఎవరో ఈ వృద్ధుణ్ణి యెరిగిన ఆయన హెచ్చరించుకొని "ఏం సుబ్బయ్యా! కళ్ళు చెవులు రెండూ పోయినాయే?" అన్నాడు.

"అయ్యా మావాళ్ళ కష్టాలు చూళ్ళేక కళ్ళు, వినలేక చెవులు రెండు పోయినాయి. అలవాటు పడ్డ మమకారం కొద్దీ ఒకళ్ళ పాణాలు ఒకరిమీద పడి కొట్టుకలాడ్తుండాయి" అన్నాడు డగ్గుత్తికతో!

ఈ సుబ్బయ్య హయాంలోనే వీళ్ళకుటుంబానికిని స్వంతసేద్యం ఉణ్ణింది. కాలం కలసిరాక కొంత, కుటుంబాన్ని పోషించలేక ఋణబాధలకు కొంత విచ్ఛిన్నమై నష్టపడిపోయి, మిగిలిన ఆ రవంత కయ్య కాల్వ ఈ శంకరయ్యకే విక్రయించి సేద్యగాడైనాడు. ఇప్పుడా భూమినే సుబ్బయ్య కొడుకు యకరాకు రెండుపుట్లు పండించి శంకరయ్యకు కూటు కడ్తున్నాడు. రైతు పేదయితే భూమికూడ పేదంటారు.

కొన్నాళ్ళు రాగయ్య కుటుంబీకులు భూకామందులు, సొంత సేద్యగాళ్ళు, తర్వాత పాలిగాళ్ళు, ఆ తర్వాత కూలివాళ్ళు, ఇప్పుడు బిచ్చగాళ్ళు.

రాగయ్యకు ఆరు నెలల క్రితం పక్షవాతం తగిలింది; మూలపడ్డాడు. ఈ వ్యాధిగ్రస్తుడు కాటానికి ముందు పూట గడవనివాడు, ఇంట్లో పురుళ్లు పుణ్యాలకు, అదనంగా అప్పుడప్పుడు, తన కామందు శంకరయ్య దగ్గర పట్టుబళ్లు పట్టాడు. ఈ పట్టుబళ్ళకంతా నాములు కట్టి, పుట్టి నాలుగువందల లెక్కకు ఖరీదు

కట్టి రు 150/-లకు రాగయ్యచేత 1-8 0 వడ్డీ లెక్కను బాకీకి ప్రోనోటు వ్రాయించుకొన్నాడు. రాగయ్యకు రావలసిన పెట్టుబడి సాలాఖరు వరకు చేస్తేనే కద్దు, లేకుంటే లేదు. రాగయ్య సాలాఖరు కాకమునుపే రోగాన పడ్డందున శంకరయ్య బాకీ వర్తించదు.

ఇక భార్య ఉంటే బాలింతగ మాలింతగ కొన్నాళ్లు సేద్యంపనులు జరగని కాలంలో పస్తులన్నా ఉండాలి, లేక కవళం అన్నా తెచ్చుకోవాలి. ఇన్నాళ్ళనెన్న పాలసీ ప్రిమియం చెల్లించన్నాడు లాప్సయినట్టు, రాగయ్య రోగాన పడ్డనాడే జీతం బిగిసిపోయింది. కీళ్ళు తొలగి ఎముకలు విరిగేటట్టు పని చేసినా నాడే అంతంత కూలు;—మరి ఇప్పుడు అప్పుభారం కూడా. ఈ పరిస్థితుల్లో రాగయ్యకు చావుకంటె బ్రతకటమే భయంగా ఉంది. రోగం కుదుర్చుకోవాలని కంచం, చెంబు, చెరవతో కూడ అమ్ముకొన్నాడు. ఏం లాభం లేకపోవటమే గాక, ఇంటా ఒంటా బలం తగ్గేకొద్దీ రోగ్గానికి బలం హెచ్చి మృత్యుదేవతకు అండయింది. భార్యాభర్తలు ఉభయులు ఆర్జించే రోజుల్లోనే కూటికి అరదట్లయితే ఇప్పుడు పస్తే గతయింది. ఇప్పుడు ఒక్క రాగయ్య భార్య నరసమ్మే ఇంటికి ఆధారమయింది.

ముసలివాడు; రాగయ్య తండ్రి సుబ్బయ్య— తన కడుపుకు తాను కవళం తెచ్చుకొని, మిగిల్చి పిల్లలకు పెడుతున్నాడు. కూటికే ఇట్లుంటే ఇక గుడ్డగతి! ఆకాశం దుప్పటి అంటూ పంచుకొని కప్పుకుంటున్నారు. ప్రాణానికి కూడు లేదు, మానానికి గుడ్డ లేదు. రాగయ్య సంపాదించే రోజుల్లో 'ఒకపూట పస్తున్నా ఇంకో పూటైనా తిని బడి కెళ్ళి చదువుకొనేవాళ్ళు బిడ్డలు. ఇప్పుడు నాయన మూలపడ్డనాట్నుంచి పిల్లలే పెద్దలై సంసారాన్ని నెగ్గిస్తున్నారు. ఈ గతుల్లో వీళ్ళకు శారీరకంగా, మానసికంగా కూడ వృద్ధాప్యం తరుముకొని వస్తూంది. ఈ పరిస్థితుల్లో ఒకపూట బడికిపోతే ఇంకోపూట నాగా! ఇంత శక్తి లేక పరిస్థితుల్లోకూడ పిల్లలు ఎంతో శ్రద్ధగా వినుకపడ్డ పాఠాల్ని చదివి తోటి పిల్లలతోటి కలుసుకొంటున్నారు.

తరతరాలుగ ఎండన గాలిన అల్లాడి అతుకులు మేసి గుండెల్ను మురగకొట్టుకొని మిగిల్చింది ఏమీ లేదని, పోనీ బిడ్డలైన చదువుకొని వాళ్ళ హయాంలోనైనా నీడపట్టునవుండి, కొత్త వైనవైన బ్రతుకు బ్రతుకుతారని తల్లిదండ్రులకు కొండంత ఆశ. పాపం! మరి అవకాశం ఆకాశమంతదూరం; అందుబాటు శూన్యం. దరిద్రుడు తలగడిగితే వడగళ్ళవాన వచ్చినట్టయింది.

బళ్ళో మళ్ళీ రెండోగంట కొట్టారు. ముందు రోజు కవళానికి పోయినందువల్ల పిల్లలు బడికి పోలేదు. జరిగినపాఠాలు వల్లెవేస్తున్నారు. ఊళ్ళో పిల్లలంతా బడికి బయలుదేరారు. కలవారిబిడ్డలు, తలలు దువ్వుకొని పూలు పెట్టుకొని మంచిగుడ్డలు కట్టుకొని ఉత్సవ విగ్రహాల్లాగా కళకళలాడుతు వస్తుంటే, రాగయ్య బిడ్డలాంటివాళ్ళు తాల్చుకోపోయిన తలల్తో, మాసిపోయిన గుడ్డల్తో వస్తూంటే దేవాలయంలో పూజ, పులికాపు అలంకరణలేని విగ్రహాల్లా కనుపడుతున్నారు. రాగయ్యబిడ్డలు బడికిపోవటానికి సిద్ధమయ్యారు.

ఇంతలో వాళ్ల తల్లినరసమ్మ వస్తూండటం ఓ అమ్మాయి చూచింది.

"అమ్మేయ్? అమ్మ వస్తూందదే యిట్లా? కవళానికి పొమ్మంటె బడికిపోతుండామని అరస్తదే! ఏం చెప్పనమ్మే!"

"అమ్మతో చెప్పి పోదాం లే! అమ్మ కూలిగింజల్నియిచ్చాల దంచి కొస్తది లే, చాలకుంటె బడినుంచివచ్చి కవళానికి పోదాంలె" అని ఇంకో అమ్మాయి అనింది.

"ఇవకుండా పెత్రదం జేస్తే యిట్లా?"

"అప్పుడు జూస్తాంలె. అరబాక అమ్మేయ్! అమ్మ ఇంటది!" అని తలపోసుకొంటున్నారు.

ఇంతలో నరసమ్మ వచ్చింది. ఈమెకు ఎవరో కూలిగింజలు ఇయ్యాల్సిండి అడగనుబోతే, వాళ్లు లెక్కచూచి, ఇంకా నరసమ్మ, ఇద్దరు మనుష్యులు అదనంగా పని చెయ్యాల్సినట్టు, కూలిబాకీ పడినట్టు, బాకీ చెల్లుపెట్టందే, ఇంక గింజకూడ కంటికి చూపమని ఆసామి అంటె, ఆమాట చెవుల వేసికొని కాళ్ళీడ్చుకుంటూ ఇంటికొచ్చింది. పిల్లలవాలకం చూసింది.

"ఇదేంది కూతరా! ఈ ఊరేగింపులు? బడికొచ్చిందా తొందరా? చెప్పింది దొంగలకు దోలి ఈ రకానికి తిరుక్కున్నారే? ఇదేం దిది? ఈ జానేతనం? ఊళ్లో కవళానికి పొమ్మంటె ఈ వంతవ సంబరాలు పడ్తుండారే! ఇయ్యాల పస్తుంటారా? కూడుకూడు వకవక లాడ్తుంటె కనబల్లా? పాట్ల జాడండి యాడికొచ్చింకా? ఇంక మీరు తెల్లార్చేదెప్పుడో చెప్పండి!"

# విద్యా విధానం!

"ఈపూట నీ కూలిగింజలు దంచి వాళ్ళకోని పూట ఎల్ల దోసుకొంటె సందాల కవళానికి పోతాంలె" అన్నారు పిల్లలు.

"అయ్యో ఎప్పుడో ముగించి మొఖం కడిగినార్లే—" అనింది నరసమ్మ. ఎంత చెప్పినా వినకుండా మొండి జేశారు పిల్లలు.

"చదివి సంతరించినమటుకు చాల్లే! బళ్ళో అయ్యోరు చెప్పే పాఠాలు చదువుతుంటె మేము చెప్పే పాఠాలు చదివేదెప్పుడూ? కూడు నీళ్లు లేక అంటు డొక్కల్తో ఎన్నాళ్లు చదవతారమ్మ? వీథుల్లో ఉసుకుదుమ్ముల్లో కాళ్లు కాలకముందే పోయి నాలుగు మెతుకులు తాండమ్మ! ఒక్క పేగుల్తో ఎన్నాళ్ళు బతికేను? ఆకలికి చెవులు కప్పుకోని ఏమి గమ్మతుండది నాయనో. కూన గురుజు విడుస్తుండారు. ఎన్నియుగాలయిందో కడుపార తిని. ఎవురి నోటికాడకూడు తీశామో, ఏం పాపమో దేవుడా!" అని ఏడ్చింది నరసమ్మ.

"అమ్మ ఏడుస్తుందడి—బడికొద్దు ఏం వొద్దు. కవళానికి పోదాం పదండి" అని పుస్తకాలు అక్కడ బెట్టి మూకుళ్లు తీసుకోని వెళ్లారు పిల్లలు. దూరంలో "కవళం వెయ్యండమ్మ" అని కేకలు వినవస్తున్నాయి. నరసమ్మ అవంకే చూస్తూ ఆరిపొయ్యే పెదిమల్ని కన్నీళ్ళతో తడుపుకొంటూ, కడుపులో రేగిన మంటను, ఆ వేదనను నిట్టూర్పులతో విసరుకొంటూంది.

ఒక బిడ్డను అంటిజేసుకోని, రాగయ్య పడిపోయిన కాలు చేయి యీడ్చుకొంటూ ఊళ్ళో కవళం తెచ్చుకోని తనపొట్ట తాను పోసుకొంటూ కాలక్షేపం చేస్తున్నాడు.

రాగయ్య కుదరని పక్షవాతంతో, పడిపోయిన పార్శ్వాన్ని, బాగున్న పార్శ్వంతో గుంజుకుంటూ నడవటం నేటి సంఘంలో సంపన్నుడికి, పేదవుగల వ్యత్యాసం, వికారం స్పష్టపరుస్తూంది. అంతేకాదు. తన తోటిబిడ్డల్ని ఊళ్ళో కవళానికి తీసికెళ్ళటం చూస్తే ఈ అడుక్కొతినటం తమతరంలోనే గాక తమ బిడ్డల తరంలోగూడ తప్పదని రూఢిచేస్తున్నాడు రాగయ్య.

చదువుకోటానికి వసతులున్న పిల్లలు అయ్యవారు నేర్పిన పాఠాలు పలుకుతూంటే, రాగయ్య బిడ్డల్లాంటి వాళ్లు "కవళం వెయ్యండయ్యా! కడుపులో మంటమ్మా!" అని వీథుల్లో పేగులు తరుక్కుపొయ్యేటట్టు అరుస్తున్నారు.

"పిల్లలు బడికి రాలేదేమా" అని అయ్యవారు పిల్చుకోపోటానికి వచ్చాడు.

"ఏం నరసమ్మా! పిల్లలు ఒకపూట బడికొస్తే ఇంకో రోజు రారే" అన్నాడు అయ్యవారు.

"ఈరోజున్నట్టు రేపు ఉంటుందనే నమ్మకం లేకపోయనే అయ్యా! మా బతుకులకు పండగా, పర్వమూ, పుణ్యమా, పురుషార్థమా ఏమీ లేదు. నిద్దర్లేస్తే ఆకలమ్మకు నయివేద్యాలతో పొద్దు చాలడంలా నాయనో! మా కుటుంబగం గతి ఒకరు దక్క చేసేదిగాదు. కడుపు చించుకొంటె కాళ్ళమీదపడద్ది. ఎండనక, వాననక, తేళ్ళకు పాములకు ఎరవక, పిడికెట్లో పాణాలు పెట్టుకోని, మేఘాలమీద పొయ్యే గొడ్లను మరిపి, కయ్యాలకు కాలవలకు ఒళ్లు ముడవలు యేసి, పండించి, కామందుల గోరికమతాల్ని ఇళ్ళ వాకిళ్ళను లంకల్ని జేస్తిమి. కళ్ళు పొడుచుకొన్నా కానరాని కటిక సీకట్లో గొడ్లను మేపితిమి. కలలో అయినా తిన మన అనుకున్న దోషాన అన్నాపోయి ఎరుగుదుమా నాయనా! ఇట్ట చాకిరి జేస్తే మా బిడ్డలు, దొంగలైన తోడుబోతులైన అనుకోకుండ మాగతులు తెల్లార్చుకోని, కడకు బిచ్చగాళ్లమయితిమి. చచ్చినావా బతికినావా అన్న దోషాన బోయిన కామందు లేకపాయ. ఎన్నాళ్ళు చాకిరి చేస్తే ఏంలాభం నాయనా! కాపడు కామందుల గొడ్లకుండే వైనం మాకు లాకపాయ. వాటికి పెంకు కొట్టాలు. మేము చెట్టుకింద కాపురం జెయ్యాల. ఏనాడు కామందుకు కీడు ఎంచినోళ్ళం గాదే! సంపాదించి పెట్టేవాడు మూలబడి మా కర్మం ఇట్ట కావాలా చెప్పు నాయనా." అంటూ నరసమ్మ కన్నీళ్ళు పెట్టుకొనింది.

"పరిస్థితులిట్టుంటె పిల్లలు బడికొచ్చి చదువుకోమంటె ఏ బుర్రలో ఈ కత్తులు ఇముడుతాయి చెప్పమ్మా. లోక కళ్యాణం కోరే కవులకన్నా మనమీద దయలేకపాయ. వాళ్ళ కవిత్వాలకు మన కష్టాలు బాధలు చాలక ఇంకా వేలురకం కష్టాల్ని సృష్టించుకోటంలో పొద్దుచాలక శ్రమపడుతున్నారనుకొంటున్నా! పోనీలే. ఇంతకంటె మనం ఇంకేం చేస్తాం తల్లీ? మనం ఇట్టుండవే లోకానికి మేలయితే ఇదే పదేలు. మన బాగుకోసం ఒకర్ని బాధపెట్టి మనం బాగుకొనేది ఏముంది? చదువుకోని వృద్ధిలోకి రావాల్సిన బిడ్డలు ఒట్టి బిచ్చగాళ్లుగ దేశదిమ్మరులై పొయ్యే గతి పట్టిందే. ఎంత దౌర్భాగ్యం! గర్భవతులూ, బాలింతలు పాత్రల్లో బిడ్డల్ని పెట్టుకోని యాచించటం, రోగులు, కుంటి గుడ్డి అడుక్కొతినటం చూస్తుంటె

ఎంత అవమానంగా ఉంది, రాగయ్యా! ఈ పూట బిడ్డలు బడినుంచివచ్చిన పాట మనఇంట్లో అన్నం తింటార్లే. నే నొస్తా. ఆలస్య మవుతూంది." అంటూ అయ్యవారు వెళ్ళిపోయాడు.

పిల్లల్ని బడికి పంపించాలని ఆశొకవంక, పంపిస్తే పస్తులుండాల్సే ఏం గతని నిరాశ ఇంకోవంక బాధిస్తున్నాయి. ఏం తోచక దిక్కులు జూస్తు ఆకాశం వంక చూచాడు రాగయ్య. తనమనస్సువలెనే ఆకాశం మేఘావృతమయి, స్తిమితంలేని తనబ్రతుకువలెనే పరిగెత్తె మేఘాల ఉరవడి రాపిడిని చూస్తు నిలుచున్నాడు. ఆకాశవీధిలో ప్రకృతి దర్శకత్వంక్రింద తన జీవితమే నాటక మాడిస్తున్నట్టు దృశ్యాలు తెరలు రంగాలు ఒకటివెనుక ఒకటి నడిచి పోతున్నాయనుకొంటూం డగా జల్లు ప్రారంభమయింది. ఆ వొంటిమీదవున్న ఆ ఒక్క పాత తడిసిపోతే దిక్కేమి దేముడా అని అదలం బావల యెదురుగావున్న ఎవరిపంచలోకో ప్రవేశిస్తు తన కాళ్ళక్రిందపడి నలిగిన చీముల్ని చూసూ చావు బ్రతుక్కూ బ్రతుకుచావుకూ పెనవేసికొనిఉండేన రహస్యాన్ని గ్రహించక సుఖపడలేదేఅనే ఆశకొద్దీ విడ్చివిడ్చి ఆ కన్నీళ్ళతో ఆ విషవృక్షానికి మడిమలుకట్టి మరింత ఏపు కోపు కలిగించటం తప్ప ఆ పెనుపుంము తీసిన వాడు లేడని నిరుత్సాహంగా పంచలో అడుగు పెట్టాడు. అంతక్రితమే కుక్కలు రెండు తడిసి అక్కడే తలదాచుకొని ఉన్నాయి.

రాగయ్యను చూచి ఒకటి మొరిగింది. ఇంకోటి సమీపించి స్వాగతం ఇచ్చింది. వాన వెలిసిందాక వాటితోటే రాగయ్య తలదాచుకొని కాలక్షేపం చేశాడు. వాన వెలిసింది. ఇంటికి దారిపట్టాడు. దోవలో శంకరయ్య యెదురైనాడు. బాకీవిషయం రాగయ్యతో ప్రస్తావించాడు.

"ఏం రాగయ్యా! బాకీ మందల ఏం జేసినావు? మేము మీకు బాకీఅయినట్టు మీచుట్టూ తిరగాల్సినట్టుందదే. ఇదేంది గాచారం మాకు?" అని మండిపడ్తూ మొహావంతా కళ్ళు చేసుకొన్నాడు. నిమిషాలమీద బాకీ వసూలుగావాలని గొంతుమీద కూర్చున్నాడు.

"అయ్యా నాగతి జూస్తా మీరు తొందరజేస్తే ఏం జేసేది! కాస్త నెమ్మదిస్తే కూలో నాలో జేసి చెల్లు బెడ్తా. మీ ఋణాన పోనులే అయ్యా!" అన్నాడు రాగయ్య.

"ఈ రోగం కుదిర్తేనా నీవు చెల్లుబెట్టేది? వడ్డీ వరాలపాడిగ అమ్మతుంటె మీకు ధాగాద తింజేసి మేపు చేతులు గడుక్కోనేదా? బలే ప్లానే ఇది? నీ ఇంటి స్థలం విక్రయంజేయి. కొంతన్నా చెల్లుతొద్ది. ఇంక నిలపటానికి లా బాకీ" అంటూ వీధిలో రచ్చ చేయటానికి మళ్లాడు.

"అయ్యా కాలు చేయి పడిపోయిందాక మీ పాదాల్ని కనిపెట్టుకొని కష్టంచేసినోణ్ణి. నన్ను ఇంత పరాయోణ్ణిగజేసి ఈ క్షణం నన్ను ఈపా ఈపస్థంభానికి దీస్తే నేనాప జచ్చేది చెప్పండి? మీ కుప్ప నూర్చి వడ్లను మేలురాసి చేస్తా మీ కళ్లాంలో నేగదా నాకు ఈ కాలుచేయి పడిపోయింది."అంటూ రాగయ్య పెద్ద పెట్టుగా ఏడ్చాడు. రాగయ్య బాకీ ఎగబెట్టాలని నటిస్తున్నట్టు శంకరయ్య అనుకున్నాడేగాని కృతఘ్నుడు కాలేకపోయాడు. ఇంతలో రాగయ్య కొడుకు వీరయ్య బడినుంచి ఆ దోవనే వచ్చాడు.

"ఏం వీరయ్యా! అప్పుడే వచ్చినావే—బడి వొదిల్నారా?"

"ఆక లవతూంటె 'అయ్యోర్ని అడిగొచ్చినా!"

"ఇదిగో ఈ మూకుట్లో కూడు రవంత నీవు తిని బడికి పో" అంటూ రాగయ్య పిల్లవాడి చేతికి మూకు డిచ్చాడు. పిల్లవాడు రెండడుగులు వడచాడు.

"ఎవురోయ్ రాగా! ఈ పిల్లగోడు" అని శంకరయ్య అడిగాడు.

"నా కొడుకయ్యా."

"ఈన్ని చదివిస్తుండావంటయ్యా!"

"ఏం ఏదువులే అయ్యా! మాగోడు అమ్మో అన్నాటికి."

"చేతికి ఎదిగినోణ్ణి సేద్దానికి కొట్టక బడి కంపించి వాణ్ణి చెడుస్తుండా? ఈణ్ణి మన కమతాన బెడ్తే నీ బాకీలోకి చెల్లేసుకోనూ?"

"ఏదో చదువుకొంటె మేలు కలగద్దని ఆశ! ఇంకే వుంది!"

"ఆశలకేం లేవయ్యా! అనుకొనేకొద్దీ ఆశలకు పురి యెక్కుతుందేదగనా!"

"ఏం వొద్దులే. నేను చెల్లుబెడ్తాలే. ఇప్పుణ్ణుంచే వాడిమీద బాకీలు సాకీలు ఎందుకులే అయ్యా! కాస్త తరూయించండి. ఎట్టనో ఒకట్ట సరిపెడ్తా" అన్నాడు రాగయ్య.

చెడ్డావోయ్. నీవు కూకున్నచోట్నుంచి కదలేక పోతివి! నీ పెళ్ళాం ఉంటె లేవలేందాయె. కొడుకును కలెక్టరు చెయ్యాలని చదివిస్తుంటివి! ఇంక నీవు సరిపెట్టేదియాడ? నీకు అన్నీ పదిలంగా ఉండాల. మేమా నలిగి చావాల్సింది? వల్లగాదు. పిల్లగోణ్ణి పసులకాడికి పంపంది ఒప్పుకోను. చెప్తుండా!"

రాగయ్యగతి పాముపడగనీడలో కప్ప పరిస్థితి అయింది. ఋణబాధ నివారణ అయితే రోగంకూడ కుదురుతుందని రాగయ్య స్థిరం చేసుకొని,

"వీరయ్యా! శంకరయ్య బర్రెలకాడికి పో అయ్యా" అన్నాడు.

"నేను పోను. చదువుకోవాల పో."

"చదివిన మటుకు చాల్లేవోయ్! మీ వాళ్ళంతా ఎన్నె చదివినారు గావాల! పస్తులుంటంట్రా చదివేది పిల్లగోడా? లక్షణంగా మన ఇంటికాడ నీళ్ళు మెతుకులు దాగి లక్షణంగా బర్రెల్ని మేపుకోస్తువురా!" అన్నాడు శంకరయ్య.

"కవళం అన్నా తెచ్చుకోనీ చదవతా గాని నే నేవో పశాలకాడికి రాను." అంటూ రెండడుగులు నడిచాడు వీరయ్య.

"ఏం వోరీ! చెప్తుంటె అంత దిసాయించకుండా పోతుండావే. ఎద్దుకొల్లో ముల్లంత లేవు! ఏవో మిడిసి పడ్తా ఉండావే. ఏవో బలెమిడి దోక్కోని నలగతుండావే! యాడకి నీవు పొయ్యేది! తిరుగు యెనక్కు. ఒళ్ళుగాని తివర్తుండదిగనేం. గూబ అదిరేనోయ్! పద ఇంటికాడికి. బర్రెలు కట్టు ముందర; రొప్పుతుండాయి. పొద్దెక్కింది. ఈ యెరకు బాగామేసి నెవులు యేసుకోవాల్సిన గొడ్లు. రా. రా. నీకు మన అబ్బయ్యోళ్ళ పాతచెడ్డీలు చొక్కాలు యిస్తారా. లక్షనంగా తొడుక్కుందువు." అంటూ అదిలించి బెదిరించి లోపర్చుకొన్నాడు శంకరయ్య.

"బడికిపోకపోతే తంతాడు అయ్యోరు" అని వీరయ్య ఏడ్చాడు.

"నీవు మా పశలకాడికొస్తే అయ్యోరు నిన్ను తన్నడానికి ఎన్ని గుండెలున్నాయి? నిన్ను తిన్నిపాట ఇంకాయన యాడ ఉండేది? ఆడు నుంచేది కొస్త అడుగుచాచె. బలే మొనెక్కుడుగా ఉండదే! పెళ్ళినడకలు నడిచేవాడివి నీవేం మేపతావయ్యోవ్ గొడ్లను! లగెత్తు-లగెత్తు. పశలు అగ్గిదాగుండాయి." అంటూ పిల్లవాణ్ణికూడా తీసికెళ్ళాడు.

పిల్లవాడితో ఏదో చెప్పాలని రాగయ్య యోచించాడు. కాని మాట రాలేదు. ఇంతలో వాళ్ళు వెళ్లుతూ దూరమయ్యారు. అటంకే చూస్తున్న రాగయ్యకు మనసులో బాధ కలిగింది. వొలిచే కుండాలలా, నేలకొరిగిన మబ్బులా ఉన్నాడు రాగయ్య. మెరపును వదలిన ఉరుములా కొంచెపటికి గాని మాటరాలేదు. "అయ్యా! వీరయ్యా! చేసేపనిమీద నిష్ఠా పెట్టుకో అయ్యా! పాలుమాలబోక. గొడ్లు నోరులేనియి. నాటి కడుపులో నిద్రబోవాల. నీ యిష్టం!" అంటూ తన సంప్రదాయం, ధర్మం వీరయ్యకు బోధించాడు.

పాపం ఎండదెబ్బ కొట్టిందేమో రాగయ్యకు, కళ్ళుతిరిగి కూలబడ్డాడు. భూదేవత కనికరించి దగ్గర తీసింది.

ఇంతలో సర్వోదయ కార్యకర్తలు, భూదానోద్యమాది ధర్మకార్యాసక్తులు, గాంధేయతత్వవిదులు, గ్రామపంచాయతీ సభ్యులు - అందరూకలిసి "గ్రామోద్ధరణ కావాలి" అని నినాదాలుజేస్తూ పర్యటిస్తూ ఆ గ్రామం గమిలిలోకి వచ్చారు. "అంతా నిజమే లే" అన్నట్టు ఊళ్ళో కుక్కలు ఒకే మొరగటం ఆరంభించాయి. సంతాల మీటింగు అందరూ రావాలని పంచాయతీ ప్రసిడెంటు ప్రకటన చేశారు.

"మనకంటె మనల్ను బాగుచెయ్యాలని వొచ్చినోళ్ళు పూరాగా ఉండారే. ఇకేందిరా నాయనోవ్!" అని గ్రామస్తుల్లో గుసగుసలు బయలుదేరాయి.

ఇంతలో రాగయ్యభార్య నరసమ్మ నీళ్ళకని పోయి పంచాయతీవారి బావిబెండపై కూలి అంగలో పడి పూడిపోయిందని గ్రామస్తులందరు ఏడుస్తూ అక్కడ మూగారు. "ముత్తయిదుచావు; నరసమ్మ పుణ్యం." అంటూ గ్రామస్థులు తృప్తిపడ్డారు.

దేముళ్లతో మొరపెట్టుకొందామని పోతే వారంతా సినిమాలో వేషాలువేస్తూ విరి మాటే పట్టించుకోలేదు.

# తెలుగుతో హిందీ హొందిక

## శ్రీమతి నాయని కృష్ణకుమారి

భాష మనుష్యుడి నిత్యావసర వస్తువుల్లో ఒకటి. ఇది మనోభావాలను తెలియజేసే సంకేతాల కూడిక. ఈ సంకేతాలన్నీ ధ్వనులు. ఇవి మనచేత నే ఒక కట్టుబాటుకూ పద్ధతికీ అలవాటు చేయబడి ఉంటాయి. అందుకనే మాటలు నేర్చుకునే పసిపిల్ల తనభాషలో అనుశ్రుతంగా వస్తున్న పదవాక్య నిర్మాణాన్ని పదే పదే వింటూ, చేతనైనట్లు తప్పుల తడకలుగా వాటిని ఉచ్చరిస్తూ, చివరకు సరియైనపద్ధతిలో మాట్లాడటం నేర్చుకుంటుంది.

ఏ భాషలోనైనా మనం రెండు అంశాలను గమనించవలసి ఉంటుంది. అందులో మొదటిది ఆభాషకు చెందిన పదజాలమూ, రెండవది అపదాల కూర్పూ. ఒకపదాన్నీ మరోపదాన్నీ కూర్చడానికి మధ్య కావలసింది అపదం. పదమనగా ఏదో ఒకఅర్థాన్నిస్తూ దానంతట అదిగా నిలబడగలిగేది. అపదమనగా, పదంతో కలిస్తేకాని అర్థవంతంగా నిలబడలేనిది. ఈ పదమూ అపదమూ ఒక నిర్ణీతపద్ధతిలో కూడగా ఏర్పడేదే వాక్యం.

ఈ వాక్యనిర్మితి ఒకభాషకూ మరోభాషకు ఒకేవిధంగా ఉండదు. సరికదా, ఒకభాషలోని వాక్య నిర్మాణపద్ధతి మరోభాషలోనికి జొరబడదు. ఒకవేళ అరుదుగా వచ్చినా నిలవదు. ఉదాహరణకు చూడండి.

1. ఇంగ్లీషులో,

"This is a Tree" అన్నది, పిల్లవాళ్ళ క్లాసు పుస్తకాల్లో "ఇది ఒక చెట్టు అయివున్నది"—అనీ;

2. హిందీలో,

"అబ్ బారా బజ్ గయా"—అన్నది, అక్కడక్కడా, తెలంగాణా జనుల వ్యవహారంలో, "ఇప్పుడు పన్నెండు కొట్టిపోయింది"—అనీ;

3. సంస్కృతంలో,

"రామః మయా దృశ్యతే"అన్నది,"రాముడు నాచేత చూడబడుచున్నాడు"అనీ—తెలుగులోకి అనువదింపవచ్చు. కాని ఇవి బహుళ ప్రచారంలోకి రావు. అనగా జనం ఇటువంటి విజాతీయ పద్ధతికి అలవాటు పడలేరు. ఇలా అలవాటుపడలేని తనం మనుష్యులకు సహజం కాబట్టే భాష ఎంత ప్రవాహిని అయినా దానికి, దానిలో, మార్పులు ఎంత సహజమైనా అది మరొకభాషలా మారిపోకుండా స్వతంత్రంగా దానికదిగా నిలబడగలగడం. ఒక వంశంలో కాలవశాన ఎందరో పుట్టి గిట్టుతున్నా, వంశ ప్రతిష్ఠను పోగొట్టుకోకుండా కాపాడుకునే వైనమే, ఒక భాషలో పదజాలం మారుతున్నా, నిర్మాణ పద్ధతిని కాపాడుకునే తీరు.

ఒక భాషలోని పదజాలంమాత్రం విపరీతమైన మార్పులకు లోబడవచ్చు. కొత్తపదాలు పుడుతూ, ఉన్న పదాలు మరుగునపడుతూ ఒకనాటి పదజాలం మరి కొంతకాలం తరువాతిపదజాలంతో పోలికలు లేనంతగా మారవచ్చు. అంతేకాక మరో భాషలోని పదాల్ని తెచ్చుకోవచ్చు. అలా వచ్చిన పద సంపద ఆ భాషదే అయినట్లు అతి సహజంగా అమరనూ వచ్చు.

కాబట్టి ఒక భాషమీద చుట్టు పక్కల భాషల ప్రభావం తెలుసుకోవడానికి ముఖ్యంగా మనకు తెలియవలసింది ఆయా భాషల పద సంపద. ఒక భాష ఇతర భాషాపదాలను గ్రహించడానికి ఎంత ఔదార్యం చూపిస్తుందో, ఇతర భాషలలోని పదాలూ, ఆ భాషలోకి రావడానికి, అంత తత్తరపాటును చూపిస్తవి. ఇంచుమించు ఒక భాషలోనుండి పదాలు మరో భాషలోకి బాణాల్లా దూసుకుని వచ్చి చోటు చేసుకు జొరబడతవి. అవి మొదట మొదట విజాతి పదాల్లా కనిపించినా, పోనుపోను, రూపం మార్చుకుని, ఆ భాషాపదాలే అన్నట్లు భ్రమను కల్పిస్తవి.

అట్లా అని, ఏ పదం పడితే ఆపదం, వీలూ చాలూ చూచుకోకుండా దానిఇష్టం వచ్చినట్లుగా మరో భాషలోకి జొరబడదు. అందుకూ ఒకపద్ధతీ, క్రమమూ ఉన్నవి. అంటే (1) ఒకభాషలోని అన్నిపదాలూ మరోభాషలోకి రావు. (2) వచ్చినపదాలన్నీ రూపభ్రంశం పొందకుండా ఉండలేవు. (3) అలా అవి రూపులుమారే అన్నిపదాలూ, తమ ఇష్టంవచ్చినట్లుగా మారవు. తాము జొరబడిన భాషయొక్క నిర్మితీ,

ఉచ్చారణా, వాక్యనిర్మాణ పద్ధతీ—వీటికి అనుగుణమైన మార్పులమాత్రమే జరగడం తటస్థిస్తుంది.

భారతదేశం భాషల పొమ్కల్యంకల దేశం. భాష అనిపించుకునే ప్రతిదీ భావస్ఫోరకత కలిగినదే. కాని అందులో లిపికలిగి, గ్రంథసముదాయం కలిగి, నాగర జన వ్యవహారంలో రాటుతేలిన భాషలుకొన్ని, లిపిలేక కేవలం ఆటవికులవంటి మోటుజాతివారి మధ్య వారి భాషగా అమరినవి కొన్ని. ఇటువంటి భాషలలో తెలుగూ, హిందీభాషలు రెండూ నాగరకమైన ఉచ్చస్థితిని పొందిన భాషలే.

హిందీ మన జాతీయభాష. అనగా భారతజాతి విధిగా నేర్చుకోవలెనని నిర్ణయింపబడిన భాష. సంస్కృతం, అనేక ప్రాకృతాలకు మూలమైన ఆర్యభాష. ఒక్కొక్క ప్రాకృతంనుండి రెండేసి మూడేసి ఉత్తర హిందూస్థాన భాషలు ఉత్పన్నం కావడం జరిగింది. అలా ప్రాకృతభవమైన ఒకభాష హిందీ. అంటే నిజానికి హిందీభాషలోని పదజాలమంతా సంస్కృతానికీ, ప్రాకృతానికీ సంబంధించి మాత్రమే ఉండవలసింది. కాని మనదేశానికి పరిపాలకులుగా వచ్చిన మొగలాయీలు, ఈ దేశంలో ఉర్దూభాష నొకదానికి దోహదం చేశారు. ఇందులో ఫారసీ, అరబ్బీ భాషల సంపర్కం ఎక్కువ. కాని హిందీ ఉర్దూలు అగ్రధితంగా కలిసిపోవడం జరిగింది. అనగా ప్రాకృత భవమైన హిందీలో ఫారసీ అరబ్బీ పదాలు పడడం జరిగింది. అందుకే ప్రభుత్వం మళ్ళీ ఆభాషను, హిందీ అనీ—హిందూస్తానీ - అని రెండుభాగాలు చెయ్యడం తటస్థించింది.

ఇక్కడ మనం చర్చించబోయే హిందీ కేవలం ప్రాకృత భవమైన హిందికాదు. ఉర్దూతో మిళాయింపు కలిగిన హిందీ. నిజానికి తెలుగులో చేరిన పదాలు ఎన్నో, ఉర్దూ పదాలే అని చెప్పకోవచ్చును. మొత్తం ఆంధ్రదేశ వ్యాప్తంగా తెలుగులో కలగా పులగమై ఈ ఉర్దూ మాటలు కనిపిస్తుంటవి. రెండు భాషలు కలవడానికి రెండు కారణాలు ఉండాలి. (1) రెండు భాషలూ మాట్లాడే ప్రాంతాలకు ఒక్క పరిహద్దురేఖ ఉండడం—కాని యిటువంటప్పుడు ఆ పరిహద్దు ప్రదేశం దగ్గరా, అది దాటి కొంతమేరా మాత్రమే రెండవ భాషయొక్క ప్రభావం కన్పిస్తుంటుంది. కాని యీ ప్రభావం దేశవ్యాప్తంగా ఉండదు—(2) ఒక దేశాన్ని పరిపాలించిన వారి భాష, ఆ దేశ భాషకంటే అన్యం కావడం. అటువంటప్పుడు పాలకుల భాషను పాలితులు నేర్చుకుంటారు. ఆదరిస్తారు. అలా ఇంతవరకూ మనం ఇంగ్లీషు నేర్చుకుని, దాన్ని విస్మరించకూడదనుకున్నాం. మహమ్మదీయులు తెలుగు దేశాన్ని పరిపాలించిన కాలంలో, ఉర్దూ పదాలు దేశవ్యాప్తంగా తెలుగు భాషలో కలిసిపోయాయి—తెలుగు, హిందీ భాషలు ఒక పరిహద్దురేఖ కలిగిన రెండు భాషలు. అందువల్ల హిందీ పదాలూ, తెలుగులో కలవడానికి ఆస్కారం ఉంది. ఇటువంటి, హిందీ, ఉర్దూలు—రెంటికీ, సులువుకోసం, హిందీ అనే పేరుపెట్టి దానితో మన తెలుగు భాషకు కల సంబంధం చర్చించడం ఈ వ్యాసోద్దేశ్యం.

ఈ రెండుభాషల సంబంధాన్ని గురించి చర్చించే ముందు వీటికి ఉన్న సామ్యాలుకాని భేదాలుకానీ ఆకళించుకోవడం అవసరం.

హిందిభాష లక్షణా లివి :

1. పదా లన్నీ సర్వసాధారణంగా హలంతాలు కావడం.

2. అక్కడక్కడా అజంతపదా లున్నా అవి దీర్ఘాంతాలుగా ఉండడం.

3. వర్గ ద్వితీయ చతుర్థాక్షరాల వాడుక ఎక్కువగా కనిపించడం.

4. అనునాశిక్యానికి బాగా ప్రాధాన్యం వుండడం.

5 రెండు దీర్ఘాచ్చులమధ్య వచ్చే అచ్చుపూర్తిగా కాక అర్థమాత్రాకంగా ఉచ్చరింపబడడం.

ఈ లక్షణా లన్నిటికీ పూర్తిగా విభిన్నలక్షణాలు కలిగిన భాష తెలుగుభాష.

తెలుగు భాష లక్షణా లివి :

1. నేట తెలుగు పదాలన్నీ అజంతాలు.

2. ఇందులో దీర్ఘాంతాలు అతి క్వచిత్తు.

3 పరుష సరళాలే తప్ప, ఒత్తక్షరాల వాడుక తక్కువ.

4. అనునాశికత ఒకప్పుడు అరసున్న రూపంలో ఉండినా ఇప్పుడు ఉచ్చారణ పూర్తిగా జారిపోయింది.

5. పదంలో ఉన్న అన్నిఅచ్చులూ నిండుగా ఉచ్చరింపబడడం కద్దు.

ఈ లక్షణాలకు అనుగుణంగా మార్పుల్ని పొందిన హిందీపదం అతిచులకనగా తెలుగుపదంగా మారి

పోవచ్చును. అలా మారినదాన్ని హిందీపదముని గుర్తించడం కూడా కష్టమే.

ఉదా :

1. జిద్ — జిద్దు ; (మొండి).
   ఖర్చ్ — కర్చు.
2. మాఫీ—మాపు
   సాఫీ—సాపు
3. ఖబర్ —కబురు; కవురు.
   ఘబ్‌రా—గాబరా
   ఘాఘరా—గాగరా
   లహంగా—లంగా.
4. గంవారూ—గమారు
   ఘాంఘురా— గాగరా
5. ఫైస్‌లా—ఫైసలు
   వాజ్‌బీ—వాజుబీ (వాడుక).

ఇలా పూర్తిగా తెలుగుముద్ర వేసుకున్నవి కాక, పాత వాసనల్ని దులుపుకోని పదాలు కూడా కన్పించవచ్చు. అనగా వికృతి చెందకుండా హిందీ భాషా లక్షణాల్ని వదులుకోకుండా తెలుగులో మెదులుతున్న పదాలు కూడా ఉండవచ్చు.

ఉదా :

ఖుషీ—ఖుషీ
సాఫీ—సాఫీ
దగా—దగా
ఆఖర్ —ఆఖరు

వంటి పదాలను చాలా చూడవచ్చును. ఈ పదాలన్నీ అతి మెల్లగా తెలుగు భాషా లక్షణాలకు అనుగుణంగా మారినా మనం ఆశ్చర్యపడవలసిం, దేమీ లేదు.

పైన చెప్పినవన్నీ పదాల్లో అక్షరగతంగా జరిగే మార్పులు. ఇక భాషా నిర్మాణపద్ధతినిబట్టి భాషా భాగాలను కేటాయించి, ఒక్కొక్క పదమూ దానికి కల స్థితినిపట్టి ఏయే ప్రక్రియల ననుసరించి మరో భాషలోకి జొరబడ్డదో తెలుసుకోవడం అవసరం.

తెలుగుభాషలో క్రియలకు కొన్ని లక్షణాలున్నవి. దేశ్యక్రియలన్నీ రెండు, లేక మూడు అచ్చులలో ఏర్పడిన రూపాలు. ఉదా:—

1. తిను; కొట్టు; చేయు; చెందు.

2. అలుగు; తరుగు; మెలగు; నిలుచు.

ఇదికాక మరోరకం ప్రక్రియ కూడా తెలుగు క్రియలకు చెందినది ఉన్నది. అది రెండేసి మాటలు జత పెటగా ఒక్కొక్క క్రియారూపం ఏర్పడటం. ఇటువంటి రూపాలకు శబ్దపల్లవాలని అన్నారు మనవాళ్ళు. ఈ రెండవమాటలలో మొదటిది, అసమాపక క్రియా రూపమో, నామవాచకమో కావడమూ, రెండవది పడు, కొను చేయు, అగు, తిను, పెట్టు, పఱచు, కొట్టు. పోవు, వంటి క్రియలలో ఒకటి కావడమూ జరుగుతుంది.

ఉదా:—భయపడు, పండుకొను, పనిచేయు, (దాఖలు చేయు) తయారగు, తిట్లుతిను, మొదలుపెట్టు, దఖల్ పఱచు, మొహంకొట్టు, వీడిపోవు. సరిగ్గా హిందీ భాషలో కూడా ఇటువంటి ప్రక్రియ ఉన్నది. రెండవపదంగా వాళ్ళు తీసుకొనే మాటలకూ, మన మాటలకూ అర్థంలో పోలికలు కూడా కనిపిస్తవి.

పడ్ —మాలూమ్ పడ్నా—(?)
కర్ —అదా కర్నా—(చేయు)
లే— సాంస్ లేనా—(కొను)
జా—థక్ జానా—(పోవు)
హో—ఖుష్ హోనా—(అగు)
మార్ —గప్పా మార్నా (కొట్టు)
ఖా—ఖసమ ఖానా (తిను)

ఇవికాక మన తెలుగులో ఉన్న చేయు, పడు, అలుగు వంటి క్రియలు కూడా కనుపిస్తవి.

ఉదా:—కర్ , బోల్, సున్, ఖా, జా, లే—వంటివి.

ఇటువంటి క్రియాపదాలు హిందీనుండి తెలుగులోకి రావడంలో ఒకపద్ధతి కనిపిస్తుంది.

1. ఏక, ద్వ్యచ్కాలయిన క్రియలు తెలుగులోకి రావు.

2. నామవాచకాల్తో క్రియలు జతపెట్టగా ఏర్పడిన క్రియలలో, కేవలం పూర్వభాగం అలానే ఉండ, ఉత్తరభాగానికి సమానమైన తెలుగుపదం వాడబడుతుంది.

ఉదా:—అదాకర్నా—అదాచేయు. బేజార్ హోనా—బేజారగు. గప్పామార్నా—గప్పాలుకొట్టు. జవాబ్ దేనా—జవాబిచ్చు.

3. మరికొన్ని క్రియలు సంస్కృత క్రియలకు చేరినట్లు 'ఇంచుక్' చేరగా తెలుగులో ప్రవేశిస్తవి.

ఉదా:- ఫర్ మానా—ఫర్మాయించు—పురమాయించు. చలానా—చలాయించు. దబానా—దబాయించు సతానా—సతాయించు—వంటివి. ఈ 'ఇంచుక్' సంస్కృతానికీ, హిందీకీ చేరింది కాని, ఇంగ్లీ

షకు మాత్రం చేరలేదు—ఇవన్నీ క్రియారూపాలుగా హిందీ పదాలు తెలుగులోకి వచ్చేపద్ధతి.

నామవాచకాల్లో, అక్షరగతమైన మార్పు లన్నీ జరుగగా, విశేషంగా జరిగే మార్పు ఒక్కటి ఉంది. అది ప్రతి హిందీ నామవాచకానికీ, సాధారణంగా, తరువాత 'గా' చేరడం.

ఉదా:—1. ఇల్లు ఖాళీగా ఉంది.

2. వాడు గప్‌చిప్‌గా ఊరుకున్నాడు.

3. ఆ పిల్ల నాజూగ్గా ఉంది.

4. ఇలా జరిగినందుకు నాకు నామర్దాగా ఉంది.

ఈ 'గా' అనేది 'అగు' అనే క్రియకు తుమున్నర్థక రూపం. తెలుగులో దీనిని భావుకాలయిన (Abstract feelings) విషయాలను గురించి చెప్పే పదాల తరువాత చేరుస్తారు.

ఉదా:—1. మెల్లగా నడచెను.

2. చక్కగా ఉన్నది.

3. ముద్దుగా కనపడెను. etc.

ఇవి లింగ వచనవిభక్తులు లేని అవ్యయరూపాలు. కాని హిందీలో ఈ 'గా'తో సమానార్థకమైనదేదీ కనిపించదు. "నాజూగ్గా ఉంది" అన్నపుడు "నాజుక్ హై" అనీ, "సాఫీగా ఉంది" అన్నప్పుడు "సాఫ్ హై" అనీ, వాడబడుతుంది. ఈ వాడుక అలవాటై 'గా' లేకుండా, "ఈ బట్ట సఫీసున్నది." "ఇది సాపున్నది." "వాడు బజా ఖుషి ఉన్నడు" అనేవి వినిపించడం కద్దు. శిష్టవ్యావహారికమని మనం చెప్పుకునే సిసలైన తెలుగులో ఒక్కచోట ఈ 'గా' లేని వాడుక, మనకు ఎబ్బెట్టుగా తోచనంత పాతపడి కన్పిస్తుంది. అది:

"మీరు బాగున్నారా?"—

"ఇంట్లో అంతా బాగున్నారా?"— అన్న ప్రయోగం. మళ్ళీ ఈ బాగా తీసేసి 'ఖులాసా' అనే పదం పెట్టి "మీరు ఖులాసున్నారా?" అనలేము.

ఇలా 'గా' చేరకుండా హిందీ నామవాచకాలు కేవల నామవాచకాలుగానూ, విశేషణాలుగానూ కూడా ఉపయోగింపబడడం అక్కడక్కడా కద్దు.

ఉదా:—"ఆ మనిషి బహు నాజూకు."

"ఆవిడ నాజూకు మనిషి."

"ఇంత దగా ఎక్కడా చూడలేదు."

"ఉత్త దగా మనిషి"—

ఇట్లా పదాలు హాటివాటి స్థానాల్ని బట్టి, ఆయా అంతస్తుల్లో తెలుగులోకి ప్రవేశించడం జరుగుతున్నది. ఇది ఒక్క హిందీభాషకు సంబంధించిన గుణమే అనుకోనక్కరలేదు. ఏ భాష అయినా, తనది అనిపించుకొనే సొంతగుణాల్ని, తాను ప్రవేశించబోయే ఎదుటి భాషలోని గుణాల్ని బాగా ఆకళింపు చేసుకుని ఒక పద్ధతికి, కట్టుబాటుకూ లోనై మరీ ఎదుటి భాషకు తనపదాల్ని ఎరువిస్తుంది.

హిందీ పదాలకు తమ సొంతభాషలో ఉన్న అర్థాలూ, అవి తెలుగులోకి రాగా ఆయా అర్థాల్లో కలిగిన మార్పులూ, ఇవన్నీ మనస్సులో పెట్టుకుని పరిశీలిస్తే, ఎన్నో మనస్సుకు ఆహ్లాదాన్ని కలిగించే విషయాలు కనపడతవి.

# దర్పణ బింబములు

శ్రీ సాళ్వ కృష్ణమూర్తి

దారికాడ! దప్పి గూరినట్లున్నావు
ఎచటికైనఁ బోవ నెంచెదేమి?
ఇచట నడ్డువార లింట నేగును లేరు
ఘనరసంబు ద్రాగి తనియు మోయి.

ఆడుచున్న యాడు బేడిసల్ తొడలందుఁ
దాక రమణి బెదరి తళ్కుఁ బారసి:
కారణంబు లేకె కడులీల జవరాండ్రు
కలఁగు చుండ్రుగా నున్న పలుకనేఁ?

కాంత యొకతె తనదు కై సేత ముగియక
కాంతు డవల వచ్చు కందువ విని
నొసటఁ గాటుకిడియె వెనఁగండ్లఁ బారాణి
తిలక రేఖ చెంపఁ దీర్చుకొనియె.

దూరమేగి వచ్చి వారిజాక్షిని నేను
సేమ మడుగ పినరు చెప్పలేదు;
నీరు గారుచున్న నెఱి యామె కందోయి
యరయ నెల్ల జెప్పినట్టి దయ్యె.

నోట నూదియూది నునుగంటి పూదుమ్ము
వాపలేని ప్రియుని వాట మరసి
యొకతె రేగి రొమ్ము నొరజంట దాగ్రుమ్మె
గుబ్బతిలిన గట్టి గుబ్బ లతివ!

ధన్యురాల వగుము దయితుని కూటమిన్
రతుల నడుమ చాటు కతము లనెదు.
పోకముడికిఁ బ్రియుఁడు పొందున చేసాచ
సక్కలార! స్మరణయాడ దొట్టు!

ఇరుగు సన్నవలువ యెడపిన తొలికొండ
గుబ్బమీఁద కరము గూర్చియుంచి
అలరుఁ గలువకనుల యమరేశ దిక్సతి
మొగము వీఁడె రాజ ముద్దుగొనెడు.

తెమ్ము దూతి! పోద మిమ్ముం జామాయె
నింతకైన నాఁత డిటుల రాఁడు.
ఇంత మీఁదగూడ నెవ్వతె బ్రదుకునో
ప్రాణనాథుఁ డగుత దాని కతఁడు.

అందగాడ! సొగసు పొరువులు లేకున్న
నాదు మనసు బలిమి నాచికొనెదు
దాని వాడికాట్లు తనువున కై సేసి
వచ్చితిపుడు; చెప్పవలెన యింక?

'నీవు నాకుఁ బ్రియుఁవు!'–నీ చెప్ప నామాట
పొల్లుగాదు; కూర్చు పొలతి విడుపు
తొల్చి వచ్చితిటకు; తన ప్రియ చూడగా
కామి సొగసు సఫల తోము గాదె?

ఏ నెఱికాఁడు కన్నెఱిక మేపున ముచ్చిలె వాఁడ నాథుఁ; డా
కానని చైత్రరాత్రు లవెగా? అవె విచ్చిన జాజి వాసనల్
పూను కదంబవాయువులు; మున్నటినేన! మనం బటయ్యు రే
వానది వేతసీ తరువు వాలిక నా రతిలీల కీడ్చెడున్.

[సాహిత్యదర్పణములోని లక్ష్యముక్తకాలు కొన్నిటికి అనువాదము]

# ఎఱ్ఱన ఉషాపరిణయములోని ఆంతర్యము

## శ్రీ మల్లంపల్లి వీరేశ్వర శర్మ

నన్నయ్యగారి సరససారస్వతాంశ తన్ను బ్రవేశింపగా ద్రదవనయకా నారణ్యపర్వశేషము బూరించితినని యెఱ్ఱన్నగారు చెప్పినను, ఆయన యందు దిక్కన్నవలె నన్నయ్య గోచరింపడు. ఆ నన్నయ్య యెఱ్ఱన్నకే కాదు తిక్కన్నకు గూడ బెక్కుతావుల బ్రత్యక్షము కాలేదేమో యను సందేహము అసత్యము కాజాలదు. ఆయన ఋషి. వాల్మీకివలె జగద్ధితముగా గావ్యగానము నొనర్చెను. వ్యాసుని భారత మించుమించుగా నతని వంశచరిత్రము. ఇది జగద్ధితము కానిది కాదు. కాని యిందాత్మమోదమునకే ప్రాబల్యము కలదు. అపునర్భవము నాశించినను, ఆంధ్రావళి మోదముం బొరయ రచించిన తిక్కన్న రచనకును నన్నయ్యగారి రచనకును వ్యాస వాల్మీకుల రచనలకు గల భేదమే గలదు. ఈ ద్వివిధరచనములను బ్రత్యక్షపరోక్షరచనలనియు, నాటకపురాణ రచనావిశేషములనియు గొందఱభిజ్ఞులనుచున్నారు. నన్నయ్య కథాకథనదక్షుడనియు దిక్కన్న నాటక సంవిధానరచనాదక్షుడనియు వీరి నిర్ణయము. ఇట్టి భిన్నరచనల నేకీకరించి నూతనరచనమును నిర్మించుటలో బరమేశ్వరుడగుటచేతనే శంభుదాసునకు బ్రబంధ పరమేశ్వర బిరుదము సార్థకమగుచున్నది. ప్రబంధపదమునకు "కూర్పు" అను నర్థము కలదు. కావున నీయర్థము భాసించుచున్నది. మఱియు నితడు స్వయముగ దన నృసింహపురాణమున.

"ఉన్నత సంస్కృతదిచతు
రోక్తి పదంబుల గావ్యకర్తలై
యొన్నికమై ప్రబంధపర
మేశు డనంగ నరణ్యపర్వశే
షోన్నయ మాంధ్రభాష సుజ
నోత్సవమొప్పగ నిర్వహించి తా
నన్నయభట్ట తిక్కకవి
నాథుల కెక్కిన భక్తి పెంపునన్."

అని చెప్పుటయు నీ యర్థమును ధ్రువపఱుచుచున్నది. మఱియు నిందలి యరణ్యపర్వశేషోన్నయపదమును, ఆరణ్యపర్వమందలి "అరణ్యపర్వశేషము పూరించెను" అను వాక్యము నితడు కావించినది శిథిలపూరణము కాక శిష్టపూరణమే యనియు స్పష్టీకరించుచున్నది.

బలినందనుడగు బాణుడు జగత్పితరులగు పార్వతీ పరమేశ్వరులనే నుపలాల్యమానుడగు కుమారుని జూచి "యీజీవి యెట్టి సుకృతవిశేషమున నింతటివాడయ్యె. నే నేల కాకూడ"దని తలంచి తపంబున శివుని మెప్పించి తన యభీష్టమును నివేదించినాడు. ఆయన పార్వతిని జూచి వీనిని కుమారుని వెనుక కుమారునిగా జూచుకొమ్మని సెలవిచ్చుటయే గాక భక్తసౌలభ్యమున నాతని పురమున సపరివారముగా వసించెను. కుమారు డాతనికి నొక మయూరధ్వజము నొసంగెను. ఇంతవఱకు బాగుగనే నడచినది. సర్వసమృద్ధు లేర్పడిన తరువాత నాసుర ప్రకృతి మొలకెత్తి విజృంభించినది. బాణుడు కుమారునివలె నుపలాలింపబడుటనే కోరికొనెను గాని యతని యంతస్తత్త్వమును బడయ వాంఛింపలేదు. అట్లగుచో నీ చిక్కు వచ్చెడిది గాదు. శివుడు సతిని జూచి యట్లు చెప్పుటయందును విశేషము కలదు. ఉషాకన్య పార్వతి వరముననే జనియించినది. మఱియు నామెకు భక్తురాలు. పార్వతి నారాయణుని సహోదరి. ఆమె నారాయణి. నారాయణాంశజుడగు శ్రీకృష్ణుని మనుమని నీమెకు భర్తగా నామె నిర్దేశించినది.

ఆ జగత్పితరులు బాణుని యాసుర ప్రకృతి నెఱింగియు భక్తుడగుట వాని నెల్లవిధముల ననుగ్రహింపదలంచిరి. కాగా బాణుడు కృష్ణునకు సర్వసంబంధియగుచున్నాడు. "వివాహాశ్చ వివాదశ్చ" యను రెండు నిచట సార్థకములయినవి. బాణుడు పార్వతీ పరమేశ్వరులకు కృతకనందనుడు. అతని పుత్రిక యగు నుష తమకు మనుమరాలు గావున నామెను శ్రీకృష్ణుని మనుమని కిచ్చుటలో గల సామరస్యము సముచితమగుచున్నది. అసురత్వ యాదవత్వములను విడిచినచో బాణ శ్రీకృష్ణులెల్లవిధముల వియ్యమందదగ్గవారలని నిరూపించుటయే యిందలి రహస్యము. ఇటి యౌచితిని దుట్టతుదవఱకు నీ కవి నిర్వహించినాడు.

క్రియావంతులకు సుఖాతిశయమును దుర్భరమే. అసుర రణకండూదుస్సహములగు సహస్రబాహువుల నేనూఱుకంజపుటంబులుగా నంజలించి హరుని యుద్ధ మర్థించినాడు. ఆ శివుడు నవ్వికొని నిర్నిమిత్తముగా నీ మయూరధ్వజము పుడమిం బడినపుడు కుమ్ము, బలము, చలము గలవారలతో నీ కది సిద్ధించునని యనుగ్రహించి

నాఁడు. అసుర వంటకే మయూరధ్వజ సన్నిధి నే కొలువుకేసి మంత్రి యగు కుంభాండుని కొక ప్రియమును వినుమనినంత నే యమ్మంత్రి విష్ణువిజయము బలిని మోచనము మున్నగు కొన్ని ప్రియము లుదాహరించి యింగు బరమశివుడు నీ కిది యనుగ్రహించె ననెను. అతడు తన యుద్ధకాముమును తెలుపుచుఁడగ నే ధ్వజము విఱిగిపడెను దాని కతడు మిక్కిలి సంతసించెను గాని యమ్మంత్రి "ఏకతి పెంపొందిన నాసుర ప్రకృతి జక్క బెట్టగావచ్చునే యని నిర్వేదించి నిర్వేదించి తన ప్రొవ్వాసైనది దా గరిమె మనకు నేమి యనుచు గడగి సుహాసరుం డని నొప్పగిక్రించె. యియ్యిన తేజానకు గుది యెప్పు డెయ్యదియొ గదా!" అని వాపోయినాడు. అంతట జిగుగు గెంజడలతో బుష్పరజోవిభూతితో నెల దేటులచుట్టుకోలను జపసూత్ర శిలతో కోకిలస్వనములను సద్భ్యానంబులతో సకలారామములును శాంభవదీక్ష నొందినట్లుగా వసంతము ప్రత్యక్షమైనది. శంభుదాసునకు జగమెల్ల శాంభవదీక్ష నందినట్లుగాక మరెట్లు సాక్షాత్కరించును.

వసంతోత్సవ మారంభమైనది. సకల ప్రమథ పరివారముతో సతీసమేతుఁడగు శివుఁ డట విహరించెను. ఈ విహార మతి మనోహరము. ఆస్వామి దేవి యనుజ్ఞం జిత్రరేఖాది లీలావతులను బార్వతీ సంబుధరించి రా సెలవొసంగనట. ఆ శసనను దేవియనుమతి కొఱకు వచ్చెనట. రాదామతీ! అట్లు వెంబలి మన్మథు నఖిలలోకములకు నేకాధికారిగా నునిచి మనిచెనట, ఆ సమయమున సకల ప్రమథులు దమతమ యాండ్రతో సపరివారముగా ప్రబహ్మానుభవంబున సొగసినట్లయిరట, మగ పావులెల్ల శివుఁడు మగువలు శివయు సమ్రక్షతు లాగణదంపతులయొడ నద్వైతము ఏర్పడెనట. అచ్చెరువగు నాగముల సృష్టికి మృడానియు మృడుఁడును నవ్విరోనిరట. ఆ సమయమున బరమేశ్వరు కౌగిటనున్న పార్వతినిజూచి యుష కన్నెతనమునఁ జేసి తానును దన మగని కౌగిట నట్లు సుఖించు భాగ్యము వ్రాసియుంచినచో భవాని యనుగ్రహింపదా యనుకొనెనట. ఆ బిడ్డ హృదయము మెఱింగిన జగజ్జనని యప్పుడ యామెఁ జేరరాఁ బిలిచి శివునివలన నావలె నీవును నిపతివలన సుఖింపుమని దీవించి, నిన్నుఁ గలలోన గలియువాఁడు నీకుం బతియగునని నిర్దేశించెను. ఈ వసంతాగమ మహోత్సవ ప్రయోజన మిట్లు సఫలము కాఁగా సెవరి తవుంగు వాగు చేరిరి. ఈ విహారమంతియు బాణుని వర మనుగ్రహించుటలో నొకభాగము.

దేవి నిర్దేశించిన వైశాఖ శుక్ల ద్వాదశి వచ్చినది. ఉషాకన్యకలలో పార్వతి చెప్పిన వరుఁడు సాక్షాత్కరించి,

"చతుర సంభోగ రసములు జవులవెంట,
నిద్దఱకుఁ గ్రొత్తగాఁ గవి యొపుమిగిలి,
నట్టి కంరంబు గావించి యాత్మయాత్రి
యాబల తలఁపున నచ్చొత్తినట్లు చేసి"

యేఁగినాఁడు. ఆ కన్యక కంవరపడి లేచి నలుదిక్కులు కలియఁజూచి యతనిం గానక, ముగ్ధతావశమున దేవివరము గుర్తునకురాక మిక్కిలిగఁ దన యువమానపాటునకు నిర్వేదించినది ఆ నిర్వేద మత్యుదాత్తము. దేవి యిచ్చిన వర మప్పుడు గుర్తేదనుటగలన నుషాకన్య యౌదాత్త్యము చరిత్రవిశుద్ధ మకళంక మనస్సు వేమఱుంగుల మెఱయుచున్నది. ఆమె కది గుర్తునకు రాకుండుటయే యతి సహజము. ఆ చెలిమిగత్తెలు పలువిధముల నూరార్చిరి. తెలివిలేని యెడల నొదవినవో సందులు దోసములు కావనిరి. కలలోనివార్త లసత్యము లనిరి. అకామకృత దోషములు పశ్చాత్తాపంబునఁ దొలంగు ననిరి. కాని మంత్రియగు కుంభాండుని కూతురగు చిత్రరేఖ దేవి వరమును స్మరించి యామెకు వివరించి కొంత సంతసము వొగొట్టినది ఇప్పటికి యుపమానము దక్కినది కాని దుఃఖము అధికమైనది కలలోని సుమ్మహాభాగ్యమును భోగయోగ్యము గావింపుమని చెలి నర్థించినది. ఆమెయు నితరుఁ డెటివాఁడని నీవు నిరూపింపక యే నేమి చేయఁగలనని పలికి కొంత యాలోచించి జగదేక వీరుఁడగు బాణుని కూతురగు నిన్నింత వలపించినవాఁడే నీతండ్రి భుజకండూతి నడంచువాఁ డగునని నిశ్చయించి కొంత వ్యవధిఁగైకొని దాను చిత్రరేఖ గావున సకలజగములఁ గల సుందరులను జిత్రపటమున లిఖించి తెచ్చియిచ్చినది.

ఆ కన్య దానినిఁ బరిశీలించుచు యువవీరులఁ జూచు నెడలఁ బోలిక తెఱవు లరసి. ప్రద్యుమ్నుని గాంచి సంభ్రాంతయై యనిరుద్ధునిఁ జూచునెడల నిస్సంశయముగ చూడ్కితోఁ దన్నుఁ గరించిన యా హృదయము నాముఖము నాకరములను మెచ్చుచు;

"నను మఱపి యెందుఁ బోయితిఁ,
గనుగొంటిని బట్టువడితిఁ గైతవ మిట నే
నినఁ బోనిత్తు నె యనుచును,
దనమదిఁ బలుకుఁ గతిఁ గొంతతడ వీక్షించెన్."

ఆ పడుచు భావాంతరమూర్తి యగు చిత్రరేఖ యది యెఱింగి చెలీ! యంతఃపురముసఁ జొచ్చి నీమనము ప్రముచ్చిలి కొని యరిగిన ప్రముచ్చు నీ వెప్పు సుళువుగా నెఱిఁగితి నెల్లవిసయుల నీకు మెచ్చుగా వానిఁ దెచ్చి యిచ్చెద ననినది. ఆకన్యయు మనుఁ గలఁ గలసిన యాకారం బెంత నేసి నిదియు నంత నేసినదని చెలిచిత్ర రచనా నైపుణ్యమును గొనియాడి "యాతఁ డెవ్వరు? వానిఁ జేరు నుపాయ మెయ్యది?" యని యడిగినది.

# ఎఱ్ఱన ఉషాపరిణయములోని ఆంతర్యము

చిత్రరేఖ శ్రీకృష్ణునిఁ బేర్కొని యెల్లవెంట నీత డంతటివాఁడని మున్నుగా వాని బలపరాక్రమాతిశయము లభివర్ణించి "జగజ్జనని యనుగ్రహమున నీకంతటి పతి లభించెను. నీవతి ధన్యవు. నీవే కాదు, సురలనెల్ల సాధించి యాధిక్యముగన్న నీతండ్రి యీయనవలన ధన్యుఁడయ్యె"నని పలికి యప్పుడామె మనోరథంబు దీర్పఁ గామగమనమున ద్వారవతి చేరినది. అట యాదృచ్ఛికముగా దర్శన మొసంగిన నారదునింగని మ్రొక్కి తన రాకడ ప్రయోజనంబు నెఱింగించి శ్రీకృష్ణునివలనఁ దనకును బాణునివలన ననిరుద్ధునకు నపాయంబు గలుగని తెఱంగు నతనివలనఁ బడసి యతఁ డనుగ్రహించి యిచ్చిన "తామసి" యను విద్య గొని యనిరుద్ధుని శుద్ధాంతము ప్రవేశించినది.

అచ్చట సరస వయోవిశేషములకు భామలు పలువిధములగు గొలువులు సేయుచుండ నెందును బొరయక యపూర్వపు జందములో వెలవుపడియున్న కుమారుని జూచి "ఇతని చిత్త మెవ్వతియైన జతురయొకతె గొన్నయది" దైత్యనాథుని కూతు రితని బొందినటుల నితనికి బొంగు గలుగబోలు" నని యూహించి దేవి యనుగ్రహమును దలంచి తన యూహను నిశ్చయము సేసి నారదు డిచ్చిన విద్యవలన ననటి యువతులనెల్ల బరవశల గావించి యథార్థముగా ననిరుద్ధు దర్శించి తన వృత్తము నెల దెలుపుచు "నిను ప్రియలీల సుముఖుం జేసి తోడ్కొనిపోవ వచ్చితిఁ గుమార" యని పలికి తన చెలి రూపవిశేషమును వివరించి బహువల్లభుసకు నతని దదర్థముగా వర్ణించినది. ఆ కుమారుడును,

"మెలతి యేమని చెప్పుదు మీ మృగాక్షి
గన్న కలయ యేనును గనియున్న చొప్పు
గానవున్నాడ వచ్చితి పూని నీవు,
కాంతి కల గన్న చోటికి గంపగొనుచు."

అని పలికి రాత్రింబవళ్ళు నిద్రాప్రబోధముల వేర్పరింప నేరని తఃయవస్థ బేర్కొని "నను నీవు వేడుకొనియెడు పని నిన్ను నేను ప్రార్థించుచుంటి"నని పలికి యామెతో గూడి శోణితపురికి వచ్చె. తమ రాకడ వార్చియున్న యుషకు సాక్షాత్కరించెను. ఆ దంపతులు మును కలలో బరస్పరము నెఱింగియుండుట ప్రాపడిన చిత్రములు రూపుగొన్న మాపుల ననోన్యవ్యయుఁ బ్రకటించినవి

గాంధర్వ వివాహము రాజులకుఁ బ్రశంసబు గావున దేవిప్రసాదంబను బుఱ్ఱజాఁడు గూర్పఁ గామాగ్ని సాక్షికంబగు కల్యాణంబును సకల మంగళారంభములకు నాచార్యయగు చిత్రరేఖ వారికిఁ గావించినది. అంతట

కలలోన నొండొరు గలసిన యప్పటి
యానందపూర్ణ ధన్యత్వములును
బెరసి యొండొరులపైఁ బ్రేముడి సలిపిన
సంతాపబహుళ దశాంతరములు
నెమ్మి నొండొరులకు నెచ్చెలిక తమున
వచ్చిన యసమభాగ్యతిశయము
ప్రియుల నొండొరులకుఁ గీల్కొన నొదవిన
యాతనోచితకలావ్యాప్తివిధము
చెన్ను మిగుల నొండొరులకుఁ జెప్పికొనుచు
నద్భుతంబులు భయములు నాదరములు
గౌతుకంబులు బొనలాడగాఁ బ్రియుండు
బ్రియయుఁ గ్రోలిరి నూతన ప్రేమరసము.

ఇట్లు ఉషానిరుద్ధుల కళ్యాణమయినది. ఉష బలిచక్రవర్తి మనుమరాలు. అనిరుద్ధుడు శ్రీకృష్ణుని మనుమఁడు, జగజ్జనకులగు పార్వతీ పరమేశ్వరులు బాణు కోరినట్లుగా వానినిఁ దమపుత్రునిగా నంగీకరించుటయు పదపడి యాతఁడు కయ్యమును గోరఁగాఁ బరమశివుఁడు కులము బలము చలము గలవారితో సంఘటిల్ల ననుగ్రహించిన వరమును విద్యామునకుఁ గూడఁ బార్వతి సమకూర్చినది. కావున నిం దే పాత్రయు నౌచిత్యహీనత నొందకుండ నెఱ్ఱన సమకూర్చినాఁడు.

ఆ కన్య యుషయట, ఆ వరుఁడు అనిరుద్ధుఁడట, వారల సమాగమము సమకూర్చినది చిత్రరేఖయట. ఇది యట్లగా ననుగ్రహించినది జగత్పితరులట. ఆ యుషను గ్రహించు ననిరుద్ధుని బాహుసహస్రము నిర్ధూత చేయు బాణుని బాహాకండూతిని శ్రీకృష్ణుఁడు దన సుదర్శననామక చక్రమున హరించెనట. ఇం దేమేని యంతరార్థము గలదా?

ఉష బాణుని కూతురు. ఆమెనివాసము శోణితపురము అది కుమారస్వామి పత్తనమగు రుధిరపురికి దాపుననున్నది. ఆ కుమారుఁ డీశాన్యవిభునందనుఁడు గావున శోణితపురి తూర్పునకు దగ్గఱగా నున్నదనవచ్చును. మఱియు నీయుషానిరుద్ధసమాగమము వైశాఖ బహుళ పంచమినాఁడు జరిగిన దనవచ్చును. ఏలనన నుషకుఁ గల వచ్చినది వైశాఖ శుక్ల ద్వాదశి నాఁడు. చిత్రపటము వ్రాయుటకు నేఁడు వాసరములు గడచినవి ఇంచుమించుగా నప్పుడు సూర్యుఁడు దక్షిణాయనమున కున్ముఖుడగుచున్నాఁడు. అనిరుద్ధుడు పడమటి సముద్రమున ద్వారవతి యందున్నాఁడు. అనిరుద్ధ ప్రద్యుమ్న సంకర్షణ వాసుదేవ పదములు వ్యూహాభిధానములు. అంతరాత్మ యొక్కడే సూర్యుడు పశ్చిమదిశయం దున్నప్పుడు విష్ణుస్వరూపుఁ డనుట

ప్రసిద్ధము. ఈ దయ సూర్యుఁడు బ్రహ్మ. అతఁడు విష్ణుని నాభికమలమున జనించెను. ఉదయ సూర్యుఁ డనిరుద్ధగతి యయ్యు మందేహాదులచే నిరుద్ధుఁ డగుటయు నర్ఘ్యోదకముల నా నిరోధము బాసి యుషోమంగళమూర్తియై యలరుటయు శ్రుతిప్రసిద్ధము. కాఁగాఁ దూర్పునున్న యుషాకన్య యువతియై పడమటనున్న యనిరుద్ధుఁ డను విష్ణుస్వరూపుఁడగు భాస్కరుని వరియింపగా చిత్రరేఖ యను నామె చెలికత్తె తామసీ విద్యాప్రభావంబున ద్వారవతిఁ జొచ్చి యనిరుద్ధుని దెచ్చి యువతికి సమర్పించినది. ఈ కళ్యాణము జగన్మంగళము సకల మంగళారంభము నగుచున్నది. ఏతత్ప్రవర్తకులు జగత్పితరులు. నిర్వాహకులు చిత్రరేఖా వాసుదేవాదులు. శివుని పరిచారిక నామము నిందుఁ జిత్రరేఖ యనియే పేర్కొనబడుట గమనార్హము.

ఆ వసంతమున జగమెల్ల పార్వతీపరమేశ్వర స్వరూపమై శృంగారమహితమైయున్న వేళఁ బార్వతిని దర్శించినప్పుడే యుష కట్టి సంకల్పము కలిగినదనుట యొక విశేషము. ఋషులు నిర్మించిన పురాణములను ఋషులే యనువదింపవలయును. వారు జితేంద్రియులు. వారి దృష్టి ప్రసన్నము, ప్రశాంతము. వారు క్రాంతదర్శులు. క్రాంతపదమందలి "క్త" ప్రత్యయము భూతార్థబోధకము. ఈ ప్రత్యయము భూతార్థముతోపాటు వర్తమాన భావ్యర్థములనుగూడఁ దెలుపును. మహాకవుల ప్రయోగము లట్టివి పెక్కు గలవు. క్రాంతమనగాఁ గడచినది. కడచినదానినిఁ జూడఁగలుగుట క్రాంతదర్శిత్వము. అది యీ చర్మచక్షువులకు గోచరించునది కాదు. ఆకడచినదానియందే యప్పటి భూతార్థమును, వర్తమానభావ్యర్థము లున్నవి. ఆ మూఁడింటి సమ్యగ్దర్శనమే క్రాంతదర్శిత్వము. అనఁగాఁ ద్రికాల నిత్యవస్తు పరిజ్ఞానము. తాదృశపరిణత జ్ఞానావిష్కృతము కావ్యము సార్వకాలికము సార్వజనీనము నగును.

శృంగారరసమహత్త్వము గుర్తించి తదర్హరచనముగావించినవారిలో గవిత్రయమువారు ప్రథమగణ్యులు. అందు నన్నయ్యగారి రచనమున నది పవిత్రము. పరిమితము హితము. గంభీరము. తిక్కన్నగారి రచనమున నది యట్టిదయ్యు, గొన్ని జిలుగులను దాల్చినది. ఆజిలుగులు నొకశిల్పవిశేషములు. ఆ శిల్పములు కల్పనాంతర్నీతములు. కల్పనములు పెక్కు. అవి కథాగతము శబ్దగతము వాక్యగతము రచనాగతము అర్థగతము భావగతము మునయి మఱియు ననేకవిధములు నుండును. ఇట్టి సర్వవిధ శిల్పసమన్వయము ఋషిరచనమునందే లభించును.

నిరాకారుఁడగు పరమేశ్వరునకుఁ గరచరణాద్యంగ కల్పనమువంటిదే కథావస్తుకల్పనము నగును. ఆ నిర్గుణునియందలి గుణాదికల్పనమే రస భావాదులగుచున్నవి. ఇవి సర్వాంగసుందరములుగా బరస్పరావిరుద్ధములుగా దర్శించుట, ప్రదర్శించుట ఋషులకే తగును.

ప్రకృతకథయందు నవవధువలెనే యనిరుద్ధునకును స్వప్నము వచ్చినదను కల్పన మెంతయు సార్థకము. ఆ నూతన దంపతులు ప్రత్యక్షముగా నప్పుడే యొండొరుల జూచుచు మున్నుఁ గలలోఁ జూచుటవలనఁ బ్రాతఁబడిన చిత్తములుగల చూపులు ప్రసరించినుటయు నీదాంపత్యముయొక్క యనాదిసంబంధము పరామృష్టమైనది. అది వారిదే కాదు సకలజీవులదియు. నలదమయంతులు, అరుంధతీవసిష్ఠులు, సీతారాములు, సావిత్రీ సత్యవంతులు, శకుంతలాదుష్యంతులు మున్నగు పురాణదంపతులు దేశకాలాదులచే నామరూపాదులచే నెంత విభిన్నులో యాంతరసంబంధమున నంత యభిన్నులనుటయే పరమార్థము. ఉషానిరుద్ధులు నట్టివారే. మహాపురుష గుణవర్ణనమున గావ్యము శాశ్వత మగుననుట లోని యంతరార్థము నిదియే.

ఎఱ్ఱన్నగారి యుషాపరిణయమందలి ప్రతిపద్యము కల్పనము సమన్వయించి చూపుట కిది తావుకాదు. ఈయన చిత్రరేఖయందు, పింగళివారి రాగవల్లరియు, నుషాకన్యయందు ప్రభావతియు, నితనికవితయం దాతని కవితవలెనే పలుతావులఁ బ్రతిబింబింతురు. అనిరుద్ధుని రూపము చిత్రరేఖ వ్రాసినది. ఉదయగిరియందలి చిత్రరేఖ భాస్కరుని జిత్రించి జూపినది. అతఁడు పార్వతీప్రసాదదత్తుఁడు. ప్రభావతికి ప్రద్యుమ్నుఁడు నంటియే కాని, యాతని రూపమునుఁ బార్వతియే వ్రాసినది యనుట విశేషము. ఏలన ఫాలాక్షుదహన నిర్దగ్ధుఁడగు మదనుని మఱల నవతరింపఁజేసిన జగజ్జననికొక మఱ ఎవ్వరు ప్రద్యుమ్నుని సృష్టింపఁగలరు.?

చెప్పవలసిన విషయము లెల్ల ప్రాచీనులే చెప్పిరి. అవి ప్రఖ్యాతములు. వానిని జాతిరత్నము లనిరి. వాని నట్లే భావించి యారాధించుట యొకపద్ధతి. వానికి గల్పనములను సానబెట్టుట మిశ్రపద్ధతి. ఇఁకఁ గేవల కల్పనములు కృత్రిమరత్నము లనినారు. కాని పరిపూర్ణవస్తుజ్ఞానసమన్వితులే మూఁడు విధముల రచనములందును సమర్థులు. కల్పనమనఁగా వివరణము. వస్తుస్థితి నెఱింగి పలిపిన సకల కల్పనములు సార్థకములు. ఈ సకలవిధ రచనములందు నెఱ్ఱన్నగారు పరమేశ్వరుఁడు. ఆయన ప్రబంధములు సకల జగన్మంగళప్రబంధ ప్రారంభ మంగళములు.

# పూర్ణాహుతి

శ్రీ మండపాక రాజేశ్వరశాస్త్రి

పాత్రలు :

| | |
|---|---|
| పీతాంబరం | — గాయకుడు |
| రామచంద్రరాజు | — రాజు |
| బాలకృష్ణశాస్త్రి, సుబ్బరాయశర్మ, నరసింహమూర్తి | — ఆస్థాన సంగీత విద్వాంసులు |
| శంకర కవి, రామకృష్ణ కవి | — ఆస్థాన కవులు |
| రాజసేవకుడు | — రాజోద్యోగులు |

-ఇందులోని పాత్రలు కేవలం కల్పితాలు. కథలోని వాతావరణం గత శతాబ్ది చివరి దశ, ఈ శతాబ్ది ప్రారంభ దశలకు సంబంధించింది-

## ప్రథమాంకం

[ఒక పెద్ద నగరం. సాయంకాల సమయం. జనుల కోలాహలం. బళ్ళ చప్పుడు. చిల్లర వస్తువుల అమ్మకాల అరుపులు. మనుష్యుల కేకలు. ఘర్షణలు. వాగ్వాదాలు...క్రమంగా ఫేడౌట్.

ఊరు శివార్లు. ఆవులు, గేదెలు, మేకలు, గొర్రెల అరుపులు. పసుల కాపరుల కేకలు. నవ్వులు ఛలోక్తులు... క్రమంగా ఫేడౌట్.

ఊరు దాటి అడివి ప్రదేశం. వివిధ పక్షి సమష్టి సంకీర్ణ కలకలం. కాకుల రాయిడి. గోరువంకలు, పికిలి పిట్టలు, అడవి పిచ్చుకలు, గిజిగాళ్ళ అరుపు గోలలు. సమీపంలో పసిడి కంఠికల (శకునపక్షుల) సుదీర్ఘమయిన అరుపు. అన్ని అరుపులకంటె ప్రముఖంగా కోయిల కూత.]

పీతాంబరం:—ఈ ప్రదేశం కంటికీ వొంటికీ—ఆహా! మనసుకీ—ఎంత చల్లగా వుంది! ఇక్కడ ఈ ప్రకృతిజీవుల రొదలన్నీ కలసి ఒక విచిత్రమైన—ఆహ్లాదకరమైన—బృందగానములాగే వినబడుతున్నవి......ఆశ్చర్యం! ఇన్ని ధ్వనుల మధ్య ఇక్కడ ప్రశాంతతకు భంగంగా లేదు. బస్తీలో వినిపించే రణగొణ ధ్వనులెక్కడ, ఈ ప్రకృతిగానమెక్కడ? దినమంతా అనుభవించిన హృదయావేదన సమ్మోహన మంత్రం వేసినట్లు తగ్గిపోయింది. మనసులో ఇప్పుడు ఊరటగా వుంది...ఏదో తెలియని ఆవేశం పైకి ఉబుకుతూ వుంది...(కుడిచేతి బొటనవేలితో ఫిడేలు తీగలు మీటుతూ ఎడమ చేతి వేళ్ళతో నొక్కుతూ వుంటాడు.) ఇక్కడ...ఈ రాతి పలక—నున్నగా—చదునుగా వుంది... ఇక్కడ కూర్చొని...కొద్ది క్షణాలు...యేదో తోచింది...ఎందుకు వాయించుకో కూడదూ—కాస్త మనశ్శాంతికైనా? (ఫిడేలు శ్రుతులు సరిచేసుకుంటున్న ధ్వని) అహ్హహ్హ!... నే నేనో పిచ్చివాణ్ణట—పిచ్చివాణ్ణి! పిచ్చి ఫిడేలుగాడు—ఇది వాళ్ళు నాకు పెట్టిన పేరు—నాకిచ్చిన బిరుదు! ఊళ్ళోవాళ్ళ దృష్టిలో నేను పిచ్చివాణ్ణయితే, నా దృష్టిలో ఊళ్ళోవాళ్ళు మాత్రం పిచ్చివాళ్ళు కారూ? ఆ పూర్ణకి ఈ పూర్ణంతో, ఈ పూర్ణకి ఆ పూర్ణా అంతే మరి! (కమానుతో తీగలు గీకుతూ శ్రుతులు సరిచేసుకుంటున్న ధ్వని—క్రమంగా శంకరాభరణరాగ స్వరాలు ఒక్కొక్కటిగా స్థాయిలో నిలుపుతూ వినబడుతవి.. ఉండుండి...అతి తియ్యని ఒక రాగ ఖండిక బహు సున్నితంగా వినబడుతుంది...వెంటనే శ్రుతి కలుపుతూ కోయిల కూస్తుంది. పీతాంబరం నవ్వు. భేష్ భేష్! ఏమి

కోయిలా! నచ్చిందటే?...పగలను వచ్చిక పోయినా—పోనీ, నీకైనా నచ్చింది నా వాద్యం! (వివిధ గమకములతో, విచిత్ర రీతులలో, విశిష్టమైన మాధుర్యం వెదజల్లుతూ మరి రెండుమూడు రాగఖండికలు వినబడుతవి...పసిడి కంఠికల జంట దగ్గరగా ఎగిరివచ్చి సుదీర్ఘంగా అరుస్తుంది.) అయిహోయి! నావాద్యానికి మీ అనుశ్రుతులా? మీ జంటకూ ఇంపుగా ఉందన్నమాటే! ...మీ అందరికీ నావాద్యం ఇష్టమైతే, వాది నరులు మెచ్చని పిచ్చివాద్యమన్న విచారం మరెందుకు? ప్రకృతి సంతోషించడమే సంగీతానికి పెద్ద యోగ్యతాపత్రం. (కొద్ది క్షణాలు అద్భుతమైన రాగాలాపన వినబడుతుంది. క్రమంగా చిత్ర విచిత్ర గతులలో తానం వినబడుతుంది. మధ్య మధ్యను పక్షుల అరుపులు వివిధ శ్రుతులలో వినబడుతూ, జంత్రనాదంలో వింతగా విలీనమైపోయి విచిత్రమైన శోభ నిస్తవి...దూరంగా ఆవుల మందలో 'అంబా, అంబా' అన్న అరుపులు వినబడుతవి. మంద కుక్కల మొరుగు వినబడుతుంది. దగ్గరగా చెట్టుమీదనుంచి కోయిలకూత వినబడుతుంది) నా పాటకు ప్రకృతే ప్రతిస్వనులు పలికింది. ఇప్పటికి నామనసులోని క్షోభ మటుమాయమైపోయింది. ఋషులన్నట్టు—'శిశుర్వేత్తి, పశుర్వేత్తి, వేత్తి గానరసం ఫణీ'... కేవల స్వర వర్ణాలతో సృష్టించినది అవ్యక్తభావమైనా, అది చేతన ప్రపంచానికి ఆనందమే ఇస్తుంది. మరి, భావం వ్యక్తం చెయ్యాలంటే సాహిత్యం కూడా జోడించాలి కదా. అప్పుడు మన హృదయాలు మరింత సంతోషించవా?...ఏదీ... (పాడుతూ వాయిస్తాడు అధ్యాత్మ రామాయణ కీర్తన. శంకరాభరణరాగం) "శ్రీరాముని గాంచెను పార్వతీ వినవే — మన కౌసల్య — ఆత్మారాముని గాంచెను."...ఓహోహో! ఏమి కవిత్వమయ్యా, ఏమి కవిత్వం! ముద్దులు మూటకడుతున్న మాటలు! (సంగతులు వేసి పాడుతూ) మన కౌసల్య...మన కౌసల్య...మన కౌసల్య...'మన' కౌసల్యట! చెప్పుతున్న శంకరుడికి, పక్కనే వింటున్న పార్వతికీ, పాటపాడుతున్న నాకు, నా పాట, నా వాద్యం వింటున్న ఈ సమష్టి ప్రకృతికీ—అందరికీ ఆ కౌసల్య ఆ వొక్క ముక్కతో ఆత్మబంధువే అయిపోయింది (పాడుతూ) మన కౌసల్య - ఆత్మారాముని గాంచెను...('అల నల్ల కలువరేకుల' అన్న చరణం వాయిస్తూ పాడుతూ ఉండగా క్రమంగా ఫేడౌట్.)

## 2

(దూరంలో గుర్రపుదౌడు చప్పుడు—క్రమంగా దగ్గర దగ్గరగా వస్తున్న శబ్దం-తరవాత తాపీగా అడుగులు వేస్తున్నట్టు - చివరికి గుర్రం ఆగిన చప్పుడు వినబడుతవి.)

రామచంద్రరాజు: ఎంత ప్రశాంతంగా ఉందీ ఈ ప్రదేశం! (గుర్రంమీదనుంచి కిందికి దిగినచప్పుడు) ఈ రాతిపలకమీద క్షణకాలం కూర్చుంటే... ఈ చెట్టు విశాలంగా వ్యాపించి...ఆకులబరువుకు కొమ్మలు భూమిమీదికి వంగిపోయి...దీని చల్లనినీడలో...ఎవరో కోరి పేర్చినట్టున్న ఈ రాతి పలకమీద...క్షణమాత్రం విశ్రమించడమే శాశ్వత స్వర్గభోగా లనుభవించినట్టు... నిశ్చింతగా—హాయిగా — శరీరంచాపి — ఈ చెయ్యి తలగడా చేసుకొని —.విశ్రమిస్తాం. ......హాయి హాయి! గాలిలో ఏమి పరిమళం!

ఈ సాయంసమయంలో అప్పుడే వనమల్లికలూ, అడివి జాజిమొగ్గలూ, తొగరు మొగ్గలూ విప్పారుతున్నవి కాబోలు. అంతఃపుర స్త్రీలలంకరించుకున్న పూదండలలోని వాడబోయిన వాసనలకంటె, తమ తమ మాతృవృక్ష శాఖలమీద సహజ వాతావరణంలో విప్పారుతున్న ఈ వన పుష్పాల సువాసన ఎంతో స్వాభావికంగా, మనోహరంగా ఉంది...ఇక్కడైనా కించిత్తు మనశ్శాంతి కలుగుతుందేమో!... వేషం పూర్తిగా మార్చివేశాం...ఈ ముతక గుడ్డలూ, ఈ బుట్ట తలపాగాతో, ఈ పల్లెటూరి వేషంలో మన నిప్పుడు పోల్చగలవా రెవ్వరుంటారు?...... అబ్బబ్బ! ప్రాణం విసిగిపోతున్నది! ఈ దర్బార్లు పటాటోపాలన్నా, ఈ పయోముఖ విషకుంభ పరివారాల స్తోత్ర పాఠాలన్నా, ఈ రాచరికపు గాడిదబరువు మస్తాబులన్నా, ఈవిధి లేని భేషజాలన్నా. ఈ బలవంతపు దంభ దర్పపూరితమైన జీవితపు తంతంతా ఎవరి తృప్తికి? ఇదంతా అంత్యనిష్ఠూరానికే, సందేహం లేదు. 'కిరీటధారి బ్రతుకే ఒక గతుకులబాట—సందేహం లేదు... ............మా మిత్రులమని, చం[illegible]మనీ, దివ్యభోగా లనుభవిస్తున్నామనీ, కుబేర సంపదతో కోటకొద్ది ధనం కూడబెట్టుకుంటూ కూర్చున్నామనీ, అర్థులందరూ అడిగినదంతా బలిచక్రవర్తిమాదిరి పంచిపెడతామని, పాపం! అమా

యిే ప్రజ లేమేమో అనుకుంటూ ఉంటారు. మా అవస్థ వాళ్ళకు తెలియదు. మా నిజస్థితి అన్యులకేమెరుక?.............. స్వేచ్ఛట, స్వేచ్ఛ! ఈ అమాయిక ప్రజాబాహుళ్యానికి తెలుసునా. మా కాళ్ళు చేతులకు సంకెళ్లు బిగించి వేసి ఉంచారని? కడుపులోనిమాట పైకి కక్కలేం గదా! నోటికింపైనా తినలేం గదా! నిద్రవచ్చిన వేళమీద నిద్రపోలేం గదా!......తూచితూచి మాటాడాలి. విషప్రయోగానుమానం లేకుండా చూపించుకొని తినాలి. హంసతూలికా తల్పాల మీదే పవ్వళించాలి. చెవికింపైనా, చిల్లర పాటలు వినడం సంస్కృతి లక్షణం కాదట— మా వీనులకు దర్బారు సంగీతమే విధిగా వినిపించాలట! మేము వీధి మనిషిని చూడకూడదు, మాటలు వినకూడదు, మాటాడకూడదు. వాడిని మా సమీపానికే రానివ్వరు! ఈ నాలుగు క్షణాల పాటైనా మనశ్శాంతి పొందుదాం. ఆహాహా! స్థలమహిమ! అప్పుడే మైకం కమ్ముతూ ఉంది —కునుకు వస్తూ ఉంది...(దూరంగా ఫిడేలు వాద్యమూ, పాట, అనుకంపనగా, పక్షుల మధుర రవములూ వినబడుతవి) ఆఁ!... ఇదేమిటి?... ఓహోహో! ఏమి గానం! ఏమి దివ్య గానం! వింతగా ఉందే! ఏ వనదేవతేనా ఆనందపరవశంతో పాడుతున్నదా?...... ఈ సమయానికీ, ఈ వాతావరణానికీ, ఈ ప్రశాంత ప్రదేశానికీ ఎంత సమన్వయంగా ఉందీ, ఈ గానం!...శబాస్! పాటకు పక్క వాద్యాలు పక్షుల కిలకిలారవములూ, ప్రకృతి పలికిన ప్రతిధ్వనులూను ... ఎన్నడూ ఎరుగని వెర్రిఉత్సాహం మనసులో ఉబికి పొంగి పొర్లుతూ ఉంది. దగ్గరగా వెళ్ళితే ఇంకా బాగా వినబడుతుందేమో!

## 3

పీతాంబరం: ఏం నాయనా! ఈ అడివిలో—ఈ డొంకలూ, తుప్పలూ, లతలూ మధ్యను కూచున్నా మరుగు లేదే! ఏదో ప్రశాంతంగా ఉంటుందని, పరవాసన లేని ఈ మారుమూలకు వస్తే, నువ్వూ ఇక్కడికే దాపురించావ్?

రామచం: ఏం సెయ్యమంటారు చెప్పండి. దూరం నుంచి మీ పాట శ్రావ్యంగా వినబడ్డది. దగిరికి వచ్చి వింటా నున్నాం...కోపం లేదుగదా? కొంతసేపు విననిచ్చునా?...ఏమంటారు?

పీతాం: ఓ, నిరభ్యంతరంగా. ఈ చెట్టుచేమలూ, ఈ గట్టుపుట్టలూ, ఈ పిట్టలూ, ఇవన్నీ విననచ్చునా, నువ్వు వినకూడదా? చూడూ. ఏదో—సాహృదయంలో పొందుతున్న ఆవేశం కొద్దీ, ఆవేదన కొద్దీ నాలో నేను కూని రాగం తీసుకుంటున్నాను. నీకోసం పాడలేదు. నీకు బాగుంటే విను. (ఒక విశిష్టదృక్కోణంలో ఆనంద భైరవిరాగం ఎత్తుకొని, కొద్దిక్షణాలు చల్లగా ఆలాపనచేసి, రాగభావం చెడకుండా వింతగతులతో తానం వాయిస్తాడు.)

రామచం: ఆహాహా! ఏమి అపురూపమైన అమరగానం! ఈ చిత్రవిచిత్రమైన పలుకులన్నీ ఆ ఫిడేలులో నుంచి వచ్చినవేనా?...భ్రమ...ఈ లోకంలో ఉన్నానా? చిత్రంగా వుందే! నా మతి... చెరుపు మరపులలోకి...దిగజారుతున్నది... సంగీతానికి ఇంతకమ్మదనం...ఇంత తన్మయత్వం కలిగించే శక్తి ఉందా? ఎంతమధుర మెంత మధురం! ఇన్నాళ్లూ మేం వింటున్న దానికీ—దీనికీ...

పీతాం. (పెద్దనవ్వు) ఏమయ్యోయ్! పరధ్యానంలో పడ్డట్టున్నావే! ఏం, పిచ్చిఫిడేల్సుగాడి సంగీతం నీకు నచ్చినట్టుందే!

రామచం: ఆఁ! ఆఁ! ఏమన్నారూ? ... పిచ్చి! ఎవడయ్యా మిమ్మల్ని పిచ్చివాడన్నవాడు?

పీతాం: మన దేవూరు స్వామీ? లోకమంతా నన్ను పిచ్చి ఫిడేలుగాడని ముద్రవేసి పారేస్తే, నువ్వెప్పుడేమో కొత్తగా మాట్లాడుతున్నావే!

రామచం: మీరు కాదు పిచ్చి. ఇంత దివ్యని పాట అందించగలిగిన మిమ్మల్ని పిచ్చివాడని అన్న వాళ్ళందరూ పిచ్చి పుల్లయ్యలే — మా మనస్సుకు అంతే తోస్తున్నది.

పీతాం: (నవ్వు) మరి సందేహం లేదు. నీదీ పూరు కాదు. లోకమంతా కోడై కూస్తున్నా నీదాకా రాలేదంటే—(ఆవేశంతో), పిచ్చివాణ్ణి! పిచ్చివాణ్ణి!...పిచ్చి—పిచ్చి ఫిడేలుగాణ్ణి!

రామచం: శాంతించండి. లోకం మాట అటుంచుదురూ. ఈ పూరు రాజాగారు సంగీతజ్ఞులంటే చెవి కోసుకుంటారట. వారి దగ్గరికి వెళ్ళి మీపాట వినిపించకూడదటండీ?

పీతాం: రాజాగారట! వెర్రివాడా, నువ్వో పల్లెటూరు అమాయకుడివి! లేకపోతే అలా అంవు ......అయ్యో వెర్రి నాయనా, రాజా లట! రాజులసంగతి నీకేం తెలుసునోయ్?

రామచం: మీ రెంతో అనుభవంతో అంటున్నారు కాబోలు. అయితే - అడుగుతున్నాం- రాజులంటే మీ కంత కోప మెందుకండీ?

సీతాం: నా కోపంమాట అటుంచు. అసలు సంగతి, రాజుల స్వభావమే అలాంటిది.

రామచం: ఈ వూరి రాజో? అతడూ అంతేనా?

సీతాం: అంతే అయ్యుండాలి మరి.

రామచం: ఏమిటో! పోనీ– రాజుల స్వభావాలేమిటో—కాస్త విశదపర్చి చెప్పండి.

సీతాం: చెపుతాను విను. మీ పల్లెటూరివాళ్ల కెప్పటికేనా పనికి వస్తుంది. రాజూ అన్న ప్రతివాడి పక్కకూ కొందరు ప్రబుద్ధులు ప్రవేశించి అతడి ప్రాపకం సంపాదిస్తారు. పెద్ద పలుకుబడి సంపాదిస్తారు. క్రమక్రమంగా అతడిని దిగ్బంధనం చేసివేస్తారు. వాళ్లే రాజుకు కళ్లూ–చెవులూ వాళ్లే! ఇక మాటలో ఇతరత్ర–బయటి ప్రపంచంలో ప్రజలు పెట్టే మొర్రలేవీ రాజుకు వినబడవు — వాళ్లు వినపడనివ్వరు. వాళ్లు పెట్టినదే వరవడి. వాళ్లు చెప్పినదే వేదం......తెలిసిందా? మరిప్పుడు చెప్పూ, నాలాంటి సామాన్యుడికక్కడ తావేది?

రామచం: మీరు అనుభవంతో అంటున్న మాటలే, సందేహం లేదు.

సీతాం: ఇక—మువ్వన్న సంగీతం సంగతి—నన్నడిగితే, గానానికి స్వేచ్ఛ ఉండాలి, ఆవేశం ఉండాలి—ఆవేశం కలగడానికి తగిన పరిస్థితులుండాలి. శాస్త్ర నియమాలంటావా, అవి సాధ్యమైనంతవరకూ ఉండితీరాలి నిజమే. కాని—నియమాలే పట్టుకు కూర్చుంటూ, వాటితో గాని ప్రవాహానికి అడ్డుకట్లు వెయ్యకూడదు. అలాగుచేస్తే ఆవేశం పోతుంది. అసలు ప్రవాహమే నశిస్తుంది. సంప్రదాయమన్న పేరుతో గాన వాహినిని నిర్బంధంచేసి, ఏ వొక్క సంప్రదాయాన్నో పట్టుకు పాకులాడి, చివరికి సంగీతాన్ని మాత్రకట్టుగా చేసివేస్తే—

రామచం: బాగా—సబబుగానే చెప్పారు. మీరిప్పుడు గానంచేసిన పద్ధతి మీరన్నమాటల కనుగుణ్యంగానే ఉంది. నిజమే. హృదయానికి ఆవేగం లేకపోతే, హృదయంలో ఆవేశం లేకపోతే, శూన్యహృదయంతో పాడిన పాట మాత్రకట్టు కాక, యాంత్రికం కాక మరేమౌతుంది? మీ ఊహలు వ్యర్థంగా పోకూడదు. పోనీ, మీ యిష్టం వచ్చినట్టే గానం చేయరు గాని, మీరు రాజదర్శనం చేసుకుంటే ఎంతో బాగుంటుందని మేమంటున్నాం.–ఏమంటారు?

సీతాం: రాజదర్శన మట! మళ్ళీ మొదటికే వస్తావే! ఏమయ్యా, ఈ రాజును పట్టుకున్న ఆ జలగల సంగతి నీకేమైనా తెలుసునా? వీళ్లు—ఏవో బాణీలట—కొన్ని కృత్రిమపు పద్ధతులూ అనుకరణలూ మనస్సులో పెట్టుకొని, రాజదర్శనాపేక్షతో తమ నాశ్రయించిన వాళ్ళందరినీ ఆ కొలబద్దతోనే కొలిచి వాళ్లకు యోగ్యత చాలదని తేలికగా కొట్టిపారేస్తున్నారు.

రామచం: పోనీ—మీరే స్వయంగా రాజదర్శనం చేసుకోకూడదా?

సీతాం: ఎన్ని చెప్పినా ఇతను మళ్లీ మొదటికి రావడం మానడే! నేను చెప్పలేదటయ్యా, మావంటి సామాన్యులకు రాజదర్శనం అసాధ్యమని?

రామచం: మీరు ప్రయత్నించి చూశారా?

సీతాం ఏమిటో! అన్ని ప్రయత్నాలూ అయిపోయాయి. మొదట్లో—వాళ్లూ వీళ్లూ చెప్పగా విని—నేనూ ఈ విద్వాంసుల దగ్గిరికి వెళ్ళి రాజదర్శనం చేయించమని ప్రార్థించాను.

రామచం: ఊఁ—ఏమైంది?

సీతాం: చెపుతున్నాను గదూ. వాళ్ళకు నా వాద్యం వినిపించడానికే బ్రహ్మాండం బద్దలు కొట్టినంత పనైంది.

రామచం: విన్నారా? ఆ సంగతి చెప్పండి.

సీతాం: ఆ—విన్నారూ—విని, పెదిమెలు విరిచేశారూ.

రామచం: అంటే? మీ వాద్యం బాగులేదన్నారా?

సీతాం: అతురాలా ఆమాటలే అంటారటయ్యా, వెర్రివాడివి గాని—రాజ దర్బార్లలో మెసులుతూ లౌక్యం నేర్చిన ఘనులు గదా?

రామచం: వాళ్ళేమన్నారో చెప్పండి.

సీతాం: ఏమంటారు? నాది బొత్తిగా స్వేచ్ఛావాద్య మన్నారు. నా వాద్యంలో బాణీ లేనేలేదన్నారు.

రామచం: అంటే—మీరూ — వాళ్ళూ అంటున్నది ఏమీ బోధపడకుండా ఉంది.

సీతాం: నువ్వేం గాయకుడివి గనకనా, నీకు బోధపడడానికి? ఉన్నతపదవి సంపాదించి, స్థిరత్వం పొంది, నిర్భయంగా తమపదవుల నంటిపెట్టుకొని పరీక్షాధికారం పొందిన గాయక పండితుల చేతిలో ఉన్న గొప్ప ఆయుధమే అది. ఏ సాటి గాయకుడిలో ఏ లోపమూ కనబడకపోయినా, వాడి పాటలో 'బాణీ' లేదంటే సరి, ఇక వాడు మన్ను కరుచుకు పోవలసిందే!......ఆఖరికి తేలిందేమి

టంటే, నా వాద్యం ఇప్పటిపద్ధతుల కనుగుణం కాదు కాబట్టి, నాకు రాజదర్శనం వీలు లేదన్నారు.

రామచం: ఏమయ్యా. ఇంత శ్రావ్యంగా వాయిస్తున్నారే, మీకు రాజదర్శనం కాకపోవడమేమయ్యా?

పీతాం: అక్కడే ఉంది చిత్రం...ఏమో, ఓపికుంటే ఆ విద్వాంసులనే అడుగు, తెలుస్తుంది. అంతటితో నే నూరుకున్నాననుకున్నావా? నా వాద్యంలో శాస్త్రవిరుద్ధ మేమేనా ఉంటే ఎత్తి చూపమని వాళ్ళను సూటిగా అడిగేశాను. మరేముంది! వాళ్ళప్రతిష్ఠే నేను సవాలు చేస్తున్నట్టనుకోనపడ్డారు. వాళ్ళకు నామీద కోపం వచ్చింది...ఫలితం? ఈ జన్మలో మరి నాకు రాజదర్శనం కాదు పొమ్మన్నారు.

రామం: అయ్యయ్యో!

పీతాం: దీనితో నా ఉత్సాహమంతా చచ్చింది. మతి మందగించింది. ఆత్మస్థైర్యం అంతరించింది... అయితే...నా ఆపాదమస్తకం...నా రోమకూపాలలోంచీ—నన్నావహించి—పైకి పెల్లుబుకుతున్న సంగీతాన్ని ఎలా వదిలించుకోవడం?... ప్రజలా?.....ప్రజాదరణంటావా? ...యథా రాజా తథా ప్రజా—రాజే గాయకుడిని గౌరవించకపోతే ప్రజలుమాత్రం గౌరవిస్తారా? ప్రజాదరణకు భత్యాళ్ళు గిట్టవు. రాజాశ్రయంలో ఉన్న గాయకుడు చచ్చుపాట పాడినా ప్రజ లతడిని బ్రహ్మరథం పడతారు.

రామచం: అయితే—తరువాతేం చేశారు మీరు?

పీతాం: ఇక చేసేదేముంది? నా వాద్యం అడవి చెట్లకూ, కొండలకూ, గుట్టలకూ, ఆకాశంలో పక్షులకూ, అడవిలో మృగాలకూ అంకితం చేసివేశాను. ఈలాంటి ఈ నిర్జన ప్రదేశాల్లో కూర్చొని, నాకు తోచినట్టూ వాయిస్తూ పాడుకుంటాను. నా వాద్యం అడవిపట్టిన సంగతి తెలిసి ఊళ్లోవాళ్లు నన్ను 'పిచ్చి ఫిడేలుగాడు' అని నామకరణం చేశారు.

రామచం: మీ పేరేమిటి?

పీతాం: పేరా? ప్రతిభనుబట్టే పేరూనూ...... నా అసలుపేరు పీతాంబరస్వామి. క్రమంగా పీతాంబరుడు, పీతాంబరం, పీతన్న...చివరికి పీతిగాణ్ణయిపోయాను. నా పేరెవ్వడికీ ఇప్పుడు తెలియదు. అందరికీ తెలిసిన నా పేరు 'పిచ్చి ఫిడేలుగాడు'. (విషాదంగా నవ్వు.)

రామచం: విచారించకండి. అయిందేమో అయిపోయింది. మా మాట వినండి. మేం మీకు రాజాశ్రయ మిప్పిస్తాం, రాజదర్శనం చేయిస్తాం. మాతో రండి. మాకు రాజుగారిదగ్గిర మంచి పలుకుబడిఉంది.

పీతాం: (ఆశ్చర్యంగా) నీకా?...అయినా ఇప్పుడేం లాభం? ఆ రోజులలో అయితే...... నా ఉత్సాహం పొంగిపొర్లుతూ ఉన్నప్పుడు... నేను తప్పకుండా నీతో వచ్చి రాజదర్శనం చేసికొనేవాణ్ణే...కాని—ఇప్పుడు.

రామచం: ఇప్పుడుమాత్రం ఏమైంది? ఏమీ మించిపోలేదు. మీ వాద్య మిప్పుడు అమోఘంగా ఉంది. ప్రకృతికే హితవుగా ఉన్నప్పుడు రాజుమాత్రం సంతోషించ కేం చేస్తాడు?

పీతాం: సంగీతమంటే—గానమంటే—ఓ యంత్రమనుకున్నావుటయ్యా? మనసు మారితే మనసులోంచి వచ్చిన గానమూ మారుతుంది. ఇప్పుడు నా మనస్సు మారిపోయింది. మరి నేను దర్బార్లలో వాయించలేను. నావాద్యం అడివిపట్టిపోయింది.

రామం: అడివి సంగీతమో. దర్బారు సంగీతమో—మీరిప్పుడు వాయించినట్టు వాయిస్తే రాజు అమితానందం పొందుతారు, నిశ్చయం.

సీతాం: నీ ధోరణే నీదిగాని, మరి నా సంగతి ఆలోచించవేం?

రామచం: ఏమిటో—మీరే చెప్పండి.

సీతాం: అవునవును. నా సంగతి నేనే చెప్పకోవాలి. నాది పూర్తిగా స్వేచ్ఛాజీవితమైపోయింది. రాజదర్బార్లలోని సంప్రదాయాలు మరి నాకిప్పుడబ్బవు. ధనమిచ్చి, లాలన చేస్తే నేగాని గాయకుడిలోంచి మంచిగానం రాదు. గాయకుడికి ఆవేశమూ రాదు ... గ్రహచార వశాత్తూ నువ్వు గాయకుడివి కావు, రాజువీ కావు! నీకెలా విడమర్చి చెప్పడం?

రామచం: అయినా—

సీతాం: దర్బారు పటాటోపం చూసి సంగీతపాటకుడు సహం చస్తాడు. ఇక—రాజేవో పురమాయిస్తాడనుకో. అది అక్కడ, అప్పుడు పాడడానికి గాయకుడి కిష్టముండక పోవచ్చును. ఆవేశం రాకపోనూ వచ్చును. మరి రాజాజ్ఞ కదా! అందుచేత లేనిఆవేశం తెచ్చిపెట్టుకొని ఏవో పాసిపోయిన చిట్టసంగతులు పేర్చుకుపోతూ ఎలాగో పాడేస్తాడు. ఈ ఎక్కాల సంగీతం రాజుకు ఇష్టం ఉంటుందా?...మరి తన కిష్ట

మెంగి రాజాజ్ఞ లేందే దర్బారులో పాడడానికి వీలు లేదు గదా? ఇంక చూడు గాయకుడి అవస్థ!

రామచం : మరి—రాజాశ్రయంలో ఇతర విద్వాంసు లున్నారేమో? వారంతా ఎలాగు నెగ్గుకు వస్తున్నట్టు?

సీతాం : అలాగే వాళ్ళూ ఈడ్చుకు వస్తున్నారు. ఉభయులూ ఉన్నదాంతో సంతోషించక మరేం జేస్తారు?

రామచం : వాళ్ళ ఖర్మానికి వాళ్ళను వదిలేద్దురూ! ఇప్పుడు మీ సంగతి విచారిద్దాం. మీకు రాజాశ్రయం ఇప్పించే పూచీ నాది. నాతో రండి.

సీతాం : ఏమిటో!... నా యిష్టం వచ్చినట్టూ నేను గానం చెయ్యగల్నో లేదో!

రామచం : ఆహా మీ కా భయం అక్కర్లేదు.

సీతాం: నాతో మరో చిక్కుందయ్యా! నాకు ఆవేశం వచ్చినప్పుడే బాగా గానం చెయ్యగలను. అప్పుడు వినడానికే రాజు సిద్ధపడతాడా, నీ వెర్రి గాని?

రామచం : మీకెందుకూ. మీరు నిండు హృదయంతో పాడినప్పుడే మీ పాట రాజుగారు వింటారు— సరేనా?

సీతాం : అంతా బాగుందిగాని. నీకు తెలియదేమో— రాజులు క్షణచిత్తులు! రాజు ఏమో, ఎప్పుడో, ఏదో, చేస్తాడని ఎదురుచూస్తూ—కనిపెట్టుకు కూర్చోనక్కర్లేకుండా, నా కుటుంబానికి కూటికి గుడ్డకూ కొదువ లేకుండా శాశ్వతంగా ఏర్పాటు చేస్తే నే—

రామచం: తప్పకుండా చేస్తారు. అది మాకు వదిలి పెట్టండి.

సీతాం : (హేళనగా నవ్వుతూ) ఏమయ్యోయ్! అంతా నీ చేతులో వున్నట్టు, నువ్వే రాజువై పోయినట్టు మాట్లాడుతున్నావే!

రామచం: అవును మేమే రామచంద్రరాజు గారిమి.

సీతాం : ఆఁ! ఆఁ! ఆఁ! మహారాజా! పదివేల నమస్కారాలు. ఈ దీనుడిని క్షమించాలి. రక్షించాలి. తెలియక ప్రభువుల యెడల అంత స్వేచ్ఛగా మాట్లాడినందుకు ఈ ఈ అల్పుడిని మన్నించాలి.

రామచం: అక్కర్లేదు భయపడకండి. మేమే మీకు కృతజ్ఞులం. గానకళలో అనేక విషయాలు మీ వల్ల తెలుసుకున్నాం (నవ్వు).. మీకు పూర్తి స్వేచ్ఛ నిస్తామని ఇప్పుడైనా నమ్మకం కుదిరిందా? మా సంస్థానానికి తప్పకుండా వస్తారు కదూ?

సీతాం: రాజాజ్ఞ. మరి రాక తప్పుతుందా ప్రభూ?

## ద్వితీయాంకం

### 1

(స్థలం – రాజదర్బారు—సమయం – ఉదయం. దర్బారు చిహ్నంగా కొద్దికిటికీలు వగైరా నౌబత్తు లేక సన్నాయి మ్రోగుతవి. సభలో విద్వాంసులూ, ఇతరులు రాజాగమనానికి వేచిన గుర్తుగా జనుల కోలాహలం వినబడుతుంది.)

ముసలిగొంతుక: ఇంత పొద్దుపోతే ఈ దర్బార్లేమిటి? కలికాలమే దాపురించేసింది ఇంకా మాలాంటి కర్మిష్ఠి ముండావాళ్ళం మిగిలి ఉన్నాం గదా. తెముల్దు పయ్యా? స్నానాలు కావాలా? జపాలూ తపాలూ పూర్తి కావాలా? అగ్నిహోత్రాలమాట నేను చెప్పను. ఆతరవాత దేవతార్చన మానుకోలేం గదా. ఇవన్నీ ఎలా వొదులుకోవడం?

పడుచుగొంతుక : అంతే. అంతేనండి తాతగారూ. మరి మా కుర్రఘటాల మాటేమిటంటారు? మీ ముసలి చాదస్తాలు మీకుంటే మా యువకరాయిళ్ళ అలవాట్లు మాకూ ఉన్నాయి, మేం మాత్రం ఇంత పెందరాళే లేవగలమా? తెములగలమా?

రెండవ పడుచుగొంతుక : బాగా చెప్పావురా అబ్బీ. మహారాజులంగారే పదింటికి తరవాతగాని లేవనే లేవరట! ఎంచొచ్చింది దర్బారు, ఉదయంపూటే!

అనేక గొంతులు : ష్ ష్ ష్!

రాజసేవకుడు : అందరూ నిశ్శబ్దంగా ఉండాలి. ప్రభువారు దయచేస్తున్నారు.

బాలకృష్ణశాస్త్రి : ఉదయాన్నే ఈ గానసభ ఎందుకో తెలియకుండా ఉంది.

సుబ్బారాయశర్మ: ఏమోనండీ శాస్త్రిగారూ! బహుశా.

నరసింహమూర్తి : నేను చెప్తాను వినండి. కొద్దిరోజుల నుంచీ ప్రభువులకు స్వాస్థత బాగు లేదట ప్రస్తుతం రాజకార్యాలేవీ చూచుకోనే లేదట.

సుబ్బా : అయ్యో, అలాగుటండీ! అయితే దీనికీ ఈ గానసభకూ సంబంధం ఏమిటా అని—

నరసిం : ప్రభువులకు రాత్రిళ్ళు నిద్రపట్టకుండా ఉందట. మనస్సుకు ప్రశాంతి లేదని ప్రభువులు పదేపదే పలవరిస్తూ ఉంటారట.

రామకృ : ప్రభువుల కష్టాధిక్యమై పోయి ఉంటుంది. అలాంటి సందర్భంలో తలలో వేడి తగ్గడానికి

మంచి మందులు, సమధాతువు చేసేవి వేస్తే సరి పోతుంటుందీ ?

నరసిం : ఔషధాలు ఉపయోగిస్తూనే ఉన్నారనుకోండి. వైద్యులు మరో విచిత్రమైన చికిత్స చేసి చూడమని సలహా చెప్పారట.

రామకృ : ఓహో! మీకన్నీ తెలుసునే!

నరసిం : మా బావమరిది చెప్పాడండీ. అతడికి కోటలోనే పని.

రామకృ : అలా చెప్పండి. ఏమిటా చికిత్స ?

నరసిం : ప్రభువులు పదేపదే పల్లవి శ్రవణానందమైన సంగీతం వింటూ ఉంటే మనశ్శాంతి కలుగుతుందని సూచన చేశారట, వైద్యులు.

సుబ్బా : అలాగైతే ఏం, ఇంతవరకూ మన కెవ్వరికీ వర్తమానం రాలేదే ?

నరసిం : ఆ పిచ్చి ఫిడేలుగాడు ఉంటూంటే మన మెందుకండీ ?

సుబ్బా : వాడిని చూస్తే నరసింహంగారికి - మహా మంటగా ఉన్నట్టుంది.

రామకృ : (నవ్వుతూ) వాడూ ఫిడేలు వాయిస్తాడు. ఈయనగారూ ఫిడేలే వాయిస్తారు మరి... 'యాచకో యాచక శ్శత్రుః' అని ఊరికే అన్నారా ?

నరసిం : వాడి శ్రార్థం, వాడూ ఫిడేలు వాయించడమేనా? నా శ్రాం గదూ—కనూను పట్టుకోవడం కూడా చాతగాదు వాడికి! తిరుగునయ్య అంటూ బయలు దేరాడు. ఇష్టం వచ్చినట్టూ పిచ్చిపిచ్చిగా ఏదో గీస్తూ మమతలో పడి మతిపోగొట్టుకుంటాడు. వాడి పిచ్చి పిచ్చి సంగీతంతో మన మహారాజునే ఎలా మెప్పించగలిగాడో నాకర్థం కాకుండా వుంది.

బాలకృ : అవునవును. దర్బారులో అడుగు పెట్టడానికే అర్హత సంపాదించలేక పోయాడు. అందుకే గనూ, వాడి వాద్యం అడివి పట్టి పోయిందీ !

**2**

(రాజాగమన సూచకంగా తూర్యనాదం వినబడుతుంది. దర్బారులో స్వల్పంగా కలకలం.)

కొన్ని గొంతులు : జయము జయము శ్రీ శ్రీ శ్రీ మహారాజులుంగారికి !

రామచం : సభాసదు లందరికీ మా శుభాకాంక్షలు. కొద్దిసేపు శ్రావ్యమైన సంగీతం విందామని మీ అందరికీ వర్తమానం పంపి ఈ సభ ఏర్పాటు చేశాం...బాలకృష్ణ శాస్త్రిగారూ, ఏదీ......
(తంబూరా, మృదంగం శ్రుతులు చేస్తున్న శబ్దం)

బాలకృ : ప్రభువులు అనుజ్ఞ యిస్తే—

రామచం : ప్రారంభించండి.

(బాలకృష్ణశాస్త్రి ఒక మాయామాళవ రాగం ఎత్తుకొని. కొద్దిగా రాగం పాడి. పల్లవి ఎత్తుకుంటాడు. పల్లవిలో తగుమాత్రంగా సంగతులు వేస్తూ ప్రసారం చేసి స్వరకల్పన ప్రారంభిస్తాడు. నాలుగైదు సార్లు స్వరం జాగాకు వస్తుంది. అంతవరకూ రాజు శాంతంగా వింటూ ఉంటాడు.)

రామచం : ఆగండి శాస్త్రిగారూ, పల్లవి ఆపండి. ఇంక రసవంతమైన పాట ఒకటి పాడండి.

బాలకృ : చిత్తం చిత్తం, ఇప్పుడు నే నాలాపించింది అపురూపమైన రాగం ప్రభూ. ఈ రాగానికి లక్షణం సామాన్య గాయకులకు తెలియనే తెలియదు. తాళంకూడా విలక్షణమైనదే. ఈ పల్లవి నేనే స్వయంగా చేశాను. పల్లవి జాగాలో ఒక చిక్కు ఏర్పరిచాను. ఈ కిటుకు తెలిసినవాళ్ళే ఈ పల్లవి పాడగలరు— అందులోనూ ఈ రాగంలో, ఈ తాళంలో, ఇది పాడడానికి గొప్పజ్ఞానం అవసరమండి.

రామచం : సందేహమేమి? మీరు మహావిద్వాంసులని మాకు తెలియదా? మా ఉద్దేశం—ఏదైనా మనోహరమైనది ఒక పాట పాడమంటున్నాం.

సుబ్బా : ఇప్పటి కర్ణాటక సంగీత ప్రపంచంలో బాలకృష్ణశాస్త్రిగారు అసమాన ప్రజ్ఞా ధురంధరులని ప్రభువులకు తెలియని విషయం కాదు. వారు పాడే పద్ధతి, వారు నిర్ణయించిన బాణీయే అందరికీ వరవడి అయిపోయినాయి. సామాన్య గాయకులకు వారి పాట అనుకరించడమే ఒక లక్ష్యమై పోయింది.

రామచం : మేము కాదన్నామా ? మేమిప్పుడు శాస్త్ర విషయాలూ సంప్రదాయాలూ చర్చించడానికీ పరీక్షించడానికీ కూర్చోలేదు గదా ? పల్లవిపాట విన కుతూహలంగా ఉంది. చల్లని సంగీతం వింటే కాస్త ఉల్లాసంగా ఉంటుందేమో, మనస్సు తేలిక పడుతుందేమో అని మీ అందరినీ రావించాం. హృదయ శాంతి నిచ్చే పాట మీలో ఎవరుపాడినా విని సంతోషిస్తాం.

రామకృ : } చిత్తం చిత్తం. అందరమూ సమిష్టిగా
సుబ్బా : } గానంచేస్తాం అనుగ్రహించండి (కొద్దిసేపు
నరసిం : } గాత్రం. వీణ. ఫిడేలు. వేణువు కలిసి గానం చేసిన శబ్దం.)

రామచం : మీ అందరిగానమూ మా కెప్పుడూ ఇష్టమే. ప్రస్తుతం మా మనస్సు మహాక్షుభితంగా ఉంది.

పెనుగాలికి లేచిన సముద్రపు టలలవలె హృదయమల్లకల్లోలమై పోతున్నది. మా ఆరోగ్యమేమీ బాగాలేదు. ఈ పరిస్థితిలో ఆరభటవృత్తిలో నడిచే ఏ సంగీతమూ చెవిని పట్టదు. మా మనస్సుకు ప్రశాంతి కావాలి. ఆనందం కావాలి. చల్లగా కైశికీ వృత్తిలో నడిచే కీర్తన ఏదైనా వినిపించండి. ......ఇస్ స్ స్! అబ్బా!...(రాజు తలపట్టుకొని కూర్చుంటాడు. క్షణం సేపు విరామం.)

బాలకృ: (సుబ్బారాయ శర్మతో జనాంతికంగా, మెల్లగా) విన్నావా సుబ్బారాయుడూ? రాజుగారికి పాటలో సుఖం కావాలట! పాటలో గాంభీర్యం, ఉదాత్తత ఉండడమే నేటి బాణీ ప్రసిద్ధలక్షణంగానీ, సుఖమెవడికి కావాలోయ్— జోలపాట పాడినట్టు. గోక్కుంటే కావలసినంత సుఖం రాదూ?

సుబ్బా: (జనాంతికంగానే) సుఖం, లాలిత్యం, మాధుర్యంకోసం చూసుకుంటే ఇక మనం కచేరీలు చేసినట్టే! మద్దెలవాణ్ణీ పక్కవాద్యగాళ్ళనూ పెట్టుకొని సుఖంకోసం చూసుకుంటే శ్రోతలు చంపుకు తినరండీ?

రామచం: (తల పైకెత్తి) ఏమంటారు—శాస్త్రీ?

సుబ్బా: ప్రభూ, దర్బార్లలో రాజసమ్ముఖమందు చేసే గానం శుద్ధమైన శాస్త్రీయ సంగీతమే ఉండాలని నియమం ఉంది. మేము చిరకాలంగా నిరంతర కృషిచేసి సాధించిన పాండిత్య ప్రదర్శనకు రాజదర్బారులే గదా ముఖ్య వేదికలు?

రామచం: అవుగాక. అయితే శాస్త్రీయ సంగీతంలో చల్లనిపాటలు లేవంటారా? లాలిత్యమూ మాధుర్యమూ లేవంటారా?

బాలకృ: ఉంది ప్రభూ. లాలిత్య మాధుర్యాలు కావాలంటే కైశికీ వృత్తిలోనే పాడవలసి ఉంటుంది. అది ఇప్పటి ఉన్నత సభలలో పాడే పద్ధతి కాదు. ఔచిత్య భంగంకూడా కలుగుతుంది. గాయకుడిని శ్రోతలు న్యూనపరుస్తారు.

రామచం: వీధి సభలలో విషయాలు మాకు తెలియవు. మేము మాత్రం మిమ్మల్నెవ్వరినీ న్యూనపరచం. అలాగు మీరెవ్వరైనా పాడితే విని సంతోషిస్తాం. అదే మా ప్రస్తుత మనస్థితికి కావలసినది.

నరసిం: (తొందరపాటుగా) ప్రభువులు పిచ్చి ఫిడేలుగాడి పాట మనసులో పెట్టుకొని ఈ మాటలంటున్నట్టుంది.

సుబ్బా: శాస్త్రం చెడగొట్టి, సంగీతం సంకరం చేసేశాడని వాడిని మేం మందిరం వెలివేశాం...

బాలకృ: పండితులలో ప్రసిద్ధికెక్కిన బాణీ పూర్తిగా పూడ్చిపెట్టి, తన తలకు తట్టినట్టూ తిక్కరి బిక్కిరిగా ఏమేమో వాయించుకపోతాడు.

నరసిం: తలబిరుసుతనం కూడా ఉంది వాడికి. మేం వెలివేసిన ఆ పిచ్చి ఫిడేలుగాణ్ణి ప్రభువులే చేరదీశారు. ఆదరించారు. మాతో సమాన గౌరవం ఇచ్చారు.

రామచం: (విసుగ్గా) ఇచ్చామయ్యా. ఇచ్చాం— సరే. మీకేం తక్కువ చేశామా? అతడిపాట మాకే కాదు, అడవిలో పక్షులకూ, మృగాలకూ —ఆ మాటకొస్తే చెట్లు చేమలకు కూడా ఇష్టమే. అతడు పూర్ణత చెందిన నాదోపాసకుడు. అతడు నిండు హృదయంతో పాడుతాడు. అతడి హృదయమే అతడి గానానికి నియమాలు తీర్చి దిద్దుతుంది. అతడి గానం అపురూపగానం, అమరగానం. మా కళ్లతో చూశాం. మా చెవులతో విన్నాం. అతడు గానం చేస్తున్నంతసేపూ మా హృదయం ద్రవించిపోతుంది, మైమరపు కలుగుతుంది. అతడు మా కందించిన ఆనందానికి విలువకట్టడం కూడా కష్టమే........మా ఒంట్లో బాగా లేదు......ఇప్పటికి సభ చాలిస్తాం......

## 3

(దర్బారుహాలు ప్రక్కగది. సమయం సాయంత్రం అనేకులు మెల్లమెల్లగా మాట్లాడుకుంటున్న ధ్వని)

అనేకంగా గొంతుకలు: ఓహ్హోహ్హోహ్హో!...మియ్యా......వ్! మ్యా...వో! భౌ...—పిచ్చోడొచ్చాడ్రో! పిచ్చోడో! సంకలో ఫిడేలుకూడారోయ్!...పిచ్చి ఫిడేలుగాడ్రోయ్!

ఒకడు: వాడికి పిచ్చా? ఫిడేలుకు పిచ్చా?

మరియొకడు: (వెక్కిరింపుగా పాడుతూ) అదుగో వచ్చె మాధవి—అల్లదుగో వచ్చె మాధవి!

శంకరకవి: ష్ష్ష్! అందరూ నిశ్శబ్దంగా ఉండమని ప్రార్థన. మహారాజులు విద్వాంసుల నందరినీ రప్పించారు—ఇది విద్వత్సభ. రాజదర్బారులో మర్యాదగా మెసలడం నేర్చుకోవాలి.

రామకృష్ణకవి: కొంతకాలమైంది విద్వత్సభ జరిగి. ఇవాళ విద్వద్గోష్ఠి ప్రారంభిస్తారేమో ప్రభువులు.

శంకర: అయిఉంటుంది. ప్రభువులు సర్వతోముఖులు గదా.

బాలకృష్ణశాస్త్రి: ఏమో! ప్రభువిప్పుడు ఆరోగ్యంగా లేనట్టు వింటున్నాం. ఇప్పుడు వారి దేహస్థితితో పాటు మనఃప్రవృత్తికూడా మారినట్టుంది.

శంకర: అదేమయ్యా అలాగంటారు? మన మహారాజులది మంచి నిశితబుద్ధి గదండీ? తాము విన్న పద్యంలో సూక్ష్మాతిసూక్ష్మంగా ఉన్న ధ్వని భేదాలు పరిశీలించగల బుద్ధిసూక్ష్మత వారిది.

రామకృష్ణ: పద్యంలో హృదయానికి హత్తుకొనే భావం లేకపోతే, ఏకవి చెప్పినదైనా సరే, పెదవి విరిచేస్తారు.

బాలకృష్ణ: మీకేం మహాత్మా! మీకవు లెప్పుడూ అదృష్టవంతులే. రాజేదో పురమాయిస్తారు— మీరేవో వ్రాసేస్తారు — కావ్యాలు కల్పించేస్తారు—పాత్రలను సృష్టించి, పన్ని పేరులూహించి, వర్ణనలవర్షం కురిపించేస్తారా (నవ్వుతూ) పిక్క పేలితే, కావ్యం రోజులలో పూర్తిచేసేస్తారు లేకపోతే సంవత్సరాలకొద్ది గడువులు కోరుతారు. మీరు నిరంకుశులు. సంభావన బాగా ముట్టితే ఆకాశానికెత్తేస్తారు. ముట్టకపోతే పాతాళానికి దిగదీస్తారు.

శంకర: కవులంటే ఎంత అక్కసయ్యా మీకు! మరి మీ గాయకులుమాత్రం? మీది సద్యఃఫలితం గదా!

బాలకృష్ణ: అదే మా కొంప తీస్తుందండోయ్! గాయకుడి బ్రతుకంతా దైవాధీనమే. గానంచేసినవాడూ గాడిదనెక్కినవాడూ ఒకటే అంటారు అభిజ్ఞులు. వేళావిశేషం ఇద్దరినీ చివరికి ఏవొడ్డు కీడ్చుకుపోతుందో దైవానికే తెలియాలి!

రామకృష్ణ: బాగా అన్నారు!

బాలకృష్ణ: ఇప్పుడు మాకో పెద్ద చిక్కే వచ్చింది. మేము చిరకాలంగా నిరంతరమూ సాధనచేసి సంపాదించిన విద్యమాట అటుంచండి. ఇప్పటి కాలాని కనుగుణ్యంగా రాజదర్బారులోనూ, సంగీత సభలలోనూ మంచివ్యాప్తిలోకి వచ్చి ప్రసిద్ధిపొందిన బాణీలో పాడటం అలవర్చుకున్నాం. అదంతా రాజుగారికక్కర్లేదిప్పుడు. వారికి కావలసింది మృదుమధురమైన, లలిత లావణ్యమైన చల్లని సంగీతం!

సుబ్బా: పాడుతున్నవాడు తన్మయత్వం పొందాలట! విన్నవాడికి సుఖంగా ఉండాలట! హృదయం ద్రవించి పోవాలట! కళ్ళ వెంబడి నీళ్ళు కారాలట!

పీతాంబరం: పెద్దవాళ్ళు మాటాడుతుంటే అడ్డువస్తున్నాను. క్షమించాలి. మరి—సంగీతానికి లక్ష్యమేమిటండీ? అది తెలవియ్యండి ముందు. 'రంజకో జన చిత్తానాం' అన్నాడు శాస్త్రకారుడు. పాటలో మార్దవం లేకపోతే, లాలిత్యం లేకపోతే, మాధుర్యం లేకపోతే, హృదయ రంజకత్వం లేకపోతే, అది కేవలం కుస్తీ, కసరత్తు పని, అనిపించుకుంటుందిగాని గానమనిపించుకోదు — నా దృష్టిలో.

నరసిం: నీ దృష్టి! నీ అడివి కోదన సంగీతం! నువ్వా- నిన్నెవడడిగాడోయ్—మహా తెలిసిన వాడిలా మధ్య మాట్లాడుతావ్!

శంకర: కాదు కాదు. ఇతడు చెప్పిందీ సబబుగానే ఉంది. సరిగా ఈ లక్షణాలే మంచికవిత్వానికీ ఉన్నాయి.

బాలకృ: ఏమయ్యా, నీ పేరేమిటో— (సభలోంచి 'పిచ్చోడు,' 'పిచ్చిఫిడేలుగాడు' అన్న కేకలూ, నవ్వులూ)

పీతాం: నా పేరు పీతాంబరుడంటారండి.

బాలకృ: అయితే పీతాంబరంగారూ, గానానికి గాంభీర్యమూ ఉదాత్తతా ఉండొద్దుటయ్యా? ఈ రెండేగదా, నేటి గానానికి అత్యవసరమైన ఉత్తమలక్షణాలుగా మేము నిర్ణయించుకున్నాం.

పీతాం: చిత్తం. గాంభీర్యమూ, ఉదాత్తతా గాన లక్షణాలలో భాగమేనండి. అవి తప్పకుండా ఉండవచ్చును. దీనినే ఆరభటీవృత్తి అంటారు. అర్థం చెడకుండా ఉన్నంతవరకూ, చెవికింపుగా ఉన్నంతవరకూ, రసం పోషిస్తున్నంతవరకూ ఇవి నిరభ్యంతరంగా గానంలో ఉపయోగించవచ్చును. కాని—

సుబ్బా: ఇంకా 'కానీ' ఏమిటయ్యా? వీడికి—ఇతడికి ప్రసిద్ధమైన మనబాణీ అంటే ఎంత అక్కసుగా వుంది!

పీతాం: బాణీ, బాణీ అంటూ మరో విచిత్రమైన ఉచ్చారణ సృష్టించుకున్నారు. కర్ణాటక సంగీతముందిగాని, దానికో బాణీ అంటూ లేదు. ఇతర ప్రాంతాలలోవున్న ఎవరో ప్రసిద్ధ గాయకుల ఉచ్చారణ అనుకరించడం నేర్చుకొని దానికి 'బాణీ' అంటూ మీరంతా నామకరణం చేశారు. ఈ అన్యప్రాంత గాయకులకట్టి ఉచ్చారణ రావడానికి అనేక కారణాలున్నాయి. బహుశా వారి స్వభావసిద్ధి కావచ్చునేమో! తేనెలొలికే తెలుగు భాషకుమాత్రం ఇది అతకదు. శాస్త్రగ్రంథాలలో బాణీల ప్రసక్తే లేదు నా మాట నమ్మండి. ఏనాటికైనా మనం మేలుకొని మన స్వంత ఉచ్చారణతోనే గానం చెయ్యక తప్పదు.

# అభినవ పండితరాయలు: అవధాన ప్రతిభ

## శ్రీ నిడదవోలు వేంకటరావు

విఖ్యాత శతావధాన ధురంధరులగు తిరుపతి వేంకట కవులకు ముందు తెలుగు దేశమున నవధానవిద్యను ప్రచారమునకు దెచ్చిన యద్భుత మేధావులును, నసాధారణ ధారణాశక్తి సంపన్నులునగు విద్వాన్ అభినవ పండితరాయ మాడభూషి వేంకటాచార్యులవారు నేటి యాంధ్ర విద్వత్పండితలోకమునకు బరిచితులు. వారి ప్రతిభాదికమును శ్రీ తిరుపతి వెంకటకవులే తమ యవధానముల దొలుత దెలిపిరి. కీర్తిశేషులు ప్రభాకరశాస్త్రి పాదులు మరికొంత తెలిపిరి. ఈ తరువాత 'ఆంధ్ర వారపత్రిక సువర్ణోత్సవ సంచిక'యందు శ్రీ శివరామ శాస్త్రి మహోదయులు ప్రశంసించిరి. కాని యాచార్యులవారి యవధాన విశేషములు మాత్ర మీవఱకు వెలుగునకు రాలేదు. వానిని దెలుపుటయే యీ వ్యాసోద్దేశము.

"శ్రీమన్మాడభూషివంశ కలశాంబుధిరాకాసుధాకరాయమాన శ్రీ నరసింహాచార్య తనూభవుడు, తర్క వ్యాకరణ మీమాంసాజ్యోతిషశాస్త్రకూలంకష మనీషా విశేషుడు, ప్రాకృత వైకృత శౌరసేనీ మాగధీ పైశాచీ ప్రముఖ భాషా వ్యాకరణ పరిజ్ఞానచణుడు, ఆంధ్ర గీర్వాణోభయభాషా ప్రబంధరచనా విచక్షణుడు, సమధిక సంగీతసాహిత్య సర్వస్వుడు, శతలేఖినిపద్య సంధానధురంధరుడు, అష్టముఖాష్టభాషా వ్యస్తాక్షరీ విద్యానవద్యుడు, ఏకకాల సందర్భితాష్టావధాన ప్రకారుడు, ద్వివారపఠనమాత్రపరిగృహీతానులోమ ప్రతిలోమాది బహువిచిత్ర ప్రకార పఠితాంధ్రగీర్వాణ వృత్త ప్రబంధుడు' – వేంకటాచార్యులు.

అవధానములుగాక ఆచార్యులవారి ప్రత్యేక రచనలీ క్రిందివి మనకు లభించినవి.

1. భరతాభ్యుదయము: ఇది నాల్గాశ్వాసముల ప్రశస్తప్రబంధము. శకుంతలోపాఖ్యాన కథ యితివృత్తముగాగలది. విద్యావినోది పసప్పాకము ఆనందాచార్యుల వారికి కృతి.1 వారు దీనికొక యాంగ్లేయభాషా పీఠికను రచియించియున్నారు. వారి యాదేశముననే గాబోలు నీ గ్రంథమున మచ్చునకైన శృంగారవర్ణన కానరాదు; సముచితముగను సరసముగను మాత్రమే కనుపట్టును. ఇది క్రీ. శ. 1885 లో రచితమైనది. భారతవర్ష మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు తమ విశ్వేశ్వరీయమున నీ కావ్యమును నిట్లు సూచించిరి. "బంగారము భరతాభ్యుదయము సెక్కసు వేడ్క సేయించి పలు మొగంబులగాంచు ఫలములనొగి వలయునుగా."

2. పుష్పబాణ విలాసము: ఈ యాంధ్రీకృతిని యాచార్యులవారు క్రీ. శ. 1876 లో రచించిరి. ఆ సంవత్సరముననే ఇది ముద్రితమైనది. 2ఇదియు ననంతాచార్యులవారి ప్రేరణచే జరిగినది. గ్రంథప్రారంభమున.

సరసుడు వామనాకృతి స
    త్సార విచారుడు రుక్మిణీ మనో
హరుడు నవాప్తకాముడు మ
    హాత్ముడనంతుడు సత్ప్రియంకరాం
తరుడొకనాడు ప్రేమకల
    నన్ నయ గన్గొని యొప్పరింప భా
స్వరమతి బూనితిన్ కుసుమ
    బాణవిలాసము తెన్గు సేయగన్.

అనియు, గ్రంథాంతమున,

సరసుడు మాడభూషికుల
    సాగరచంద్రుడు వేంకటార్యకుం
జరుడు రసోత్తరంగముగ
    జంపకమాలిక గూర్చి సంతసం
బరయగ ననంతునకు
    నర్పణ దానొనరించె నీకృతిన్
చిరయశులై గుణగ్రహణ
    శీలత పండితులార జూడుడీ.

---

1 చాటుపద్యమణిమంజరి ద్వితీయ భాగము; క్రీడాభిరామపీఠిక. భరతాభ్యుదయ మాకాలమున మదరాసు విశ్వవిద్యాలయమున పట్టపరీక్షలకు దెలుగున పఠనీయగ్రంథముగా నుండెడిది. నేడిట్టి యుదాత్త రచనల స్మరణయే లేదు.

2. చూడుడు నా పుష్పబాణవిలాస పీఠిక. శ్రీ భట్టారం మల్లిఖార్జున, కొలుకలూరి నారాయణరాయ కవిద్వయకృతాంధ్రీకరణము.

-నియమకలను. ఇందలి విశేష మేమనగా గ్రంథనామము పుష్పబాణ విలాసము గావున నిందన్నియు చంపకమాలికా వృత్తములే ప్రయుక్తములైనవి. ఇతరాంధ్రీకర్తలీ నియమము ననుసరింపలేదు.

3. రామావధూటీతారావళి. ఇది రెండు మూడు తడవులు ముద్రితమైనదే. ఇందన్నియు సీసములు, శృంగార రసమయములు.

4. ఆనందగజపతీంద్ర శతకము. విజయనగర సంస్థానాధీశుడును, విద్యాభోజుడు నగు నానందగజపతిని సందర్శించునపుడు చెప్పిన శతకము. ఇందు నలుబది మూడవపద్యము కొంతదాక మాత్రమే లభించినది. అముద్రితము. మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారమున గలదు. మచ్చునకు రెండు పద్యములు.3

శ్రీమానిని నిత్యధామాయమాన బా
  హాంతరుండు మనోహరాంతరుండు
సేవాపరాశేష దేవాఖిలాభీష్ట
  దాయకుండు త్రిలోకనాయకుండు
హారాంగుళీకటక కేయూరాది కల్యాణ
  భూషణుండు విచిత్ర భాషణుండు
నానావిధజగద్విధానాది చతురాత్మ
  వర్తనుండు భవాగకర్తనుండు
నిజపదాంభోజభజన వినీయమాన
పావన పరాయణుండు నారాయణుండు
నంచితముగ మిమ్ము రక్షించుగాత
ఘనదయాసాంద్ర యానందగజపతీంద్ర!

సాధుసంస్కృతశబ్ద సంభాషణక్రియా
  పాటవంబున జూడ పాణినీయ
మఖిలపదార్థ గుణాగుణవిజ్ఞాన
  కౌశలంబున జూడ గౌతమీయ
మర్థశబ్ద గుణదోషాలంకృతి రస వి
  జ్ఞానంబు గన నలంకారశాస్త్ర
మజ్ఞ సర్వజ్ఞ కాలాశబ్దరూప ని
  ర్ధారణంబున జూడ తత్త్వశాస్త్ర
మధిగతి ప్వాఖిలార్థంబు లగుచు మిగుల
కరతలామలకంబులై కరణిమెఱసి
నిట్టి పాండిత్య మరుదయ్యె నృపులలోన
ఘనదయాసాంద్ర యానందగజపతీంద్ర!

ఇక యవధాన విశేషములు: వేంకటాచార్యుల వారొనర్చిన యవధానములలో నూజివీటి శతావధానము ప్రసిద్ధమైనది. దాని వివరణముల్లను దెలుపుచున్నాను.

క్రీ. శ. 1872 ఫిబ్రవరి 21 తేదీని యప్పటి నూజివీటి సంస్థానాధీశులగు శ్రీ రాజా నారయ్య అప్పారావు బహదరువారు, నూజివీటి శాఖానగరమగు ఆగిరిపల్లియందు తమ సౌధమున నొక విద్వన్మహాసభ నేర్పాటు గావించిరి. ఆ సభకు శ్రీ రాజా నారయ్య అప్పారావు బహాదరువారు, వారి సోదరులు శ్రీ రాజా రంగయ్యప్పారావు బహాదరు, శ్రీ రాజా వెంకటాద్రి అప్పారావు బహాదరు, శ్రీ రాజా సింహాద్రి అప్పారావు బహాదరు, శ్రీ రాజా వెంకటరామయ్య అప్పారావు బహాదరుగారలు, పిఠాపురము రాజా, శ్రీ రావు వెంకట మహీపతి గంగాధర రామారావు బహద్దరుగారు, నర్సారావుపేట జమీందారు రాజా మల్రాజు కొండలరావు బహద్దరుగారును విచ్చేసిరి. వీరందరు తమతమ యాస్థాన విద్వాంసులను కవులను కూడ తోడ్కొని వచ్చిరి. ఆ సమయమున శ్రీ రాజా నారయ్య అప్పారావుగారు నిజాస్థాన విద్వాంసులలో ముఖ్యులైన శ్రీ మాడభూషి వేంకటాచార్యుల విద్యావిశేషముల శ్రీ గంగాధర రామారావుగారి కెఱుకపఱచిరి. శ్రీ గంగాధర రామారావుగారపుడు వేంకటాచార్యులవారి జూచి "ఆర్యా! మీ శతలేఖిని పద్యప్రబంధ నిబంధన చమత్కారంబు జూడ కుతూహలం బగుచున్నది" అని యనిరట. అంత వేంకటాచార్యులు తత్క్షణమే యన్యవధానంబుగా నూఱుపద్యములు చెప్పుటను ప్రారంభించిరి. వర్ణ్య వృత్తంబు లాయా లేఖకులు కోరినట్టి రీతిని చెప్పిరి. ఒక్కొక్కరి కొక్కొక్క చరణము చొప్పున చెప్పగా సంస్కృత భాషయందు యిరువదేను వృత్తములును, తెనుగున యిరువది వృత్తములును, ఉభయ భాషల యందు నాలుగు కీర్తనలు మొత్తము 51 లేఖనములైనవి. అంత సభవారు "ఆర్యా మీ రిట్లు సహస్రములైన జెప్పగలరు. కావున నింతటితో చాలించి పద్యచరణములను పూరింపుడు" అని కోరిరి. అట్లే యాచార్యులవారు సీసాంతగీతములే కాక, కీర్తనలను తాళస్వర నియమసహితముగా పూరించిరి. అంతట గంగాధర రామరాయేంద్రుడు ఆచార్యులవారి ద్విసంథాగ్రాహిత్వము పరీక్షింపగోరి, యొక సీసపద్యమును సభవారిలో నాస్థాన పౌరాణికుని జదువమనిరి. ఆచార్యులవారు పౌరాణిక ధోరణిలో జదువుటయేగాక ననులోమ ప్రతిలోమ భంగిని దానిని పఠించిరి. అంతట రామరాయేంద్రుడా తెలుగు సీసపద్యమున భావము నొక సంస్కృతశ్లోకములో జెప్పుడని యానతీయగా నాచార్యులవారట్లే శ్లోకము జెప్పిరి. అవెనుక సభాతోషనాలంకార సమన్వితమగు నొక తెలుగు వృత్తము రచింపుడని కోరిరి. ఆచార్యులవారు తెలుగు పద్యమును కోరిన వెంటనే చెప్పిరి. శతావధానసమయమున జెప్పిన పద్యములయందుగాని శ్లోకములయందు గాని నెంత యాశువుగ రచించినను నే విధమైన

3. గ్రంథసంఖ్య R. No. 591.

స్ఖాలిత్యంబులు లేకుండుట చూచి, రాజేంద్రులును, సభాసదులును నత్యాశ్చర్య మనస్కులై యాచార్యులవారి యత్యద్భుత మేధావిలసన సంపత్తిని, ధారణాశక్తిని వేనోళ్ల గొనియాడిరి. అప్పటికే రాత్రి యతియామమగుటచేత నానాటికి సభ సమాప్తమయ్యెను. అప్పుడు రామరాయేంద్రుడును తక్కిన రాజపుంగవులును వేంకటాచార్యునికి 1. బంగారు కవచ విశేషము, 2. జోడుకలాబతు శాలువలు, 3. ఒక కలాబతు గుమాలు, 4. 1116 రూపాయిలును నొసంగి సన్మానించిరి. ఆనాటిరాత్రి జరిగిన యవధానమునందలి శ్లోకపద్యకీర్తనలు వేఱుగా అనుబంధమున తెలుపుచున్నాను.

## అభినవ పండితరాయబిరుదము

శ్రీ గంగాధర రామరాయప్రభు వంతతో తనివి నొందక మఱునాడు మరల సభను తామచ్చట నివసించు సౌధముననే సమావేశపఱచి వేంకటాచార్యుని యవధాన విద్యాకౌశలమును ప్రదర్శింపగోరిరి. అప్పుడాచార్యుల వారు "అష్టభాషా వ్యస్తాక్షరి" అను నవధాన ప్రక్రియను జూపిరి. అష్టభాషలలో నప్పుడు మూడుభాషలు మాత్రమే యొసగబడినవి. అవి 1. ఇంగ్లీషు-హిందూస్థానీ-అరవము అనునవి:

ఇంగ్లీషు: లొాయిజ్ దీ యూనక్ సీమన్ ఆఫ్ మైండ్ నో సుపీరియర్ బెలాస్ ఫర్ కఙ ఫర్మ్డ్.

హిందూస్థానీ: ఆశాకొచాబూ నిరాశాకొమాయి హుయెతో లూగాబహిన్ నైహుయెతో యార్ జాగేతో భాగేగ సోవేతో ఖోవేగ.

అరవము — విల్ పగైవిరివన్ కండనం మల్లుంవేళై ముంపావానంపీళ చిత్తిరంతనై.

ఈ భాషాత్రయ వ్యస్తాక్షరి నాచార్యులవా రత్రిగుమున నెఱవేర్చిరి.

అప్పుడు గంగాధర రామరాయ ప్రభువు వేంకటాచార్యులవారిని గూర్చి సభాముఖమున "ఈ సామర్థ్యం బెల్లఁ బరిశీలింప నీయాకృతి పండిత రాయల వారి యపరాకృతియై దోచుచున్నది. కావున నీయాచార్య డింతటినుండి పండితరాయ వెంకటాచార్యులని బిలువ నర్హుండు" అని ప్రకటించి వెంకటాచార్యుల వారి కభినవ పండితరాయ నామాంకితుని గావించిరి. క్రీ. శ. 1872-ఫిబ్రవరి తే 23 ది నుండి, యాచార్యులవారు క్రీ. శ. 1887 లో వైకుంఠవాసు లగుపర్యంతము నీ బిరుదమును ధరించిరి.

## అవధానవిద్యావ్యాప్తి-దేవులపల్లి సోదరులు

వెంకటాచార్యులవారు పీఠికాపురసంస్థానమున క్రీ. శ. 1879 లో నవధానమొనర్చినటుల దేవులపల్లి సుబ్బరాయశాస్త్రులవారి మహేంద్రవిజయ పీఠిక తెలుపుచున్నది.

"1879 వ సంవత్సరమున నవంబరునెలయందు భరతాభ్యుదయ ప్రబంధకర్తలును శతావధానధురీణులు నగు శ్రీవిద్వాన్ మాడభూషి వేంకటాచార్యులవారు తమ యవధాననైపుణ్యంబును జూప పీఠికాపురంబున కేతెంచి దానకర్ణులును విద్యాభోజులును నగు శ్రీగంగాధర రామరాయప్రభువర్యుల కారుణ్యపాత్రతంబడసి వారి కొల్వుకూటమున దమయవధాన విశేషములు ప్రదర్శించిన, రసికావతంసంబగు నా రాజమూర్ధన్యుడు తదవధాన వైచిత్ర్యంబునకు నసాధారణ ధారణాసామర్థ్యంబునకు నెంతయు సంతసించి తగు పారితోషిక మొసంగి వారల సంతుష్టులం గావించి యిట్లనిరి. 'సభ్యులారా! మన యాస్థానమున నేతాదృశ విచక్షణు లెవ్వరేని నిప్పటిల్లుదురో' యని ప్రశ్నించిన పిమ్మట నా సభాసదులలో నొకరులేచి 'దేవా! దేవరసాంస్థానిక విద్వాంసులగు దేవులపల్లి కృష్ణశాస్త్రులవారి పుత్రులగు సుబ్బరాయశాస్త్రులవారు నమ్మన శాస్త్రులవారు నీయవధానంబునందు సమర్థులని విన్నవించిరి" (పుట 6)

ఆపైని గంగాధర రామరాయేంద్రుడు దేవులపల్లి సోదరకవులను బిలిపించుటయు, వేంకటాచార్యుల వారి సమ్ముఖముననే వారవధానము చేయుటయు నాచార్యులవారు సోదరుల నిద్దఱను ప్రశంసించిరను విషయము లందుగలవు.

పీఠికాపురసంస్థానమున నాచార్యులవారి యవధాన విశేషము తెలియబడలేదు. కాని ఆచార్యులవా రవధానము చేయుటయే గాక తద్విద్యావ్యాప్తికి కొంత తోడ్పడినవారని పై యంశము ఋజువు చేయుచున్నది.

## తిరుమల బుక్కపట్టము రాఘవాచార్యుడు

వెంకటాచార్యులవారు నూజివీటి శతావధానము చేసిన దినములలో, నూజివీటియందు సంస్కృతాంధ్రాంగ్ల భాషాపాండిత్యము సంపాదించిన యొక యువకవి యష్టావధాన మొనరించెను. అతడే తరువాత తెనుగు దేశ చరిత్రకు శ్రీకారము చుట్టిన మహనీయుడు. (తిరుమల) బుక్కపట్టణము రాఘవాచార్యుడు. ఈరాఘవాచార్య రచితమైన "కువలయాశ్వవిజయము" అను ప్రశస్త ప్రబంధ మొకటి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్నది.[4] అందు రాఘవాచార్యుడు తనపూర్వులవృత్తాంతమును దెలిపియున్నాడు. అందు తన్నుగూర్చి చెప్పుకొనునప్పు డిట్లు వ్రాసియున్నాడు.

4 గ్రంథసంఖ్య R 610.

# అభినవ పండితరాయలు: అవధాన ప్రతిభ

"తిరుమల బుక్కపట్టణము శ్రీనివాస తాతాచార్యుఁడు సింగమాంబయందు ననంతుని, రాఘవాచార్యుని, వేంకటాచార్యుని బడసెను. అందు రాఘవాచార్యుండను నేను

క. పదుగురుఁ దగునని మెచ్చఁగఁ
బదియాఱవ యేట సారభాషాంధ్రములన్
విదితముగా నింగ్లీషున
నొదవఁగ నష్టావధాన మొనరించినాఁడన్.

శా. విద్వాన్ వేంకటవర్యుఁ బాండితిని మె
ప్పించంగ శక్యంబె యే
విద్వత్కోపరికైన నన్నతఁడు భా
వింపంగ నూజ్వీటిలో
నద్వైత ప్రతిభన్నరేసు సభయం
దష్టావధానమ్ము నే
సద్భావాలతఁ జెప్పి యాతఁడును మె
చ్చంగా తమాషోశిన్
మృధ్వీక స్థితి వట్టి నానిపుణత
స్వైతేల వర్ణింపఁగన్"

పై యుదాహృత భాగమును బట్టి రాఘవాచార్యుఁడు. పదునాఱవయేట సంస్కృతమున. సాంధ్రమున, నాంగ్లేయభాషలో నష్టావధానము నొనరించెననియు, నది నూజివీటి రాజాస్థానమున విద్వాన్ వేంకటాచార్యుని సమక్షమున జరిగెననియు, నెవ్వరును మెప్పింపలేని వేంకటాచార్యుని తాను మెప్పించితి ననియు మనకు దెలియఁజేసియున్నాఁడు.

ఆచార్యులవారి నూజివీటి శతావధానము క్రీ. శ. 1872 కావున [5] రాఘవాచార్యుఁడు నాకాలముననే యష్టావధానము చేసియుండవలెను. రాఘవాచార్య కృతి యీఁటిక ముద్రితము.

## అనుబంధము

ఆగిరిపల్లిలో క్రీస్తుశకము 1872 ఫిబ్రవరి 21 తారీఖున జరిగిన సభలో మాడభూషి వేంకటాచార్యుల వారిచేత రచింపబడిన శిఖలేఖినీకవిత్వ ప్రయుక్త శ్లోకాదికము.

కవ్యాచార్యవిషయము-పృథ్వీవృత్తము.

నృసింహ మతులార్జవం నృహరిపాద పద్మాశ్రితం
మహాద్భుత కలానిధిం మనుజనాథ సన్మానితం,
శమాదమదమాన్వితం స్వజనజాల సంతారకం
నమామి గుణసాగరం వినయవాఙ్మయాతాంచితం.

తోడిరాగము, కీర్తన - రాజా వెంకటమహీపతి గంగాధరరామారావు గారి విషయము.

మహారాజ శ్రీ మండలేశ్వరా
బహుదూర్ బిరుద బహుశోభితా
అహార్యేంద్ర ధైర్య అసమానచర్యా—మహా॥

1. రావువంశ నీరరాశి పూర్ణచంద్ర
బోవయ్య రామభూపదేవేంద్ర— మహా॥
2. భావజాంగ పుత్రపౌత్రసమృద్ధిగా
వేవేలేలవయ్య వేంకటార్యసుత— మహా॥ 2

విద్యున్మాలావృత్తము-శ్రీరామవిషయము

రామం లోకారాధ్యం వేద
స్తోమైకవేద్యం శోభాహృద్యం,
వందే దేవం వర్షాంభోద
శ్యామం కామాస్వాంతస్థానం. 3

గీతపద్యము-నరసింహ విషయము.

భక్తప్రహ్లాదు నిడుములపాలు సేయు
నసుర హింసింప స్తంభంబునందునుండి
వెడలి కృతకృత్యుఁడై జగద్విదితకీర్తి
లక్ష్మియును నొప్పు నృహరిఁ దలంతు మిసల. 4

ప్రహర్షిణీవృత్తము - వేదాంతి దేశిక విషయము.

వేదాంతార్య మహోపశైల రాజఘంటా
రూపం శ్రీహయముఖ సత్కృపాప్రపూర్ణం,
వందే మే సకలకలాకలాపపూర్తి
స్థానార్య త్రయ్యఘశమనాయ చాతిమాత్రం.

చంపకమాలికావృత్తము-శరదృతు వర్ణనము.

స్థిరతర నిర్మల ప్రకట
జీవనయుక్తి జగత్ప్రసిద్ధమై
సరసుల కెల్ల నల్లసిలె
సత్ఫలభూతియు జూడనొప్పె బె
క్కురసెను రాజహంసగమ
నాగమనంబులు నిగతిన్ సభాం
తర జలదాగమాంతము ము
దం బొనగూరిచె నెల్లవారికిన్.

కవిరాజవిరాజితవృత్తము-రాజా రంగయ్యప్పారావు బహాదరు గారి విషయము.

వితతనిజోజ్జ్వల దక్షిణ సద్భుజ
పీఠసమాస్థిత భూరమణీ
ప్రతతి జయానక భాంకృతి భేదిత
వైరిపన్నగహాగోళఘృణీ,
ప్రతిమహిపాల సభాకవిరాజ వి
రాజిత భవ్యగుణాభరణీ
రతిపతి రమ్యశరీర విశోభిత
రంగమహీప నృపాలమణీ.

---

5 రాఘవాచార్యుల వారి యుపంతిమును గూర్చి చూడుఁడు. విభవ సంవత్సరాది సంచిక - అనంతవర తామ్రశాసనము.

మత్తేభము-రాజా సింహాద్రి అప్పారావు బహద్దరు గారి విషయము.

అతిగంభీరుఁ డహార్యధీరుఁడు హయా
ద్యారోహణోదారుఁడ
ప్రతిమాకారుఁ డహర్పతి ప్రతిభట
ప్రభాజన్మసహోదరుఁడౌ
శ్రితమందారుఁడు సద్విచారుఁడగు శ్రీ
సింహాద్రి రాజేంద్రుఁ డా
యతభోగంబుల నొందు గావుత సరో
జాక్షానుకంపోద్ధతిన్.

మత్తకోకిలావృత్తము-గౌతమీ నదీ విషయము.

గౌతమాహృతయై సమస్తజగత్ప్రసిద్ధచరిత్ర సం
స్ఫీతయై యవగాహనిష్కలుషీకృతాఖిల పాపసం
ఘాతయై పరమేష్ఠిపుత్రముఖర్షి రాజమహాశ్రమో
పేతయై దగి గౌతమీనది పేరుగాంచె ఘనంబుగాన్.

గీతపద్యము-ఆగిరిపల్లి పురవర్ణనము.

ఎచటఁజూచిన వేదాంతవచనరాశి
యెచటఁ గన్నను భాగవత చయయుక్త
మహామహ యాగిరి పలిపురి యయనఁగ సకల
దివ్యదేశప్రభావబోధికయ గాదె.

ఆర్యావృత్తము-సుదర్శన విషయము.

రాహుశిరోదళన కరణ
రాహుతపురందరం మహాశస్త్రం,
నౌమి సుదర్శనదేవం
సమరేషు రమాపతే స్సగుపకరణం.

స్రగ్విణీవృత్తము - భండాసుర హననప్రవృత్త మహాశక్తి విషయము.

భండదైత్యాసుర ప్రాణహారాంచితే
దేవి కాలేంగులీభ్యో దశావ్యాకృతిః.
సమ్యగాపాద్య నాథస్య కార్యం శ్రియః
కారయామాసి ధ గ్రావరాడాత్మజే.

ఆర్యావృత్తము-భాష్యకార విషయము.

విమతమతసంవిధూన చతురం
చతురాననాద్యమేయగుణం,
శరణం యామి యతీనాం
పతిమీశం మాదృశాం స్వభక్తానాం.

మందాక్రాంతావృత్తము - శోభనాచలస్వామి విషయము.

శ్రీమత్యద్రౌ శుభమణిఖనౌ
శోభనాఖ్యావతస్మిన్
లక్ష్మ్యా నంద్యా లలితవపుషా
లోకగుప్త్యై వసంతం,
సారం తత్త్వం సముపనిషదాం
శ్రీనృసింహాఖ్యమీశం
భక్త్యానిత్యం పరమమమృతం
శ్రీనృసింహం నమామి.

శిఖరిణీవృత్తము-కృష్ణకైలాసయాత్రావిషయము.

సుతాముద్వాహ్య శ్రీ
హరిరథ మహాన్ భల్లనృపతేః
ముదా తస్యాం తోకం
జనయితు మతీవేప్సిత యుతః,
గిరీంద్రం కైలాసం
గిరిశకృపయా ప్రాప్తుముచితా
భవే దీప్సాస్యేతి
ద్రుత మభిజగామోగ్రతపసే.

రథోద్ధతావృత్తము - శ్రీరంగనాయకవిషయము.

భానువంశనృపమాఽసద్ధనం
చోళశశకుల సుకృతోల్లసత్ఫలం,
రావణానుజ వశంవదాననం
రంగనాయక మముం భజామ్యహం.

భుజంగప్రయాతవృత్తము-నమ్మాళ్వార్ల విషయము.

శఠారాతి మీడే హతాద్ధూతపాపం
రమానాథ సేనావరాంశం మహాంతం,
శ్రుతీర్ధార్ధ గాథాసహస్రం ఘణంతం
ప్రపన్నాగ్రిమ మూర్తిం ప్రకృష్టాత్మకీర్తిం.

పంచచామరవృత్తము-సభావర్ణన.

సభా విభాతి సజ్జన ప్రభాసితాంతరాళికా
ప్రభూత్తమ ప్రసేవన ప్రభూత సర్వమంగళా,
శతావధానకారిభి స్తుతాత్మతత్త్వ విత్తమైః
ప్రతార్కికైః పురాణికైః కృతాంతిభిర్మహాత్మభిః.

పృథ్వీవృత్తము-హయగ్రీవ విషయము.

హయానన మహం భజే స్ఫటికరత్న దివ్యప్రభం
మధుప్రముఖదానవ ప్రహననార్ధబద్ధోద్యమమ్,
స్వభక్తజనసత్కళా ప్రద నిజ ప్రభావాచితమ్
సమస్తగుణసాగరం సకలలోక రక్షాచణం.

శిఖరిణీవృత్తము-చంద్రోదయవర్ణన.

సురేంద్రాశాయోషా నిటలతటసిందూరతిలకం
చకోరీ విశ్లేష జ్వరశమన దివ్యౌషధఘుటీ,
జగజ్జైత్ర్య నిర్యన్మదనరథ బద్ధధ్వజపటః
వ్యుదేతి ప్రాగద్రౌ స్ఫురదగుణబింబ శ్శశధరః.

చంపకమాలావృత్తము-లక్ష్మీవర్ణన.

సారససద్మా సంప్రతిపద్మా
సుందరరూపా శోధితపాపా,
రక్షతు సూర్యారాధిత చర్యా
మామిహ నీచం మంత్ర్యపి శోచం.

శిఖరిణీవృత్తము-రంగనాయక విషయము.

శయాన శ్శ్రీరంగే
　　స్ఫటికఫలకాభే ఫణిపతౌ
శ్రియా సంశ్లిష్టాంగ:
　　కృత నతిసముత్సాహనికర:,
దయానందాగ్ర్యాద్య
　　ద్గుణమణి సముద్రో హ్యసుకృతాం
శ్రియా నస్సాక్షాత్పుష్ణన్
　　పరమపురుషోవ్యా దవిరతం.

మాలినీవృత్తము-రామపట్టాభిషేక విషయము.

సరసిజభవముఖ్యై స్సర్వనిర్భిస్స్వభక్తై
ఋషికతనుభవాద్యై స్సైన్యసామంతవర్యై:,
సురుచిర సుమహార్తే సంయుతే మైథిలీశ
స్సముదిత మభిషిక్తో రాజభావే రరాజ.

మత్తేభము-కాంచీ వరదరాజవిషయము.

కరిశైలంబుల నెల్లలోకముల వే
　　డ్కన్ శ్రోణగా వచ్చి సు
స్థిర కాంచీవరదేశవాసులకు దా
　　దృగ్గోచరుండై మహో
పరమానందముతో నిల్చి మునిసం
　　భావ్యుండునై యొప్పు శ్రీ
వరదున్ భక్తవరప్రదాయి గొలుతున్
　　వాంఛాపరిస్ఫూర్తికై.

పుష్పితాగ్రావృత్తము-మన్మథవిషయము.

సరసిరుహనికేతనాకుమారం
సరసతరాద్భుత చాప బాణశూరం,
వరసమరజితాఖిలప్రపంచం
స్మర మిహ సౌమ్యయి విస్మరేతి మాం త్వం.

స్రగ్ధరావృత్తము-భాష్యకారవిషయము.

శ్రీమాన్ చార్వాక లోకా
　　యత సుగుకణభుక్ఛంకరాది ప్రణీతం
మాయావాదప్రభూతం
　　మతమిళితమిరం నాశయామాస ఏత్వా,
య శ్శ్రీభాష్యప్రదీపం
　　సకలవిద చిదుజ్జీవనారావతార
స్సోయం శ్రీ భాష్యకార:
　　కిల శరణపదం మాదృశానాం జనానాం.

వియోగినీవృత్తము-శ్రియఃపతివిషయము.

శ్రితసర్వసుపర్వపోషకం
నతలోకాఖిలపాపనాశకం,
స్థిత మాగమసీమ సుశ్రియః
పతి మధ్యాత్మ మహం విచింతయే.

మాళవి గౌళరాగం. కృతి. రాజా నారయ్య
అప్పారావు బహద్దరుగారి విషయము.

నృపతీమణివైన నన్నేలవె శ్రీ నారయేంద్ర
అపరాధులనైనను మది నిపమెన్నక బ్రోచెదవట
మును మాంధాతృభగీరథ ఘనరుక్మాంగద పార్థులు
మును గాగ రాజులు మిమ్ము్న బోల్తురె నారయేంద్ర.
తరుణార్కద్యుతివిగ్రహ సౌందర్యాంచిత పై శ్రేయ
స్కరమై మీదర్శన మతిఘనమౌగదె నారయేంద్ర.

యమునాకల్యాణిరాగము - కీర్తన

నిను నెన్నగ నేనెంతటి నేర్పరి నే సామి
ఘనవెంకటమహిపతి గంగాధర రామేంద్రచంద్ర.
ఘనుడవు నాశ్రిత సంజీవనుడ వీవె సామీ
జననాథుల ందఱు నీసాటియె ఘనగామీ.
కరుణారస భరితాంతఃకరణా సవితారణా
శరణాగత జనసంరక్షణ దీక్షాభరణా.
సారసనయనావతార సజ్జనమందారా
వీరజనాగ్రేసర వరవెంకటకవి రజవరద.

బేగడరాగము-శోభనాచలస్వామి విషయము.

శుభగిరినాయక శుభకరోద్భవ మే
అభయదాయక భయవిభవరదనివార్య-శుభ.
నిరుపమ నిజతను నిర్జితమదనా
సరసీరుహరిపు సమరసవదనా
నరహరే శ్రీరమా నాయక శౌరే
స్థిరతరభక్త్యా సేవయే హం త్వాం-శుభ.

స్రగ్విణీవృత్తము-అగిరిపల్లి వరాహపుష్కరిణీవిషయము.

దివ్యపద్మాళికల్హార జాలాంచితః
భవ్యలక్ష్మీశ సన్మంటపోద్భాసితః,
సేవ్యతా మేష ధీరోత్తమై స్సర్వదా
సర్వవాంఛాద వారాహ పద్మాకర:.

స్రగ్విణీవృత్తము - వరదరాజస్వామివిషయము.

హస్తిశైలోత్తమే ధాతృసంప్రార్థితః
యః ప్రసన్నః ప్రజా స్సంరరక్ష స్వయం,
దేవరాజం హరిం దేవదేవోత్తమం
నౌమి తం సర్వవాంఛాపరిస్ఫూర్తయే.

సీసపద్యము-రాజా నారయ్యప్పారావు బహద్దరు విషయము.

గౌతమీ కృష్ణాంతరీత మహీరాజ
　　హీరాజవాహన మిద్ధకీర్తి
సకలవనీపక సందేహకల్పాగ
　　కల్పాగమోత్త సత్కార్మశూర
సర్వశాస్త్ర విచార చతురధీరాధార
　　రాధారమణ్యధినాథభక్త

వానాద్రి యతికృపా భవపంచసంస్కార
సంస్కారవిషయ తచ్ఛాస్త్రపార
జయ జయాభిధ ప్రకటవాత్సల్యశౌర్య
వీర్యగాంభీర్య ఘనధైర్య విమతలోక
శిక్షణధురీణతా శ్రితారక్షణాది
సరసగుణసాంద్ర వారయజ్వమహేంద్ర.

వసంతతిలకావృత్తము–దేవీ విషయము.

యా రక్తబీజసురవైరిణ మర్త్యభేద్య
మాస్తీర్య సర్వభువి విస్తృతదీప్తిజిహ్వాం,
తద్దేహశోణిత ప్రవల్లవయుక్తభావం
సమ్యగ్గ్రహేణ భజతామర మాదిదేవీం.

కందపద్యము–రామానుజ విషయము.

శ్రీమత్కూరమనాయక
భూమాజ్ఞావశత వచ్చి భూమికి సుకృతి
స్తోమముల కెల్ల బ్రోచిన
రామానుజదేశికుల కరంబు దలంతున్.

మందాక్రాంతావృత్తము–కోటాయి మంటపవర్ణన.

దివ్యైశ్శిల్పైర్విరచితనిగమాం
భోధిపారంగతైస్తైః
సంపూర్ణోయస్సకలసుకలా
రాజితైర్వర్ణనాగ్రైః,
రాజంతం తం బహువిధ సం
యుక్త సన్మంటపం తం
పశ్యామ్యత్రా గిరిపలిపురే
రమ్యభోగైస్సమేతం.

శిఖరిణీవృత్తము–శ్రీరంగనాయక విషయము.

ఉదారం గేయస్వ
గ్భుతిభగితి కిరాతికల్మషం
సదారంగే సంతం
సుమతిదయాసాగర మముం,
నిదానం లోకానాం
నిరవధిక కల్యాణగుణసం
ప్రదాయం ధ్యాయం తం
సతతముప సేవ్యామి దినసాన్.

సుగంధీవృత్తము–నమ్మాళ్వార్ల విషయము.

శ్రీనికేతనాన్వయస్తు సేననాపరాఙ్ముఖున్
మాననీయసత్ప్రవృత్తి మార్గమార్గదర్శిని
ద్యానిధిన్ మహార్హ మాసిత ప్రబంధరత్న సం
ధాన శీలుడైన కారిసంభవున్ భజించెదన్.

సీసపద్యము–రాజా వెంకటరామయ్య అప్పారావు బహద్దర్ గారి విషయము.

శ్రీమన్మహారాజ శ్రితదేవతాపూజ
విపులయశోరాజ నృపతనూజ
ఘనవైభవబిడౌజ ఖండితారిసమాజ
సకలవిద్యాభోజ జయపృథాజ
కవిబంధరసరోజ కార్తికేయసహౌజ
దీనదయావ్యాజ ధీజితాజ
ధైర్యభూధరరాజ దానాలకారాజ
భామాజనమనోజ భానుతేజ
అనఘ వానాద్రి యోగిరాట్ ఘనకృపావి
శేషవిజ్ఞాత వేదాంత సిద్ధతత్త్వ
సారసర్వస్వ నిర్మలసాత్త్వికగుణ
సాంద్ర వెంకట రామరసామరేంద్ర.

మత్తేభవృత్తము–వేదాంత దేశిక విషయము.

నిగమాంతాఖ్య సమస్త మంగళకరో
న్నిద్రప్రథాశ్చాఖ్య శ్రీ
భగవత్ ఘంటికవక్త్రి మంత్రమనన
ప్రాప్తప్రభావోదయున్
ఖరాట్ భవ్యానహాగతాఖిల
కళాకౌశల్య మీమాంసకున్

---

తగ సేవింతు ననంతవాంఛిత సుసం
ధానం బొనర్పం గడున్.

సీసము - శ్రీ రాజా వెంకటమహీపతి గంగాధర రామారావు గారి విషయము.

శ్రీమన్మహారాజ శ్రితజనసుందార
మందారతా తీవ్రమానసాబ్జ
సద్భోగనిర్జితోచ్చైశ్శ్రవోబాహాట
బాహాటబిగానసంభావ్యమాన
మహనీయకోటి సమగ్రథసుందరాకార
రాకారమాసోదరాయితాస్య
శ్రీశైలగాట్ కృపార్జిత శింఖన్క్రాంక
చక్రాంకపాద సంసక్తచిత్త
సురుచిరానంత కల్యాణ సుగుణసాంద్ర
సత్యవాక్యప్రభాహరిశ్చంద్ర భవ్య
రావువంశ సుధాంబోధి రాజచంద్ర
రామరాయేంద్ర వసుమతీ రాణ్మహేంద్ర.

కందము - శ్రీరామ పట్టాభిషేక విషయము.

సకలమునిసేవితంబై
ప్రకటమృదంగాదినాద పరిశోభితమై
సుకరమయి యొప్పె రాముని
సుకలిత పట్టాభిషేక సుముహూర్త మొగిన్.

ఇంద్రవజ్రవృత్తము - కూర్మావతారవిషయము.

పద్మాసమానస్య ధరాతలస్య
శాలాయతి స్వామిహిపతి శ్చ తస్య,
కందాయమానం కమఠాధిరాజం
ధ్యాయామి నిత్యం పరమార్థసృష్ట్యా.

శార్దూలవృత్తము - త్రిపురసుందరీ విషయము.

దేవర్షిసమూహధారణచణో
ద్దీప్తాగ్రశౌర్యాంచితన్
గ్రావాధీశతనూద్భవన్ శశిధరా
ర్ధాంగోల్లసత్స్వాకృతిన్
దేవాధీశముఖామరప్రణుత వ
ర్తిష్ణు ప్రతాపానమున్
ధావద్దైత్యభయప్రదన్ త్రిపురసుం
దర్యాహ్వయన్ గొల్వుమీ.

సీసపద్యము - రాజా వెంకట మహీపతి గంగాధర రామారావు బహద్దరు గారి విషయము.

శ్రీమదాదిమదేవ సేవాపరధ్యాన
ధ్యానవ విజితాజహారిణలక్ష్మ
లక్ష్మణాగ్రిమ గర్వసర్వస్వహృన్నిజశౌర్య
శౌర్యమేరు ప్రజ్ఞ చారుమూర్తి
మూర్తిభవన్మహామోద సమాచార
చారుతాతీతప్రవ్రవిసంసితారి
తారితాఖిలలోక నాశిక్ష్యవైభవ
భవసమానైశ్వర్య భోజ్యమాన
మానవాధీశ సంతత మాననీయ
భోజరాజకళాజాల పూజనీయ
రావు వంశపయోంబుధి రాజచంద్ర
రామరాయేంద్ర వసుమతీ రాణ్మహేంద్ర.

మాలినీవృత్తము - వీరాంజనేయవర్ణనము.

సకలదివిజలోక స్తోమనిష్ఠాత్మమూర్తిన్
ప్రకటసమగ్రశౌర్య ప్రాభవోద్భాసమానున్
సుకరగుణ కలాపున్ శుద్ధవిజ్ఞానదీపున్
వికట రిపుహరున్ సేవింతు వీరాంజనేయున్.

గీతము - కాళింగమర్దన విషయము.

ఒకట హరికన్యలుండి కుయ్యో యనంగ
తటమునందున బంధువుల్ తల్లడిల్లగ
కాళియఫణాగ్ర నాట్యరంగమున నటన
రసికుడై నట్టి గోపాలరాజు గొలుతు.

సీసపద్యము - రాజా నారయ్యప్పారావు బహద్దరు వారి విషయము.

ధీరుడై, సద్గుణాధారుడై, సుకృతిమం
దారుడై, జగదేకవీరుడగుచు
గేయుడై, బలకార్తికేయుడై, కృతిభాగ
ధేయుడై, ప్రథితప్రమేయుడగుచు
దానియై, సుకవిసన్మానియై, కుశలసం
ధానియై, సుమతి ప్రధానియగుచు
మాన్యుడై, నృపలోకగణ్యుడై, విదిత సౌ
జన్యుడై, దానపర్జన్యుడగుచు

గీ. సకలరాజాధిరాజ రాజన్యలోక
పూజనీయచరిత్ర విస్ఫూర్తిగలిగి
యాశ్రితుల బ్రోచునట్టి నారయ్యభూప
చక్రవర్తికి జగతిలో సాటిగలరె.

శాలినీవృత్తము - సరస్వతీ విషయము.

వందే వాణీం వల్లకీయుక్తపాణిం
సూరివ్రాతప్రస్తుత స్వోద్గుణాళీం,
సాంద్రోదార స్ఫూర్తివిభ్రాంతి యుక్తాం
కుందాభ్రస్థాం వర్ణ్యచారిత్ర యుక్తాం.

రథోద్ధతావృత్తము-నృసింహ విషయము.

హాటకాసుర విభేదనాయ య
స్తంభతో ద్భవత తారలీలయా,
తం నృసింహవిభు మిందిరాయుతం
నౌమి సర్వవిభవాంచితాప్తయే.

మహాస్రగ్ధరావృత్తము-రాజా వెంకటాద్రి అప్పారావు బహదరుగారి విషయము.

ప్రతిశాస్త్రప్రత్యహోద్గా
ఢన సమధిగతాపార తత్త్వారుడై య
ట్లతులాలంకార కావ్యా
ధ్యయన పరిచయప్రాప్త సాలస్యుడై యా
శ్రితరక్షాసంవిధానాం
చితమతియుతుడై శ్రీశసేవారతాత్మ
స్థితియై శ్రీ వేంకటాద్రి
క్షితిపతి దనరున్ సిద్ధవిజ్ఞాన పూర్తిన్.

ద్విపంధాగ్రాహిత్వము చేసి పఠించిన సీసపద్యము.
ఈ పద్యము రంగారాయచరిత్రలోనిది.)

శ్రుతగుణశ్రోణిభృత్ క్షితిమండలోచిత
ప్రాజ్యరాజ్య రమాధురంధరుండు
దానధారాధౌత ధరణీ సుపర్వాను
సారి దారిద్ర్య నిషద్వగుండు
సంగీత సాహిత్య సరసవిద్యారస
రసికతామహిత సారస్వతుండు
సామంతభూపాల సంప్రేషిత ద్విప
దాన కర్దమిత సద్మాజిగండు
పద్మబాయక కుముదినీ బాంధవుండు
దర్పితారాతి రాజన్య దర్పమథన
రాజితాటోప కేళి మ్రాలాజువంశ
పద్మవనహేళి రామభూపాలమౌళి.

ఇందులో నున్న యర్థము వచ్చునట్టుగా రాజా మ్రాలాజు కొండరావు బహదరుగారి విషయముగా చెప్పిన స్రగ్ధరావృత్తము.

ధాత్రీభారోద్వహః క్ష్మా
సుర వినవగుణోద్ధూననోదాన లక్ష్మ్యై
సంగీతోత్సాహితీ సు
ప్రథితరసికతా సిద్ధసారస్వతోయం,
సామంత ప్రేషితేభ
వ్రజమద సలిలార్ద్రాంగణో వైరిహారీ
శ్రీ కొండ్రలాయ భూపో
జయతు గుడకృత్స్నిమ్న మల్రాజవంశః.

అభూతోపమాలంకారము-శ్రీ రాజా నారయ్యప్పారావుగారి విషయము.

శ్రీమద్దానదయాది సద్గుణకళీ
సీమాయమానుండు ప్రో
ద్దామ స్థేమవిరాజమానుడు మహో
దృత్కీర్తి విభ్రాజితుం
డై మేలొందుచునుండు నారయమహీం
ద్రాఖండలుం డొప్పులో
కామేయప్రభుతధ్యుడై పరివులో
దృత్సత్సుకర్ణోపమన్.

పై యవధాన విశేషములు క్రీ. శ. 1878 వ సంవత్సరము జూను నెలలో యనమపల వేంకటాచార్యులవారి వివేకకళానిధి ముద్రాక్షరశాలయందు ముద్రింపబడిన గ్రంథము ండిగై కొంటిని కీర్తిశేషులగు మా నాయనగారు శ్రీ నిడుదవోలు సుందరము పంతులుగారు వేంకటాచార్యులవారిని స్వయముగా నెఱుగుదురు. వారు భద్రపఱచిన పూర్వ ముద్రితగ్రంథములో నిదియొకటి. ఆ ప్రతియు మిక్కిలి ప్రాతదియగుట చేతను, ఇందలి విషయము లీవఱకు లోకమునకు వెల్లడి కాకపోవుటచేతను, నీ వ్యాసమూలమున ప్రకటించితిని.

కడచిన శతాబ్దిని జీవించిన కవిపండితుల కృతులే ముద్రితములైనను-కొన్ని మనకు లభ్యము కాకుండుట చేత, వారి సమగ్రజీవిత చరిత్రముల నెఱుంగుట కవకాశము లేకున్నది. మనకాలమునాటి కవిపండితుల చరిత్రలనే, సాధనసామగ్రియున్నను, మనము సేకరింపలేనప్పుడిక ప్రాచీనాంధ్రకవుల జీవితచరిత్రలసమగ్రములుగాను, వివాదాంశముల తోడను నిండియున్నవన్నచో నాశ్చర్య మేమున్నది. క్రీ. శ. పందొమ్మిదవశతాబ్దినాటి కవిపండితు లింక నెందఱో చరిత్ర కెక్కదగినవారున్నారు. వారికృతులును ముద్రితమైయున్నవి. అట్టివానినిగూర్చి పరిశ్రమచేయ నీ వ్యాసము దోహదము చేసిన నా శ్రమ సార్థకమగును.

# ఌకారదీర్ఘం

శ్రీ శ్రీనివాస సోదరులు

పూర్వాన్ యథాఽపిశల్యాద్యా
చార్యాన్ సస్మార పాణినిః,
తథాఽద్యావధికాన్ సర్వాన్
స్మరామః శబ్దపారగాన్.

మిత్రులు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు 1959 ఏప్రిల్ భారతిలో లక్షణసారసంగ్రహాన్ని గూర్చి వ్రాస్తూ "సంస్కృత వైయాకరణులు ౡకారము నంగీకరింపరు" అని వ్రాశారు. "సంస్కృత వైయాకరణులు ౡకారము నంగీకరింపరు" అంటే మొత్తం సంస్కృత వైయాకరణులంతా అంగీకరించరని అపోహ కలుగుతున్నది. సంస్కృతంలో ప్రాతిశాఖ్యాలనుంచి మొదలుపెట్టుకొని పెక్కు వ్యాకరణశాస్త్రాలు పుట్టాయి. దేనికది తన కాలానికి ప్రచలితంగా వున్న భాషను వ్యాకరించి గొప్ప ప్రతిభతో శాస్త్రమర్యాద నందుకున్నది. ఒక్కొక్క ఆచార్యుడు విశాలదృక్పథంతో భాషను తరిచిచూసి ప్రయోగసామగ్రిని నిరూపించాడు. ఇంద్రుడు, ఆపిశలి, శాకటాయనుడు, కాశకృత్స్నుడు, పాణిని, కాత్యాయనుడు, పతంజలి, శర్వవర్మ, చంద్రుడు, పూజ్యపాదుడు, భోజుడు, హేమచంద్రుడు మొదలైన మహావ్యాకర్తలు గొప్ప భాషాసేవ చేశారు. ప్రాతిశాఖ్యాలు వ్రాసిన శౌనకాది మహర్షుల సంగతీ, వాటికి భాష్యాలు వ్రాసిన ఉవ్వటాద్యాచార్యుల సంగతీ మరవరానివి. ఇంతమందీ, ఇంకా మిగిలిన వ్యాకర్తలూ—అందరూ ఌకారదీర్ఘం అంగీకరించలేదా అంటే కాదని సమాధానం.

పాణినీయ సంప్రదాయావలంబిగ్రంథాలు తప్ప తక్కినవన్నీ ప్రాతిశాఖ్యాలనుంచి ప్రయోగరత్నమాల వరకూ ౡకారాన్ని గ్రహించినవే. మన తెనుగులాక్షణికులు చాలామంది హేమచంద్రుణ్ణి పేర్కొన్నవారు గనుక అతని ననుసరించే ౡకారం గ్రహించారని తోస్తున్నది.

పాణిని ఌకారదీర్ఘం ఉందనికాని లేదనికాని చెప్పలేదు. ఐతే ఋ ఌ వర్ణాలకు సవర్ణవిధి చెప్పకుండా "అకః సవర్ణే దీర్ఘః" పా. (6-1-101) అని సూత్రించటాన్ని బట్టి పాణినికి ఌకారదీర్ఘం సమ్మతమేనని ఊహించటానికి అవకాశమున్నదనిపిస్తున్నది.

కాత్యాయనుడు "ఋకార ఌకారయోః సవర్ణవిధిః" అని వార్తికం పఠించాడు. ఇక్కడ పతంజలి "ఋకార ఌకారయోః సవర్ణసంజ్ఞా విధేయా. హోతృ ఌకారః హోతౄకారః. కిమ్ ప్రయోజనమ్? 'అకః సవర్ణే దీర్ఘః' ఇతి దీర్ఘత్వం యథా స్యాత్" అని భాషించాడు.1 ఌకారానికి దీర్ఘత్వం లేనందున 'హోతృ ఌకారః' అనేచోట హోతౄకారః అనే రూపం 'అకః సవర్ణే దీర్ఘః' అనే సూత్రంచేత సిద్ధింపజేయటానికి ఈ వార్తికం ప్రవర్తింపజేయబడిందని చెప్పాడు. ఇకే తత్సంప్రదాయజ్ఞు లంతా అనువదించుకొంటూ వచ్చారు. "ఌకారస్య దీర్ఘా న సంతి, తం ద్వాదశప్రభేదమాచక్షతే" - కాశిక. "ఌవర్ణస్య ద్వాదశ. తస్య దీర్ఘాభావాత్" సిద్ధాంతకౌముది. ఇక్కడ నారాయణభటు ప్రక్రియాసర్వస్వంలో "ఌవర్ణస్య లిపిపాఠాదన్యత్ర దీర్ఘాప్రయోగాత్, ఏచాం చ హ్రస్వాభావాత్ తే పంచాపి ద్వాదశధైవ" అని వ్రాశాడు. వర్ణమాలలోను, వ్రాతలోనూ ౡకారం వున్నా ప్రయోగం లేనందువల్ల ఌకారంకూడా పన్నెండు విధాలే నన్నాడు. అంటే ౡకారం వర్ణసమామ్నాయంలో పూర్వంనించి ఉన్నదని అంగీకరించాడు.

అసలు వార్తికకారుడి అభిప్రాయం ఌకారోపదేశమే అక్కరలేదని. భాష్యకారుడీ అభిప్రాయాన్ని ఖండించి ఌకారోపదేశం అవసరమని నిరూపించాడు. ఆయన చూపిన కారణాలు: 1. యదృచ్ఛా శబ్దాలైన ఌతకాదుల ప్రయోగంలో యణాదేశాద్యచ్కార్యాలు జరగటం అవసరం. 2. ఋతకశబ్దాన్ని అశక్తివల్ల ఌతకశబ్దంగా ఉచ్చరించగా దాన్ని చెప్పేటప్పుడు "కుమార్య్ ఌతక ఇత్యువాచ" అని యణాదేశాద్యచ్కార్యాలు రావటం అవసరం. 3. ప్లుతిద్విర్వచన

1 "వివృతస్య ఌకారస్య దీర్ఘస్యాభావాత్ ఋకారో దీర్ఘ ఉదాహృత ఇతి బోధ్యమ్."— ఉద్యోతము.

స్వరితాలు కౢపి ధాతువుకు సంభవింపజేసి "కౢప్త శిఖ[2] కౢప్త[3], ప్రకౢప్త[4]" రూపాలను సాధించవలసి వుంటుంది. ఐతే జైనశాకటాయనుడు వార్తికకర్త ననుసరించి "ఋఌక్" అనే ప్రత్యాహారసూత్రాన్ని "ఋక్" అని సంస్కరించి తన వ్యాకరణంలో చెప్పాడు.

పైని భాష్యకారుడు చెప్పిన కారణాలను బట్టి ఌకారోపదేశం ఎలా అవసరమో, ౡకారగ్రహణం కూడా అలాగే అవసరమౌతున్నది. జైనేంద్ర వ్యాకరణంలో పూజ్యపాదుడు "కథం ఌకారో ద్విమాత్రః?" అని ప్రశ్నించి "అశక్తిజానుకరణాపేక్షయా" అని సమాధానం చెప్పాడు.

ఇంతే కాక ౡకార గ్రహణాని కింకొక కారణం కూడా చూపవచ్చు. ధాతుపాఠంలో గమౢ మొదలైన కొన్ని ధాతువులు ఌదిత్తులుగా చెప్పబడి వున్నాయి. ప్రయోగ ప్రసంగంలో "గమౢ ఌకారం సాన్వధీతే" అని చెప్పాల్సివచ్చినప్పుడు సవర్ణదీర్ఘ విధిచేత "గమౡకారం సాన్వధీతే" అని చెప్పటం సహజం కాని, ఋఌవర్ణ సావర్ణ్యం గ్రహించి, లిపిపాఠాల్లో చిరకాలంనుంచి వస్తున్న ౡకారాన్ని వర్జించి "గమ్లౄకారం సాన్వధీతే" అనే రూపం తెచ్చిపెట్టుకోటం హృదయంగమం కాదు. పైగా భ్రాంతికి కారణంకూడా అవుతుంది.

ఋఌవర్ణ సవర్ణ విధిచేత "హోతృ + ఌకారః" అన్నప్పుడు "హోతౄకారః" అని చెప్పినట్లే "హోతౡకారః" అని చెప్పటంలో తాము తెచ్చిపెట్టుకున్న ఌకారదీర్ఘం లేదనే సిద్ధాంతం తప్పితే బాధకమేముంది?

పాణినీయులు ఒక్క హ్రస్వఌకారం మాత్రమే ఒప్పుకొనివుంటే బాగుండేది. కాని ఌకారప్లుతం కూడా ఒప్పుకున్నారు. ప్లుతమంటే దీర్ఘంమీద పొడిగింపే కాని వేరు కాదు. దీర్ఘం లేని ప్లుత మెక్కడిది?

ఒక అక్షరం బహుళప్రయోగ విషయం కాకపోయినా ప్రయోగించటానికి అవసరమైనప్పుడు తద్రూపసాధనకు మార్గం చూపటం వ్యాకరణకర్తవ్యమౌతుంది. ఏకాక్షరకోశాల్లో ౡకారానికి 'వారాహి' మొదలైన దేవీనామాలు అర్థాలుగా ఈయబడినాయి. మంత్రశాస్త్రం ప్రకారం మాతృకార్చనలో ౡకారం అవసరమౌతుంది. యంత్రాలలో అష్టదళ షోడశదళాల్లో విన్యసించబడే మాతృకల్లో ౡకారంకూడా ఉంటుంది.

ప్రాతిశాఖ్యాలకు పూర్వకాలం నుంచీ కూడా దేశంలో వర్ణసమామ్నాయం వాడుకలో ఉండేది. ప్రాతిశాఖ్యాలనిబట్టి చూస్తే రెండు రకాల వర్ణమాల అమల్లో ఉండేదనిపిస్తుంది. ఋక్ప్రాతిశాఖ్యాన్ని బట్టి స్వరాల వరుస "అ ఆ ఋ ౠ ఇ ఈ ఉ ఊ ఌ ౡ ఎ ఓ ఐ ఔ" అనిన్నీ, యజుర్వేద ప్రాతిశాఖ్యాన్ని బట్టి "అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ" అనిన్నీ వున్నట్టు గోచరిస్తుంది. ఋక్ప్రాతిశాఖ్యంలో "హ శ ష సాః" అని హకారం శ ష స లకు ముందున్నది. యజుః ప్రాతిశాఖ్యాన్ని బట్టి హకారం చివరికి ఉంది. అయితే ఈ వ్యతిక్రమం ఋక్ప్రాతిశాఖ్యాన్ని బట్టేకాని వాడుకలో అనాటికీ వున్న వర్ణమాతృకం "అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ" ఇత్యాదిగానే వుండేదని ఉవ్వటాచార్యుల యీ క్రింది భాష్యపంక్తులవల్ల తెలుస్తున్నది. "నను లౌకికో ఽత్ర వర్ణసమామ్నాయో గృహ్యతే. ఏవం తర్హి తయానుపూర్వ్యా భవితవ్యం. తత్ర ఊకారాత్పరౌ ఋ ౠ కారౌ సమామనంతి– ఉ ఊ ఋ ౠ ఇతి. తథా ఐకారాత్పూర్వ మేకార మౌకారాత్పూర్వ మోకారం ఏ ఐ ఓ ఔ ఇతి. సహకారాత్పరం హకారం సమామనంతి–శ ష స హ ఇతి." (ఓయీ! లౌకికమైన వర్ణసమామ్నాయమే గ్రహించినట్లయితే అదే వరుసలో యథాతథంగా గ్రహించాలి. అందులో ఊకారం తరువాత ఋ ౠలు చెబుతున్నారు – ఉ ఊ ఋ ౠ అని. అలాగే ఐకారానికి పూర్వం ఏకారమూ ఔకారానికిముందు ఓకారమూ చెబుతున్నారు — ఏ ఐ ఓ ఔ అని. సకారం తరువాత హకారం ఉపదేశిస్తున్నారు— శ ష స హ అని.")

మొత్తాన ప్రాతిశాఖ్యాల్లో ౡకార దీర్ఘం చెప్పబడింది. "అకారర్కారా వి ఉ ఏ ఓ ఐ ఔ, పదా

2. "పుగో గన్తృతో ఽనంత్యస్యాప్యేకైకస్య ప్రాచామ్" పా. 8-2-86.

3. "అవచి చ" పా. 8-4-47.

4. "గతిరనన్తరః" పా. 6-2-49 అనే సూత్రం చేత 'ప్ర' ఉదాత్తమై శిష్టమునకు అనుదాత్తత్వం రాగా "ఉదాత్తాదనుదాత్తస్య స్వరితః" పా. 8-4-66 అనే సూత్రంచేత కౢ లోని ఌకారం స్వరితమౌతుంది.

ద్వ్యంతయో ర్నౄ ఌకారః స్వరేషు, ఆకారాదీన్ దీర్ఘ రూపాన్ ద్వితీయాన్, హ్రస్వేషు పంచస్వపి తాని సన్తి-" (ఋక్ప్రాతిశాఖ్యం - వర్గద్వయ వృత్తి.) ఇందులో ఐదు హ్రస్వములు - అ ఇ ఉ ఋ ఌ. పంచ స్వపి హ్రస్వేషు = ఐదు హ్రస్వముల యందునూ, తాని=దీర్ఘాణి=దీర్ఘములు, సంతి = ఉన్నవి. యజుః ప్రాతిశాఖ్యంలో "ద్విస్తావాన్ దీర్ఘః" (1 అ. 57. సూ) అనే సూత్రంక్రింద ఉవ్వటాచార్యుడు "హ్రస్వ ద్విగుణకాలో వర్ణో దీర్ఘసంజ్ఞో భవతి. యథా ఆ ఈ ఊ ౠ ౡ ఏ ఐ ఓ ఔ ఇతి" అని వివరించాడు. "ఌలసితాదంతే" (1 అ. 69 సూ.) అనే సూత్రం క్రింద "ఌ ౡ ౡ3 ఏతే త్రయః లకారః సకార స్తద్గ ఇత్యేతే దశవర్ణావంత్యాః" అని వివరించాడు.

కాశకృత్స్నుడు తన ధాతుపాఠంలో "ౡఙ్ — శబ్దే" అని ఒక ధాతువు పఠించాడు. దానిమీద "అలతే. అలకః. అలమానః, ౡః, అలనమ్, అలనీయమ్" అనే రూపాలు ప్రయోగంలోకి వచ్చాయి (చూ. కాశకృత్స్న శబ్దకలాపధాతుపాఠః, పుట. 126)

కాతంత్ర వ్యాకరణంలో దశ సమానాః" 1-1-3) అనే సూత్రం ఉంది. "తస్మిన్ వర్ణ సమామ్నాయవిషయే ఆదౌ యే దశ వర్ణాః తే సమానసంజ్ఞా భవంతి. అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ. సమాన ప్రదేశాః—సమాన స్సవర్ణే దీర్ఘీ భవతి పరశ్చ లోపమ్. (కా. 1-2 1) ఇత్యేవమాదయః" అని దుర్గాచార్యుని వివరణ. సమానము లంటే "సమానం తుల్యం మానం పరిమాణ మేషామితి సమానాః" అని దుర్గటీక. ఆ సమానమైన పరిమాణ మేమిటంటే "ఉదాత్తానుదాత్త సమాహారం సానునాసిక నిరనునాసిక భేదా దష్టాదశధా భిద్యతే అవర్ణః. తథా ఇవర్ణాదయోఽపి" అని వివరించాడు. అంటే అకారం హ్రస్వ దీర్ఘ ప్లుతాలై, ఒక్కొక్కటి ఉదాత్తానుదాత్త సమాహారాలై, మళ్ళీ ఆ ఒక్కొక్కటి సానునాసిక నిరనునాసికాలై మొత్తం పద్దెనిమిది విధాలైంది. ఈవిధంగా ఇకారాదు లున్నై. వాటిలో ఌకారంకూడా ఉంది.

హేమచంద్రాచార్యుడు "ౡదంతాః సమానాః" అని స్పష్టంగా సూత్రం చెప్పాడు. అంతేకాక "హోతృ + ఌకారః = హోతౄకారః, హోతౢకారః5" అనికూడా రూపసాధన చూపించాడు.

సారస్వతంలో "అ ఇ ఉ ఋ ఌ సమానాః" అనే సూత్రంవుంది. "సవర్ణే దీర్ఘః సహ" (సూ. 52) అనేసూత్రంక్రింద "హోతౄకారః, హోతౢకారః" అని రెండు ఉదాహరణలూ వ్యాఖ్యాతలంతా ఇచ్చారు. ఐతే ఇటీవల వ్యాఖ్య వ్రాసిన నవకిశోరశర్మ పాణినీయ ప్రభావితుడై "ఌవర్ణస్య ద్వాదశ. తస్య దీర్ఘో నాస్తి" (సంక్షిప్త బాలబోధినీ వ్యాఖ్య పుట 2.) అని వ్రాశాడు. ఏ సిద్ధాంతా న్ననుసరించిన గ్రంథానికి తాను వ్యాఖ్య వ్రాస్తున్నాడో ఆ సిద్ధాంతాన్నే వ్యాఖ్యాత వివరించాలి గాని తద్భిన్నసిద్ధాంతాలను అది చెప్పినట్టు చూపించటం ఉచితంకాదు. తెరిచి చూడకుండా అదే చదివేవారిని అపమార్గం పట్టించిన ట్టవుతుంది. తన అభిప్రాయభేద ముందని తెలిపితే సబబే.

ముగ్ధబోధకర్త బోపదేవుడు "ౡత్రయం త థ ద ధ న ల సా వో దన్త్యాః" అని వ్రాశాడు. ౡత్రయమంటే ఌకారం, ఌకారదీర్ఘం, ఌకారప్లుతమూను.

ఈ విధంగా పాణినీయానుయాయులు తప్ప తక్కిన వ్యాకర్తలంతా ఌకారదీర్ఘం అంగీకరించారు. పాణినీయానుయాయుల్లోగూడా శబ్దేందుశేఖరకారుడు "దీర్ఘత్వేఽపి న క్షతిః" అన్నాడు. అలాగే శ్రీ దయానందసరస్వతి వేదాంగ ప్రకాశం వర్ణోచ్చారణశిక్షలో "యద్యప్యాశబ్దే అశక్తి ర్జానుకరణే వా యదా దీర్ఘః స్యు స్తదా ష్టాదశభేదం ప్రబతే ౡకపక ఇతి' అని వ్రాశాడు.

పాణినీయం అంగీకరించకపోతే అది అప్రయోగమే అనుకోటం సమంజసంకాదు. పాణిని చెప్పిన 6 ఆత్మంభరికి చంద్రుడు 7 కుక్షింభరిని కలుపలేదా? కాశికాకారుడు ఉదరంభరినికూడా కలిపి సూత్రంలో "ఆత్మంభరి శ్చ" అనే చోట చకారం అనుక్తసముచ్చాయకం అని సమర్థించుకోలేదా? పాణినీయం సాధించని ప్రయోగాలెన్నో ఇతర వ్యాకరణాలు సాధించాయి. పాణినీయం ప్రకారమే అయితే "సఖినా వానరేంద్రేణ", "పతినా నీయమానాయాః పురశ్చన్ద్రో న నుష్యతి",

5 "ఌత ౠౢ ఋౢభ్యాం వా"— హైమ శబ్దానుశాసనం 1-2 3.

6 ఫలేగ్రహి రాత్మంభరి శ్చ. పా. (3-2-26).

7 ఫలేగ్రహి రాత్మంభరిః కుక్షింభరిః. చాం. (1-2-10).

"సీతాయాః పతయే నమః",8 "నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ" అనేవాటిలో సఖి పతి శబ్ద రూపాలు సాధించబడుతాయా? "శేషో ఘ్యసఖి" (పా. 1-4-7), "పతిః సమాస ఏవ" (పా. 1-4-8) అనే సూత్రాల కివి లొంగుతాయా? "అన్యేషామపి దృశ్యతే" (పా. 6-3-137) 9 అనే సూత్రానికి "ముష్టాముష్టి" లొంగుతుందా? దాన్ని చంద్రుడు "ఇచి" (చాం. 5-2-48) అనే సూత్రంతో సాధించలేదా? ఇలాగే అనేకప్రయోగాలను సాధిస్తూ పాణినీయంమీద ప్రక్రియా సర్వస్వం రచించిన నారాయణ భట్టు "అపాణినీయప్రామాణ్యం" అనే ఉత్తమగ్రంథం కూడా వ్రాశాడు. కనుక పాణినీయం కాదన్నంత మాత్రంచేత తప్పే అనుకోటం శబ్దశాస్త్రవికాసం దృష్ట్యా సబబు కాదు.

ఇలా అంటే పాణినీయాన్ని, పాణిని అనుయాయులనూ తృణీకరించటం కాదు. పాణినీయుల భాషాసేవ నిరుపమానమైనది. కాని పాణిని కాత్యాయన పతంజలులతో భాష ఆగిపోలేదు. తరువాత బహుకాలం సంస్కృతం జనవ్యవహారంలో ఉంది. ప్రవాహినిరైన భాషలో ఎన్నో మార్పులు రావటం సహజం. ప్రచలితభాష విషయంలో ఒక కాలానికి ఒక గీత గీచి ఈగీతకు ముందున్న ప్రయోగాలు రైటు, తరువాతవన్నీ తప్పులు అనటానికి ఎవరికీ అధికారం లేదు. వ్యాకర్తలు తమ తమ కాలంలో వాడుకలో వున్న ప్రయోగాలకు సాధన చూపుతారు. ఉదాహరణకి పైని పేర్కొన్న "సఖినా, పతినా, పతౌ" ఇత్యాది రూపాలను సారస్వత10 - ముగ్ధబోధ11 - ఆశుబోధాది12 వ్యాకరణాలు సాధించాయి.

కనుక వ్యాకరణశాస్త్రాధ్యేతలకు ప్రయోగవిజ్ఞాన బాహుళ్యంకోసం అన్ని వ్యాకరణాలూ చదవాల్సిన అవసర ముంది. చదివేవారికి ఒక్కొక్క గ్రంథంలో - ఎంత అల్పగ్రంథమైనా — కొన్ని కొన్ని విశేషాలు కనుపడుతాయి. వాటి నన్నిటినీ సహృదయత్వంతో గ్రహించాలి. ఇందువల్లనే కనీసం వ్యాకరణ శిరోమణి, వ్యాకరణ విద్యాప్రవీణ పరీక్షలకైనా పాణినీయేతర వ్యాకరణాలుకూడా పాఠ్యాంశాల్లో చేర్చటం ఉచితమని లోగడ ఒక వ్యాసంలో విశ్వవిద్యాలయాలవారికి సూచించాము. మళ్ళీ ఇక్కడ అదే అభ్యర్థన చేస్తున్నాము.

---

8 షష్ఠీయుక్తశ్ఛందసి వా. (ప్రా. 1-4 9.) అనే సూత్రం లౌకిక ప్రయోగాలకి వర్తించదు. "ఛందసీతి కిమ్? గ్రామస్య పత్యే"—కాశిక.

9 ఇచి కర్మవ్యతిహారే బహువ్రీహౌ పూర్వ పదాంతస్య దీర్ఘః—ముష్టీ ముష్టి. — సి. కౌముది.

10. చూ. సార. సూ. 204. "ఆగమజమనిత్యం."

11. "క్వచిదపవాదవిషయే ఽప్యుత్సర్గో ఽభినివిశతే ఇత్యుక్తేః సఖినా వానరేంద్రేణేతి" ముగ్ధబోధం-రామ తర్కవాగీశ వ్యాఖ్య. పు. 135. "పత్యురసే" సూత్రం క్రింద.

12. "కింతు తృతీయాదౌ క్వచిద్ ఘిత్వమిచ్ఛంతి" సూ. 192 వ్యాఖ్య.

# సాహితీ సుగతుని స్వగతం

ఆదిమానవుని మృత్యుభయం, అమరత్వవాంఛ వెర్రితలలు వేశాయని 'విజ్ఞానం' వెన్నుతన్నిన నేటి మేధాజీవులు కొందరు విడ్డూరాలు పలుకవచ్చు. కాని, ఈభయం, ఈవాంఛ నేల నాలుగు చెరగులా సంస్కృతి వైవిధ్యానికి నారులుపోయడం మరువరానిమాట. ఇవే సంప్రదాయంగా, శాస్త్రంగా, కళలుగా, సాహిత్యంగా శాఖోపశాఖలై సాక్షాత్కరించాయి. భయం, అద్భుతం మేళవించిన భావుకతతో ఈ విశ్వమంతా అవాఙ్మానసగోచరుడైన విరాణ్మూర్తిసుస్వరూపంగా భావించడం, మనఃపదార్థాన్ని మదింపు వేసిన తర్వాత దానిని ఆకసంలో తేలాడే చలువలరాజుతో పోల్చి, 'చంద్రమా మనసో జాతః' అని కవిత అల్లడం ఎంతటి భావనాపటిమ! సశరీరంగా శాశ్వత లోకావాసం సంభవం కాదని నిరాశపడినా, ఏదోరీతిగా సప్తసంతానాలలో వన్నాతను నిలచి ఉండదలచడం ఎంతటి సంకల్పసిద్ధి? అదే అమరత్వవాంఛ. జిజీవిష. అత్యంత ప్రాచీనకాలం నుంచి సంస్కృతి సౌరభాలు, విజ్ఞాన దీధితులు విరజిమ్మిన ఈజిప్ట్ ప్రాచీన వాస్తుశిల్పావశేషాలలోను ప్రస్ఫుటమౌతున్నది.

ఈజిప్ట్‌లో మరణించినవారికి ఖనన సంస్కారం చేయడం, సమాధిచేయడం ప్రాచీనాచారం. శవాన్ని చర్మంలోగాని, చాపలోగాని చుట్టి గొయ్యి తవ్వి ఉంచి. మృతునికి సంబంధించిన అన్నివస్తువులను పక్కనపెట్టి ఇసుక కప్పివేసేవారు. ఈ సమాధులలో అమూల్యవస్తువులు ఉంచేవారు. ఈజిప్ట్ వాతావరణం తడిలేక పొడిగా ఉండడంవల్ల సమాధులలోని శవాలు ఎండిన ఎడారుల ఇసుక తగిలి చెడేవికావు. సహజంగా వస్తువులు ఉన్నరూపంతోనే ఉండేవి. సమాధులను దోచుకొనే దోపిడిదొంగలు సమాధులను తవ్వితీసి వస్తువులను దొంగిలించినప్పుడు శవాలను బైట పారవేసేవారు. దానితో శవాలను చెక్కుచెదరకుండా ఉంచడానికి వీలున్నదనే భావం తర్వాత ప్రజలకు కలిగింది. ఈ భావం "మమ్మీ"ల సంప్రదాయానికి దారి తీసింది.

ఈ సంప్రదాయం క్రీస్తుకు పూర్వం నాలుగు సహస్రాబ్దాలనాడు ఈజిప్టును పాలించిన మొదటి రాజవంశం కాలానికే పాతుకుంది. తాము పవిత్రంగా భావించిన మృగాలశవాల అతి గూఢ "మమ్మీ"లు చేసేవారు, ఇలా దేహాన్ని రక్షించడానికి కారణం మరణించిన వారి పారలౌకికయాత్రకు తోడ్పడుతుందన్న విశ్వాసమే.

మమ్మీ అనే పదం 'మమియాయి' అనే పార్సీ పదభవం, దీని మూలార్థం మైనం అని. తర్వాత దీనికి తారు, బంక అనే అర్థాలు రూఢమయాయి. శవాన్ని భద్రపరచడానికి మొదటిరోజులలో తేనె మైనం పూసేవారు. విజ్ఞానం పెరిగేకొద్దీ రసాయన ద్రవ్యాలు వాడేవారు. కాని, 'మమ్మీ' అనే ప్రాచీనపదం మాత్రం ఈ ప్రక్రియకు రూఢమైపోయింది. మమ్మీ అంటే తేనె మొదలయినవి పూసి భద్రపరచినశవం.

ఈ మమ్మీల సమాధులు క్రమంగా 'పిరమిడ్' అనే మహోన్నతమైన సూచిగా వుండే స్తూపాల నిర్మాణానికి కారణమయాయి. మొదట ఈ శవాల సమాధి పొడుగాటి మామూలుగొయ్యి. ఇది క్రమంగా చతురస్రాకారమైన నేలమాళిగ అయింది. ఈ నేలమాళిగలో శవాన్ని - మమ్మీని, దానికి సంబంధించినవస్తువులను ఉంచి, పైన కర్రలుపరచి, మట్టి, ఇసుక కప్పేవారు. కొంతకాలానికి కర్రచౌకట్లు - ద్వారబంధాలాంటివి - గోతిలోకిదించి, వాటపై మట్టి గుట్టపోయడం, పిదప చుట్టూ పిట్టగోడ కట్టి దానిపైన కప్పుగా రాళ్లతో కప్పివేయడం, ఈ పిట్టగోడలు ఎత్తయి పిరమిడ్ల రూపం దాల్చడం ఈ సమాధుల క్రమపరిణామం. పిరమిడ్లు గుండ్రంగా ఉంటే మట్టికట్టడాలు; చతురస్రాకారంగా ఉన్నవి రాతికట్టడాలు. మొదటి పిరమిడ్ ఖా-ఫ్-రా రాజులవంశంలో నిర్మితం.

జోసర్ అనే రాజుకాలంలో ప్రారంభమైన వాస్తుశాస్త్రం ఆయన మరణానంతరం 100 సంవత్సరాలలో చాల అభివృద్ధి చెందింది. నాల్గవ వంశరాజైన ఖుఫూ (చెవొప్స్) గిజా అనేచోట పెద్ద పిరమిడ్ కట్టించాడు. దీనిఎత్తు దాదాపు 450 అడుగులు. ఇది పెద్ద పిరమిడ్లలో రెండవది. ఇది వాస్తుగణిత శాస్త్రపాండిత్యానికి పరాకాష్ఠ.

ఈ సమాధులలో మరణించినవారి పరిసరాల, నిత్యజీవిత సంఘటనల చిత్రాలు గీయడం, శిల్పాలు చెక్కడం మామూలు. మరణించినవారి విగ్రహాలూ నిర్మించేవారు. కా-ఫ్-రా, మెన్ కావూర్ వంశాల రాజుల విగ్రహాలు దీనికి తార్కాణ కన్నులు సహజంగా కన్పించడంకోసం గాజు, స్ఫటికశిల, అద్దం వాడేవారు.

క్రీస్తుకు పూర్వం నాలుగువేల సంవత్సరాల నుంచి, క్రీస్తుకుపూర్వం నాలుగవశతాబ్దిలో అలెగ్జాండర్ ఈజిప్టుపైదాడి చేసేటప్పటికి 26 రాజవంశాలు ఈజిప్టును పాలించాయి. వీటిలో 12వ రాజవంశంవరకు రాగివస్తువులు వాడకంలో ఉన్నాయి. ఇవి ఎప్పుడు వాడకంలోనికి వచ్చాయో స్పష్టంగా చెప్పడం కష్టం. సిరియనులు తరచు దాడిచేయడంవల్ల ఈజిప్టువారు రాగి ఆయుధాలు అభివృద్ధిపరచుకొన్నారు. వీరి మొదటి ఆయుధం ముక్కోణపు బాకు. ఇలాంటి ఆయుధాల, రకరకాల మృగాల చిత్రాలు, మనుష్యులచిత్రాలు ఈ సమాధులలో దొరికాయి. చేతులెత్తి ఏడుస్తున్నట్లున్న స్త్రీల చిత్రాలు, గడ్డాలమనుష్యులచిత్రాలున్న ఏనుగుదంతాలు దొరికాయి. స్త్రీలచేతులకు పచ్చబొట్లు ఉన్నాయి.

ఈజిప్టులో గాడిద, ఒంటె ఎక్కడబడితే అక్కడ కనిపించే జంతువులు. కాని, ఒంటె ప్రాచీన చిత్రాలలోను, శిల్పాలలోను కనబడడం లేదు. దున్నపోతు కూడా పాతబొమ్మల్లో లేదు. ఎద్దు, మేక, గొర్రె, పంది, కుక్క, పిల్లి, బాతు, కనిపిస్తాయి. వింతగొర్రె ఒకటి కనిపిస్తుంది. దీనిని ఖునుం దేవత అంటారు, దీని తల గొర్రె పొటేలు తల. 18వ రాజవంశకాలంలో క్రీస్తుపూర్వం 17వ శతాబ్దంలో గుర్రం వాడకానికి వచ్చింది. సివంగి, తోడేలు, నక్క పాత మృగాలు. తోడేలు, నక్క పవిత్రమృగాలుగా భావించబడ్డాయి. సమాధులను నక్కలు తవ్వివేయకుండా పూజిస్తున్నట్లున్న చిత్రాలు, శిల్పాలు ఉన్నాయి.

సమాధులలో ఇతరవస్తువులతోపాటు మృణ్మయ నౌకలుకూడా—రకరకాలవి—దొరికాయి. వీటి ఆంతర్యం పురాతత్వవేత్తలు గ్రహించలేకపోయారు. ప్రాచీన ఈజిప్టు ప్రజల కర్మకాండలో ఈ సమాధులకు, మృణ్మయ నౌకలకు సంబంధం ఉంది. ఈ రెండింటికీ ఉద్దేశం ఒక్కటే.

ఈజిప్టులో నౌకాయానం రాజవంశాల పరిపాలనకు ముందే—క్రీస్తుకు పూర్వం ఐదువేల ఏండ్లనాటే ఉంది. తెడ్లతో నడిపే నౌకలు తెరచాపలు కలవి, లేనివి, చెక్కపు తెరచాపలు కలవి—రకరకాలవి ఉండేవి. ఇవి ఫొయెనీకా (లెబనాన్) నుంచి ఈజిప్టుకు కలప తెచ్చేవట. ఎర్రసముద్రంలో ఒకసారి ఓడపగిలి లెబనాన్‌కు. గజెల్‌కు యాత్రికులు కొట్టుకొనీ వచ్చారట. కాని, ఈ ఓడలు బాబిలోనియాకు, భారతదేశానికి వచ్చేవో లేవో తెలీదు. బాబిలోనియా నావలు మాత్రం వాళ్లకోసం ఎర్రసముద్రందాక వచ్చేవి. మూడవ రాజవంశం కాలంలో పెద్దనావలు మధ్యధరాసముద్రంలో ప్రయాణం చేసేవి. వాటికి 'శాంతినౌక', 'సూర్యమండల కాంతి' మొదలైన పేర్లూ ఉండేవి. 18వ రాజవంశపు హాట్‌షిప్‌సూత్ కాలంలో నౌకాయానం విశేషంగా అభివృద్ధి చెందింది.

మహాపురుషుల మరణానంతరం వారి ఆత్మ సూర్యమండలాన్ని భేదించుకొని వెళ్లుతుందని మన ప్రాచీనులు నమ్మినట్లే ఈజిప్టు ప్రాచీనులు కూడా మరణానంతరం తాము కూడా సూర్యునితో పాటు తేజోలోకాలలో ప్రయాణం చేయగలమని నమ్మేవారు; తమ ఔర్ధ్వదైహిక యాత్రకు ఉపయోగపడగలవనుకొనే నావలను తమ సమాధులలో పెట్టుకొనేవారు.

ఈజిప్టులో ఎక్కడచూచినా ఎడారులు; రాకపోకలను నైలునదితప్ప గత్యంతరం లేదు. కనుక ఇహజీవితంలోను, పరలోకయాత్రకూ ఓడే ఏకైక ప్రయాణసాధనమని ప్రాచీనులు భావించడం సమంజసమే. నైలునది ఈజిప్టు ప్రజల జీవితంలో భాగం. అది వారి జీవిత సమైక్యానికీ, సంస్కృతి సమన్వయానికి మూలకారణమైంది. ప్రాచీనులు నైలునది బంకమట్టితోను రెల్లుతోను ఇళ్లు కట్టుకొనేవారు. తర్వాతవచ్చిన రాతికట్టడాలకు వాడిన రాయికూడా ఈ నైలునది మీదుగా రవాణా అయినదే.

తుంగ, రెల్లు నీటిలో మునిగేవి కావు. గనుక ప్రాచీనులు వాటిని మహోపకృతివస్తువులుగా చూచేవారు. దాన్ని మోపులుకట్టి నావలుగా వాడేవారు. అవే తర్వాత రకరకాల నావలకు మరవడి అయినాయి. కనుక నావకు ఈజిప్టుజాతిజీవితంలో ప్రాధాన్యం.

మెనేస అనేరాజు ఎగువ దిగువ ఈజిప్టుల సమైక్యం సాధించిన తర్వాత రాజవంశీయుల సమాధులలో రెండుజతల నావలు కలిపించేవి. రెండు ప్రాంతాలలోను వేర్వేరు దేవత లుంటారు గనుక

# సాహితీ సుగతుని స్వగతం

ఎగువ రాజరికానికొక జత నావలు, దిగువ రాజరికానికి మరొకటి. వీటికే పగటి నావలు, రాత్రి నావలు అని సంకేతం ఏర్పడింది. 'రా' (రవి) దేవత ఉదయం జన్మించి రాత్రి పాతాళలోక ద్వారంలో మరణించే వరకు ప్రయాణం చేయడానికి పగటి నావలు. అమర జీవులందరూ అక్కడ రాత్రి నావలకు మారి భయంకర పాతాళప్రయాణం చేస్తారు కనుక రాత్రి నావలు. ఈ నావలు 24 గంటలకు సంకేతమైన 24 ద్వారాలు దాటాలి. ఓసిరిస్ (మృత్యుదేవత) వసించే అబిడోస్‌కు వెళ్లడానికి ఐదవనావ "ఖెంట్". "ఖేడీ" అనేవి స్వర్గ మర్త్యలోకాల ప్రయాణాలకు వాడే ప్రాచీనపదాలు. ఖెంట్ అంటే నైలునదిలో ఎగువప్రయాణం; ఖేడీ నైలునదిలో దిగువ ప్రయాణం. ఈ ఎగువ దిగువప్రయాణపు పదాలే స్వర్గమర్త్యలోక ప్రయాణాలకు, వ్యవహృతమయాయి; క్రమంగా. ఈ నావలను సూర్యనావలనేవారు. ఆరవ వంశం రాజులకాలంలో విప్లవం చెలరేగి, రాజ్యవ్యవస్థ భగ్నమై, దొంగలు సమాధులను ధ్వంసం చేసి, వాటిలోని వస్తువులను దోపిడీ చేయడంవల్ల, తర్వాతివారు ఈ సూర్యనావలను పిరమిడ్లలోనే పాతిపెట్టసాగారు.

ప్రాచీన ఈజిప్టుజీవితం మన జీవితంలాగే ఆముష్మిక ప్రధానం. ప్రతిరాజు తనకు ముందురాజు చేసిన ఏర్పాట్లు ధ్వంసం కావడం, సమాధులు కొల్లపోవడం చూచి, తన ఆముష్మికయాత్రకు ఎంతో శ్రద్ధ తీసుకొనేవారు.

కొంతకాలానికి మరొక విప్లవం జరిగి, పిరమిడ్లంటే ధనాగారాలనే భావం దొంగలకు ఏర్పడి, సమాధులను దొంగలు అపవిత్రం చేయడంవల్ల ప్రజలు సమాధులను కొండదరికులలో దాచేవారు. అక్కడే సూర్యనౌకశిల్పం చెక్కి, బొమ్మలుగీచి సంతృప్తిపడే వారు. అలెగ్జాండర్ దండయాత్ర తర్వాత (క్రీస్తు పూర్వం 332.) సూర్యనౌకల సంప్రదాయం లుప్తప్రాయమైంది.

ఈ సంప్రదాయం ఎలావున్నా దీనివల్ల నౌకా నిర్మాణ కళ నాల్గవ రాజవంశంలోని ఖుఫు(చెవోప్స్) కాలంలో (క్రీస్తుపూర్వం (2900-2750) పరాకాష్ఠకు చెందింది. కనుకనే సమాధులనుంచి వాటిని దొంగలు అపహరించేవారు.

ఖుఫూరాజు కట్టించిన గిజాలోని పిరమిడ్ పరిసరాలలో దొరికిన సూర్యనౌక ఆనాటి నౌకానిర్మాణ కళకు ఉదాహరణ. ఖుఫూరాజు విగ్రహాలు, అప్పటి రెల్లుగడ్డి కాయితాలు (పపైరస్), ఆయన వాడిన వస్తువులేవీ ఈ సమాధిలో దొరకలేదు; ఒక్క నావ తప్ప. ఈ నావకూడ అత్యాశ్చర్యకరంగా దొరికింది. దీనిని కనుగొనడం ఈజిప్టు చరిత్రలోనే విప్లవం వంటిదని ఈజిప్టు పురాతత్త్వవేత్తలంటున్నారు.

ఈ నావను ఏడేళ్ళక్రితం (1953 మే 26) గిజాలోని పురాతత్త్వశాఖ డైరెక్టర్ కమాల్-ఎల్-మలఖ్ కనిపెట్టాడు. దాదాపు 450 అడుగుల ఎత్తువున్న ఈ పిరమిడ్ చుట్టూ యాత్రికుల సౌకర్యంకోసం రోడ్డు వేయించడానికి ఇసుకను తీయించివేస్తుండగా కింద ఖంగు ఖంగు మన్నది. పరిశీలించగా, 150 గజాలున్న సున్నపురాళ్ళ నడవకప్పు కనబడింది ఇక్కడే ఎక్కడో ఖుఫూ సూర్యనౌక వున్నట్టు అంతకుముందు రెండు సంవత్సరాలక్రితం ఒక రాతిపై కనిపించిన జంతులిపి మూలంగా శాస్త్రజ్ఞులు ఊహించారు. కాని, కచ్చితంగా ఇక్కడేనని తెలీలేదు. మలఖ్‌కు ఆ నౌక ఇక్కడే వుందని ఎందుకో స్ఫురించింది.

ఈ సున్నపురాతి నడవకప్పు ఖుఫూ పిరమిడ్‌కు దక్షిణాన 25 అడుగుల దూరాన పూర్వ పశ్చిమంగా ఉన్నది. మలఖ్ దానిపై పేరుకొని ఉన్న ఇసుక, మట్టి తీయించగా కప్పు ఉత్తరపుకొస కనిపించింది. ఈనడవ మధ్యకు సరిగా ఒకగోడ ఉన్నట్లూ కనిపించింది. నడవకు పిరమిడ్‌కుమధ్యన దక్షిణోత్తరంగా ఒకబండరాయి పెట్టడంవల్ల నడవ వేరైపోయింది. నడవ తూర్పుభాగం మధ్యకు మెట్లు రాతిలో తొలచబడివున్నాయి. రాతిని తొలిచి రెండునావలు వాటిలో భద్రపరచినట్టు స్పష్టమైంది. మలఖ్ ఈ రాతికప్పులో ఒకరాతిని తొలిపించి, తలమాత్రం దూరదగినంత సందుచేసి, అద్దం తెప్పించి లోపలికి వెలుతురు ప్రతిఫలింపజేసి తొంగి చూచాడు. మలఖ్ సంతోషానికి మేరలేదు. "ఐదువేల సంవత్సరాలనాటి ఖుఫూరాజు పరలోక యాత్రకు భద్రపరచిన సూర్యనౌకలలో ఒకదానిని తొలిసారిగా చూచే భాగ్యం నాకు కలిగింది." అని ఆనందించాడు. ఆయన మాటలలోనే ఓసంగతి వినండి:

"తొంగిచూడగానే గుప్పుమని సుగంధం-బహుశా ఐదువేల సంవత్సరాలనాటి ధూపధూమ సుగంధం-మా నాసాపుటాలకు సోకి ఆనందపరవశు లయ్యాము. ఈజిప్టు ప్రాచీనులు పవిత్రంగా భావించే ఉదుంబర,

దేవదారు వృక్షాల కమ్మని వాసన వచ్చింది. మొట్టమొదట సూర్యోదయానికి ముందున్న ఆకాశం లాగ అంతా తెల్లగా కనిపించింది. తర్వాత ఏదో గోధుమ రంగు వస్తువు సరిగా అట్టడుగున కనిపించింది. కళ్ళు మరింత పెద్దవి చేసుకొని చూశాను; లోపల ఏమైనా కనిపిస్తుందా అని. కింద కనిపించిన గోధుమరంగు భాగంలో కోలగా వున్న ఆకారం కనిపించింది. కోలగా ఉండే ఆకారం ఓడ తెడ్డని తోచింది. ఓడ! ఓడ! ఎందుకలా నిలుచుకొని ఉన్నారు. ఫ్లాష్ లైట్ తీసుకొనిరండి. లేకపోతే అద్దమున్నా తెండి—అని కేకలు వేశాను. ముందు కాంతిలో మొదట నాకు కనిపించింది సూక్ష్మాకారంలో ఎదుట ఒక ఎర్రటి గుర్తు. అది జంతులిపి కాదు. నా ముందు కనిపిస్తున్న కలప పైభాగంలో డెక్కు చాందినీ, దానికి కట్టిన పగ్గాలు, మరి నాలుగు తెడ్లవంటివి కనిపించాయి. పూర్తిగా నౌక. ఎవరూ తాకలేదు—అని కేక వేశాను. మొత్తం ఆరు డెక్కులు కనిపించాయి. ఓడవున్న కసారా లోకప్పుపై నీలిరంగు క్రొత్త గుర్తులున్నాయి. ఇవి నక్షత్రాల ప్రాచీన చిహ్నాలు."

ఈ నావ నిర్మాణానికి దేవదారుకలప లెబనాన్ నుంచి తెప్పించబడి ఉంటుందని, మేడి (ఉదుంబర) ఈజిప్టుదేనని పరిశోధకులన్నారు. చెయోప్స్ కాలపు కలప దొరకడం ఇదే మొదలు. సూర్యనౌకలు ఆత్మ ప్రయాణానికి ఉద్దేశించబడినవి గనుక వీటిలో ఇతర వస్తువులు వుండవని, మొదటి పరిశోధకులు భావించారు. కాని, మరణించి వారి పరలోక యాత్రకు ఇహలోక ప్రతికృతులు సాధనాలు కాగలవనే నమ్మకం వుండడంవల్ల ఖుఫూ, ఆయన పరివారం ప్రతిమలు, తక్కిన రూపాలు డెక్కులపైన చెక్కబడి వుంటాయని మలఖ్ విశ్వాసం.

ఆయన ఈ ఓడరూపాన్ని ఫ్లాష్‌లైట్ల ద్వారా ఫోటో తీసిన తర్వాత ఎడారి చలిగాలి లోపల ప్రవేశించి ఓడలు చెడిపోకుండ కసారా కప్పురంధ్రాన్ని తిరిగి జిప్సం కలిపిన సిమెంటుతో కప్పి వేశాడు.

భారత నౌకాచరిత్ర కూడా అతి ప్రాచీనమైనదే. ఋగ్వేదంలో "ఓ అగ్నీ! నీవు మనుష్యుల్ని నావ నదిని దాటించినట్లు మహారణ్యాలు దాటిస్తున్నావు." (స నః పర్షదతి దుర్గాణి విశ్వా నావేవ సింధుం దురితాత్యగ్నిః.) అనే అగ్నిసూక్తాలున్నాయి. కాని, ప్రాచీనమైన నావలు లభించలేదు. ఈజిప్టులో ఐదువేల సంవత్సరాల నాటి నావ చెక్కు చెదరక, అప్పటి రంగుతో, వాసనతో, రూపంతో కనిపించడం ప్రపంచ నాగరికతా చరిత్రలోనే నూతనాధ్యాయం. ప్రతి భావుకుడు, సహృదయుడూ, విశేషించి ప్రాచ్యదేశవాసులమైన భారతీయులం—అందులోను మున్నీరును మోకాలిబంటిగా భావించి విచ్చలవిడిగా ఓడలు నడిపిన తెలుగువారం — గర్వించదగింది.

—రామచంద్ర.

# లక్షణసార సంగ్రహము - పునర్విమర్శ

## శ్రీ బులుసు వేంకటరమణయ్య

చిత్రకవి పెద్దన రచించిన 'లక్షణసార సంగ్రహము' మదరాసు విశ్వవిద్యాలయము వారిచే విద్వాన్ పరీక్షకు పఠనీయముగా నిర్ణయింపబడియున్నది. కావున జిజ్ఞాసువుల యుపయోగార్థమై యా గ్రంథమును గూర్చిన నా విమర్శనలేశ మొకటి గడచిన ఏప్రిలు నెల (1959) సంచికలో ప్రకటింపబడినది. దానిని విమర్శించుచు శ్రీ రావూరి దొరస్వామి శర్మగారు వ్రాసిన ప్రతివిమర్శనము సెప్టెంబరు నెల 'భారతి'లో ప్రకటింపబడినది. మూలగ్రంథమును, విమర్శ, ప్రతివిమర్శల నొక్కచో నుంచి చూచినచో తత్త్వమందఱికి నవగతము కాగలదను తలపుతో నేను 'పునర్విమర్శనము'ను వ్రాయ నింతవఱకును పూనుకొననైతిని. కాని, ఇక నుపేక్షించుట సరికాదని శ్రీ శర్మగారి విమర్శనమునందలి ప్రధానాంశములకు సమాధానమిచ్చుటకై యీ పునర్విమర్శనమున కుద్దేశించితిని.

లక్షణసారసంగ్రహమునందలి విషయములనుగూర్చి నా వ్యాసమున గొంత ముచ్చటించితినే కాని, పెద్దన నాక్షేపించు తలపేమాత్రము లేదు. శర్మగారు నా వ్యాసమునందలి కొన్ని వాక్యములను తమకు దోచినరీతి నర్థము చేసికొని విమర్శింపసాగిరి. కొన్ని యాక్షేపణలకు సమాధానము లిచ్చుపట్ల "ఈరీతి నితడే కాదు; ఇతనికి బూర్వమున నుండినవారు కూడ నిట్లే వ్రాసియున్నా"రని వ్రాయజొచ్చిరి. పెద్దన వ్రాత యెట్లున్నదను నదియే నా ప్రస్తుతాంశము కాని, యితరు లింతకు బూర్వ మిట్లు చెప్పిరా? లేదా? యనునది కాదు. ఇతరులు చెప్పినంతమాత్రమున సరియైనదనుటకును వీలు లేదు.

ఈ గ్రంథమున ఛందోవిషయముతోబాటు వ్యాకరణ, సాహిత్యవిషయములును కొన్ని కలవు. "లక్షణ జిజ్ఞాసువుల కిది యెక్కువగా నుపయోగింపని కారణముచేతనో యేమో దీని యునికియే చాలమందికి దెలియకపోయినది. దీని రచయిత ప్రఖ్యాతుడు కాకపోయెను" అని నేను వ్రాయగా—ప్రాచీను లీకవిని ప్రశంసించినట్లు శ్రీ శర్మగారు వ్రాసిరి. ప్రాచీనులు పెద్దనను పేర్కొన లేదని నే ననలేదు. కాని ఆంధ్ర సాహిత్యపరిషత్తువారీ గ్రంథమును 1940 లో ప్రకటించువఱకును దీని యునికి చాలమందికి దెలియదనుట నిశ్చయము. కవుల ప్రఖ్యాతి వారు రచించిన గ్రంథములపైనే ఆధారపడియుండును. గ్రంథమును గూర్చియే యెక్కుమందికి దెలియనపుడు దాని రచయిత 'ప్రఖ్యాతుడు కాకపోయె'నని వ్రాయుట తప్పే అయినచో ఆ తప్పును నేనొప్పుకొందును.

వ్యాకరణ విషయమును గూర్చి ప్రస్తావించుచు పెద్దన తెలుగక్షరములను ఏబదిరెండింటిని పేర్కొనెననియు, 16 అచ్చులను, 25 స్పర్శములను, య ర ఱ ల ళ వ శ ష స హ వర్ణములను, క్ష కారమును చెప్పెననియు, ఇందు క్ష కారమును విడుచుట మేలనియు, ఛందోవిషయనిరూపణమున పూర్ణార్ధబిందువులను పేర్కొనిన పెద్దన వర్ణసమామ్నాయమున నుభయాక్షరములను చెప్పవలసియుండెననియు నేను వ్రాసితిని.

శర్మగారు ఉభయాక్షరముల గూర్చిన వ్రాత నేమియు గ్రహింపక 'ఌ'కార, క్ష కారములను గూర్చి యాంధ్ర లాక్షణికుల యాశయములను సుదీర్ఘముగ వివరించుచు "వర్ణసమామ్నాయములో 'ఌ' కారము గ్రాహ్యమని, క్ష కారము వర్ణాంతరము కాకున్నను తెలుగు లాక్షణికులు పెక్కురు గ్రహించినారు" అని చివఱకు వ్రాసి సమాధాన మిచ్చినట్లు తృప్తిపడినారు. ఉభయాక్షరములను వర్ణసమామ్నాయమున జెప్పకుండుట సరియేయని రావూరివారి యభిప్రాయమేమో!

పెద్దన 'కావ్యస్వరూపం బెట్టిదనిన—' అను నష్టాదశవర్ణనములు కలది కావ్యమని చెప్పెననియు, అది సరికాదనియు, 'దోషరహితములై, గుణాలంకార సహితములగు శబ్దార్థములు కావ్య'మనుట సరియగునవియు, అష్టాదశవర్ణనలు కలిగియుండునది కావ్యములలోని 'మహాకావ్య'మగుననియు వ్రాయుచు 'అనన్వాచిక'లో 'దూత్య' మనుటకు 'దూత్యత' మనుట సరియై యుండునని వ్రాసితిని. రావూరివారు 'కావ్యస్వరూప' నిరూపణమునందలి యౌచిత్యానౌచిత్యముల

ప్రసక్తి విడిచి చిన్నకోట పెద్దన మున్నగువారిని పేర్కొనుచు "దూత్యము మతాంతరమని విస్పష్టము కాన పెద్దన వ్రాత యసంగతము కాదు" అని సమాధానమిచ్చిరి. 'కావ్యాలంకార చూడామణి' మున్నగు గ్రంథములలో నదియుండుగాక! దౌత్యము 'మంత్రము'తోనే సంబంధించినదని యభిజ్ఞుల యాశయము. మధుపాన, రతోత్సవములను వర్ణించునెడ 'ద్యూతము' ఉండుట యుచితము. ఇంతకును 'ద్యూతమా? దూత్యమా?' అను చర్చ యిచట ప్రధానము కాదు. "కావ్యమున అష్టాదశవర్ణనము లుండు" ననుటయే కావ్యస్వరూప మను పెద్దన వ్రాత సరియైనదని రావూరి వారన్నచో—దానికి ప్రత్యుత్తర మనావశ్యకము.

సంధిగత ప్రాసమునుగూర్చి వ్రాయుచు "...... పవనజాకవచమే న్పఠియింతు ననని ది—సంధిగత ప్రాస సంజ్ఞ దనరు" ననునది సరియైన యుదాహరణము కాదనియు, సంధిగతప్రాసలక్షణ మేమో పెద్దన చెప్పనే లేదనియు నా వ్యాసమున చర్చించి వ్రాసితిని. రావూరివారు "సంధిగతప్రాస లక్షణమున్నదా? లేదా?" అను ప్రధానాంశమును గ్రహింపనే గ్రహింపక పయి యుదాహరణమును సమర్థింప బూనుకొనిరి. వారు తమ ప్రతివిమర్శనమున,

"పవనజాకవచమే న్పఠియింతు ననని ది
సంధిగతప్రాస సంజ్ఞ దనరు

ఇందు సంధిగతప్రాస కుదాహరణ లేదని తోచును. ఈ పాఠము సరికాదు. 'పవనజాకవచమే—నుపఠింతు ననని ది—' అని యుండవలయు. ఏను+పఠింతు; ఇందు సిద్ధవకారమునకు, సంధిగతవకారమునకును ప్రాస ముంచబడినది. ఏను ద్రుతప్రకృతికము గాన 'ఏను బఠింతు' ననిక దా సంధిగలుగునను శంక రావచ్చు. ఏను+పిదప= ఏనువిదప అని గసడదవాదేశము భారతమున ప్రాసస్థల నిబద్ధమైయున్నది.

'కవచోవలను గాండీవము
నవల నిడం బనుపు ముంద అరదము డిగు మే
ను విదప డిగిరొద.' [శల్య. 2-388]

ఈ మహాభారతప్రయోగమును జూచియు, 'ఎవ్వండు పఠించు' అను కాశీఖండ ప్రయోగమునంతలి తెనుగు మీది తత్సమపదములకు గసడదవాదేశప్రాప్తిని జూచియు మన పెద్దన 'ఏను పఠింతు'నని ప్రయోగించియుండును.'' అని వ్రాసిరి.

'పవనజాకవచమే న్పఠియింతు' ననుచో 'ఏను బఠింతు' అనునది సరియైన పాఠమనుచు 'సిద్ధసంధిగత వకారములకు (లఘు వకారమునకును, అలఘువకారమునకునని అభిప్రాయమేమో? సిద్ధ సాధ్యభేద మను స్వారములకే వ్యాకరణమున ప్రసిద్ధము.) ప్రాసమని రావూరివారి యభిప్రాయము. ఇట్టి ప్రయోగమును సమర్థింపబూని వారొక పెద్ద పొరపా టొనర్చిరి. "ఏన విదప" అను తిక్కన భారతప్రయోగమును "ఏను విదప" అని భ్రాంతిపడి "ద్రుతప్రకృతికములమీద నుగసడదవాదేశము రావచ్చు"నని క్రొత్తసిద్ధాంతము నొనరించిరి. ఇది విచిత్రము! పయి మహాభారత ప్రయోగమును గూర్చి 1952 లోనే ప్రకటింపబడిన నా 'త్రిలింగలక్షణశేష' (ప్రౌఢవ్యాకరణ) సుబోధినీ వ్యాఖ్యయందు క్రిందిరీతిని వ్రాయబడియున్నది.

"అనఁగ 'ఏన విదప' అనునదియే సరియైనపాఠము. 'ఏను' శబ్దముపై నవధారణార్థకమగు 'అ' చేరి 'ఏన' అయినది. కళలగు నవ్యయములమీదఁగూడ గసడదవాదేశము విధింపబడుటచే 'పిదప'లోని తొలి పకారము వకారమై 'విదప' అయినది. కాన ప-వ ప్రాసమునకిట్టిది ప్రమాణము కాజాలదు............ ఏను ద్రుతాంత మగుటచే దానికి దర్వాత నున్న పకారమునకు సరళాదేశమువచ్చి 'ఏను బిదప' అయితీరవలెను. [పుట. 20]"

లక్షణసారసంగ్రహములోని పాఠమును సరిదిద్ద వలసినచో "పవనజాకవచమే—న పఠింతు" అని చెప్ప వలసియుండును. గాని 'ఏను పఠింతు'నని చెప్పుట కుదురదు.

'ఏను పఠింతు'ననుదానికి సమర్థకముగా శ్రీనాథుని ప్రయోగమునిచ్చుటయు సరికాదు. 'ఏను' ద్రుతప్రకృతికము. దానింగూర్చిన చర్చలో 'ఎవ్వండు పఠించు' ననునది యెట్లుదాహరణము కాగలదో తెలియకున్నది.

ప్రాది ప్రాసమును గూర్చి వ్రాయుచు "వణలతో గూర్చిన ప్రాసము ప్రాదిప్రాసమనుచు 'పూనిక లక్ష్మణ ప్రాణమెత్తె'నని యుదాహరణ మీయబడిన దనియు, దీనికి 'ప్రాది ప్రాసమని పేరేల వచ్చెనో తెలియకున్న'దనియు నేను వ్రాసితిని. ప్రాదులగు నుపసర్గలతోడి ప్రాసము ప్రాదిప్రాసముగుననియు 'వణలు సంబంధింపఁ బ్రాదియన్ ప్రాస మొనరు' ను లక్షణము సరికాదనియు భావించి దీనికి 'ప్రాదిప్రాస'మను పేరేల వచ్చెనో తెలియకున్న'దని వ్రాసితిని. ఇతరుల పరిజ్ఞానముపై విశ్వాసములేని రావూరివారు ప్రాదులవ

నేమియో, ప్రాదిప్రాస మన నేమియో తెలియగనను భావముతో — పెద్దన చెప్పిన లక్షణము బాగుగు నెత్తుకొనక యుదాహరణమును మాత్రము గ్రహించి "ప్ర + అన — ప్రాణ. ఇందు ణకార మాదేశము. ఇట్లాదేశణకారమునకును, కేవల నకారమునకును ప్రాస ఘటింపనగును. (భూనుక — ప్రాణ) 'గుణ — మున' అను రీతి సిద్ధ (?) నకారణకారములకు ప్రాసమైత్రి లక్షణ విరుద్ధము. ప్రాదులపైని ణత్వమున కీప్రాస చెల్లుగాన ప్రాదిప్రాసనామ ముంచబడియె" అని వివరించిరి. తెలియనివిషయము నిట్లు వివరముగా దెల్పినందుకు వారికి ధన్యవాదములు. 'న ణ లు సంబంధింపఁ బ్రాదియన్ ప్రాసమొనరు'నను లక్షణము ప్రాదిప్రాసమునకు సరిపడియున్నదని వారు తలచినచో — దానికి సమాధాన మనావశ్యకము.

'ఋ' ప్రాసమును గూర్చి వివరించు నెడల
"ఆ ఋకారము రేఫతో రహి గూర్చిన
ప్రౌఢులౌ కవులు ఋప్రాసమంద్రు"

అని లక్షణము మాత్రమున్నది కాని యుదాహరణము లేదని వ్రాసితిని. 'ప్రథమార్ధమునందు, ప్రారంభమందే యుదాహరణ మున్నదే' యని రావూరివారి సమాధానము. లక్షణమునే లక్ష్యముగా గ్రహించిన, వారన్నది సరియే! లక్ష్యలక్షణములను వేర్వేరుగా జూపు నీ గ్రంథమున

"క్షోణిపై మకరికి ప్రాణముల్ హరియించె
బూనుక లక్ష్మణప్రాణమెత్తె
హనుమంతు డనుచు నీ యనువున నణలు సం
బంధింప బ్రాదియన్ ప్రాసమయ్యె"

అని లక్షణోదాహరణము లీయబడినట్లు వేర్వేరుగ లేవు. ఈ విషయమునే వ్రాయుగా రావూరువారు ప్రారంభమందే యుదాహరణ మున్నదన్నారు. నా దృష్టిలో అది లక్షణము! వారి యభిప్రాయమున నుదాహరణము! ఒకవేళ వారు సమాధాన మీయదలచినచో పై రీతిని చెప్పక లక్షణమునే యుదాహరణముగా గ్రహింపవలెనని గాని, లక్షణమునం దుదాహరణ మిమిడి యున్నదనిగాని చెప్పవలెను.

ఈ ప్రాసభేదమును జెప్పుట యనావశ్యకమని నేను వ్రాసితిని. దానికి 'అనంతుం డీ ఋప్రాసమును జెప్పె' ననునది రావూరివారి సమాధానము. దీనిం జెప్పుట యావశ్యకమా? కాదా? అనునదియే చర్చనీయాంశము కాని, ఇతరు లీ రీతిని చెప్పిరా, లేదా? అనునది కాదు.

ఇట్లే 'ప్రాసమైత్రి ప్రాసము'ను తెల్పుట యనావశ్యకమనగా "ఇత్యాది స్పష్ట ప్రతిపత్తికై చెప్పబడిన"దని రావూరివారి సమాధానము.

లక్షణసారసంగ్రహములో ప్రాసయతి చెప్పబడలేదని నేను వ్రాయగా "ఇదియొక యతిభేదముగా ప్రాచీనలాక్షణికు లెవ్వరును చెప్పలే"దని సమాధానము. మఱియు "ప్రాసయతియొక యతిభేదము కాదు" అనియు శ్రీ శర్మగారు వ్రాసిరి. సర్వలక్షణములకును అప్పకవినే పరమప్రమాణముగా గ్రహించు రావూరివారే అప్పకవి చెప్పిన ప్రాసయతి యతిభేదము కాదని నిర్ణయించినచో, ఇక ఎవ్వరు సమాధానము చెప్పగలరు?

ప్రాదియతి మున్నగునవి కొన్ని నిత్యసమాస విశ్రాంతియందే లీనమగుటచే, వానిని ప్రత్యేకముగా జెప్పుట అనావశ్యకమని నా విమర్శలో గలదు. దానికి సమాధానము ప్రతివిమర్శనమునందు "ఇది కొంతవఱకు వాస్తవమే కాని, ప్రాచీనకవిభీమననుండి నిన్న మొన్నటివఱకు ఛందఃకర్తలు నిత్యసమాసయతితో బ్రాద్యాదేశాదియతులను సయితము చెప్పుచు వచ్చిరి. ఉభయవళ్లలో నిన్ని భేదములు లాక్షణికులు స్పష్టప్రతిపత్తికై చెప్పిరని తోచెడిని" అని మామూలు పద్ధతిలోనే యున్నది.

"పు ఫు బు భు లు మకారముతో యతినిపొందిన యెడల 'చక్కటియతి' యగుననియు, విభక్తి 'ము' కారముతో యతి చెందినయెడల 'పోలికయతి' యగుననియు నిందు జెప్పబడినది. 'ము' అనునది విభక్తికి సంబంధించియున్నను లేకున్నను పు ఫు బు భు లతో మైత్రిని పొందినపుడేదో యొక్క యతిని చెప్పిన జాలును." అని నా విమర్శనమున నున్నది. దానికి సమాధానముగ ప్రతివిమర్శనమున "పెక్కురు లాక్షణికు లీ రెండుభేదముల వ్రాసియున్నారు. పోలిక యతి ప్రాచీనమతము. చక్కటి యతి యర్వాచీనమతము. .........ఉభయమతప్రదర్శనార్థము రెండు యతులుగా జెప్పబడినవని తోచెడు" అని యున్నదో ఇట్టివి సరియగు సమాధానములని యెవ్వరు నంగీకరింపరు. సద్విమర్శకులు "బాధేఽదృఢేఽన్యసామ్యాత్కిం దృఢేఽన్యదపి బాధ్యతామ్" అని యిట్టియెడ వాకొందురు. [బాధ దృఢముగా లేనప్పుడు ఇతర సామ్యములవలన బ్రయోజన ముండదు. బాధ దృఢముగా నున్నపుడు ఇతరములు కూడ బాధింపబడవలసినదే అని పయిదాని యర్థము.]

నాటక విషయమును ప్రస్తావించుచు రావూరి వారు "ఇందు ముద్రణ స్ఖాలిత్యము లేర్పడుటచే గవికి మూలవిషయార్థావగతి కాలేదను కళంకము వ్యాసకర్తచే నంటగట్టబడెను" అని వ్రాసిరి. సంస్కృత మూలమునందు

శ్లో॥ 'చతుర్విధై రభినయైః
సాత్త్వికాంగిక పూర్వకైః,
ధీరోదాత్తాద్యవస్థాను
కృతి ర్నాట్యం రసాశ్రయమ్'

అని యున్నది. దానికి పెద్దన యనువాదము—

'అతిశయచతుర్విధాభినయములు గల్గి
సాత్త్వికాంగిక పూర్వకసరణి మించి
నాట్య మనరు ధీరోదాత్తనాయకాద్య
వస్థల రసాశ్రయంబయి వచ్చు కృతుల'

సాత్త్వికాంగిక వాచికాహార్యభేదములచే నాల్గువిధము లగు నభినయముతో గూడిన, ధీరోదాత్తాదినాయకావస్థానుకరణరూపమయి, రసాశ్రయమైనది నాట్యమని మూలాభిప్రాయము ఈ యంశ మనువాదపద్యమున స్పష్టము గాకున్నది. పెద్దన 'సాత్త్వికాంగిక పూర్వకైః' అనుదాని యభిప్రాయమును గుర్తెఱుగక సాత్త్వికాదులకంటె చతుర్విధాభినయములు వేఱని భ్రాంతిపడెను. మూలమునందలి 'సాత్త్వికాంగిక పూర్వకైః' అనుచోట గల పూర్వశబ్దముచే వాచికాహార్యాభినయములను గ్రహింపవలెను. 'పూర్వశబ్దేన వాచికాహార్యాభినయా గృహ్యేతే' అని వ్యాఖ్యాత వివరించియున్నాడు. దీనిని బట్టి పెద్దనకు మూలార్థావగతి కాలేదనుట స్పష్టము—అని నావిమర్శనమున దెల్పితిని. రావూరివారీ యనువాదము నందలి ముద్రణస్ఖాలిత్యము లేవో, వాని నెట్లు సవరించి చదువుకొనవలెనో తెలిపి, మీదట తమ యభిప్రాయమును వెల్లడించిన బాగుగ నుండెడిది!

పెద్దన పొరపాటున లక్షణసారసంగ్రహమున వ్రాసిన విషయము లింకను గొన్ని కలవు. ఎక్కటి యతిలోను, అభేదయతిలోను జెప్పబడిన విషయములు పరస్పరవిరుద్ధములుగ నున్నవని నా వ్యాసమున జెప్పగా, రావూరివారు దానికట్టి సమాధానము నీయలేదు. అట్టి మరికొన్ని యాక్షేపణలకును సమాధానము నీయక—విమర్శనముపై ప్రతివిమర్శనమును వ్రాయవలెనను ఆశయముతోడ మాత్రమే తమకు దోచినట్లు వ్రాసియున్నారు.

పెద్దనకవి యభిప్రాయములలోని పొరపాట్లను కొన్నింటిని పీఠికలో శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారును చూపియున్నారు. ముద్రణస్ఖాలిత్యములను గ్రహించినచో ఇందలి లోపముల నెన్నింటినో చూపవచ్చును.

లక్షణసారసంగ్రహప్రతులు రెండు విధములుగ నున్నట్లును, లక్ష్యలక్షణములతోడి ప్రత్యంతరము పెద్దన రచితమున్నట్లు ఊహింపదగియున్నట్లును శ్రీ నిడుదవోలు వేంకటరావుగారును తమ 'ఉపోద్ఘాతము'లో వ్రాసియున్నారు. అందువల్ల లక్షణసారసంగ్రహము ఆఱాశ్వాసములు కలదియైన నుండి యుండవచ్చునని యూహించి, ఆ విషయమును నా విమర్శనమున వ్రాసితిని. నా యూహ సరియైనది కాదని రావూరివారు వ్రాసిరి. వారిది యూహయే! అదియు ననుపలబ్ధగ్రంథమును గూర్చినది! ఆ యనుపలబ్ధగ్రంథమును గూర్చి ఔనని కాని, కాదని కాని నిర్ణయించుట సంగతము కాదేమో! నా యూహ సరియైనది కాకపోవచ్చును. ఆ విషయమై నా తప్పును సరిదిద్దుకొనుటకు సంసిద్ధుడనే!

[ఈ విమర్శ ప్రతివిమర్శముల కింతటితో స్వస్తి.]

సం. భా.

# కొమ్మ కొమ్మకో సన్నాయి!

శ్రీ కందుకూరి లింగరాజు

[గతసంచిక తరువాయి]

పళ్ళెం బల్లమీద పెడుతూ, "నేను సర్దిపెడతానులే! అంతకోపం ఎందుకూ నామీద" అనేసేడు ప్రక్కగా చతికిలబడుతూను.

ఆ సిల్కు చీరలు మడతలు పెట్టడం రాక, జాకెట్లు ఎల్లా కుదించాలో తెలియక తికమక పడడంతో ఇద్దరికి నవ్వూ వచ్చేసింది. అమాయకత్వం నిండిపోయినట్లు మాస్తూ యాజులు శ్రుతి కలిపేసేడు. కెంపులే కదిలేయి.

కాఫీ త్రాగి సావిట్లోకి వచ్చేసరికి, శ్రీపతి ఎదురుగా వచ్చేడు. వీడు ఇంత పెందరాళే ఎందుకు వచ్చేడా అన్న సంశయం పీకింది, అందులోనూ ఒక్కిగా ఎప్పుటూ రాడు. వస్తే లంకాదహనమే చేసి వెళ్తాడు అన్న అనుభవం వుండడంవల్ల తీరా వీడు ఇప్పుడు 'భాభీ' ఎవర్రా చూపించరా అంటే తను అస్త్రసన్యాసం చెయ్యాలి.

"కూర్చో! ఏం ఇల్లా వచ్చింది బండి?"

"ఏముంటుంది? మనం ఐ. సి. యస్. పరీక్షకు కట్టాలని ఆజ్ఞ వచ్చింది. అందుకు బజారున పడ్డానురా వాత, పిత్త, శ్లేష్మప్రకృతుల ననుసరించి ప్రిపరేషన్సుకు."

నవ్వేడు యాజులు.

శ్యామల కప్పుతో కాఫీ పట్టుకుని సావిట్లోకి వచ్చింది. ఒళ్ళంతా కృతజ్ఞతతో యాజులు దాసోహం అనేసేడు పరువు నిలబెట్టినందుకు.

వచ్చినవాడు ఫల్గుణుండు అన్నట్లు శ్రీపతి "ఏమండీ? మిమ్మల్ని ఎక్కడో చూచినట్లు వుంది?" అన్నాడు.

ఓసారి ఎగాదిగా చూస్తూనే, ఈ హైరోడ్డు ప్రాపింగు ధోరణి చూచి "ఇప్పుడు ఎదురుగా చూస్తుంటే ఎక్కడో చూచేను అంటారేమిటి? దర్బారం అయితే కళ్ళజోడు పెట్టుకోకూడదూ?" శ్యామల చురుక్కుమనిపించింది.

ఉల్టాసీదా అయినట్లయ్యింది శ్రీపతికి. "అది కాదండి."

"ఏమిటండీ కానీది, యాగానీది. ఏదో మర్యాదగా వచ్చి, ఆయనతో మాట్లాడిపోక, మధ్యలో ఈ పిచ్చిపుల్లాయి ప్రశ్నలు వేస్తేనే కాని నోరు వూరుకోదా? లేకపోతే అది మీమీ పెద్దమనిషి తత్వాల్లో అలవాటైన నల్లమందా?"

హుషారు ఎక్కింది యాజులుకు, భలే వుజ్జీ ఈ శ్రీపతికని.

ఓటమి అంగీకరించే పరిస్థితివచ్చింది శ్రీపతికి. అది కప్పిపుచ్చుకుంటూనే, ఎక్కడ దొరికింది ఈ బ్రెంక డొంక అనుకుంటూనే, ఓసారి యాజులుపై పుసాను భూతిమాపులు పారేస్తూ "అసలు నిన్న మా వాళ్ళు రానందుకు కారణం చెప్పుదామని వచ్చేను, మళ్ళీ కలుస్తా" అంటూనే గుమ్మం దాటేడు.

"ఎవరండీ! ఈయన?"

"పి. డబ్ల్యు. డి. గుమాస్తా."

"స్నేహితుడా?"

"అవును."

"భలేవాళ్ళున్నారే స్నేహితులు మీకు."

"ఆ. స్వతహాగా మంచివాడే. కాని..."

"ఏముంది?"

"ఏమన్నారుగా. వాళ్ళవాళ్ళు..." ఇక చెప్పడానికి నోరు ఆడలేదు.

"మమ్మల్ని పరిచయం చేసుకుందామని, చూడాలని వుంటేరమ్మన్నారు కాబోలు మీరు. అంతేనా?"

ఏదో రగడలోకి-దిగింది మళ్ళీ అనుకుంటూ ఆవిడ వచ్చింది.

"ఈయనకు మనకూ ఏంచుట్టరికాలూ లేవు. పాతస్నేహితులమూ కాము. తగుదునమ్మా అని వూళ్ళో వున్న స్నేహితుల ఇండ్లకు వెళ్ళి, వాళ్ళందర్నీ మనల్ని చూడ్డానికి రమ్మని పిల్వడానికి హక్కు ఎక్కడనుండి వచ్చిందంట? ఏమండీ మాట్లాడరేం?"

"ఏమండీ! అల్లా ఎవరితో నేనా చెప్పేరా?" సజావుగా ఆవిడ.

"చెప్పకం ఏమిటి ఆయనెవరో వచ్చి, నిన్న నీ ఆహ్వానం మన్నించి మా వాళ్ళు రాలేనందుకు కారణం చెప్పడానికి తెల్లారకుండా నే వస్తే..."

"అల్లా పిల్వడం తప్పుకాదండీ? వచ్చినవాళ్ళు ఏవో కొంటెప్రశ్నలు వెయ్యడం. మీ ముఖం చూచి మేం అబద్ధాలు చెప్పడం ఎందుకూ? రేపు ఇవన్నీ కూడా మీ మెడకే చుట్టుకుంటాయి"

"అప్పుడేవచ్చి వారం దరిదాపు అవుతోంది. అల్లా మార్కులు వేయించుకుందామని వచ్చి ఇల్లా చుట్టాల్లా, సామెత చెప్పినట్లు, ఇక్కడ వుండిపోవడం మాకు ఎంతో చిన్నతనంగా వుంది. ఎన్నాళ్ళు వుంటాం? వుండినా ఏం బావుటుంది. ఈ ఘుణాక్షర న్యాయంగా కలసినవాళ్ళం! దయయుంచి మీరు శ్రమ అనుకోక, ఆపనికాస్తా చేసిపెడితే మీకు కృతజ్ఞులం. మీ పేరు మరిచిపోము."

"అదికాదు, మనల్ని ఎల్లాగా చేతిక్రిందవున్న వాళ్ళే అనుకొని, ఆలెక్చరరుగారు హైదరాబాదు నుండి రాలేదు—అని గోజా చెప్పడం నాకు కొంచెం అనుమానంగా నే వుంది."

"ఊరుకోవే నువ్వు."

"ఆ! ఇల్లా వూరుకుంటే ఉరేసుకోవలసివస్తుంది మనం. ఆపని చేస్తాను అని అటో ఇటో తేల్చక ఇల్లా నాన్చడంలో అర్థమేమిటి? కానీ ఆయన లేనుకుంటే ఆ పోలీసుల రిపోర్టు, ఇంటావిడ క్రాస్ ఎగ్జామినేషన్, స్నేహితుల భార్యలకు పిలుపు, ఆ ఎవత్తో దానితో పైకెండు ప్రంటు, ఈ అకాలపు వర్షాల్లా, ఎక్కడా చిన్నచిత్తు కాగితం దొరకని ఇంట్లోకి ఉన్న పత్రికలన్నీ రావడం, ఎవరెవరికో ఎక్స్‌ప్రెస్ డెలివరీ ఉత్తరాలు, వీట్ల అర్థం ఏమిటి? ఏదో పెద్ద ఎత్తుమీద నే వున్నాడు. ఏదో వయస్సులోవున్న వాళ్లు వచ్చేరు, మన చేతుల్లో పడ్డారు, ఇంకేముంది అనుకుంటున్నారేమో ఆయన."

"ఛా! అల్లా అనుకోవడం తప్పే. ఆయన అల్లాంటివారు కారు."

"వారు, చారు నాకేం అర్థం కావటం లేదు. ఏమైనా సరే! యాజులుగారూ, పిచ్చికళలు మాత్రం ప్రదర్శించేరంటే పప్పులుడకవు. మర్చిపోకండి. జాగ్రత్త" అంటూ అనేసి లోపలికి వెళ్ళిపోయింది.

సత్యం ఒప్పుకోవాలంటే శ్యామల చెప్పిన, ఏకరువుపెట్టిన విషయాలు నిజమే. అవన్నీ తను స్వయంగా, పరకీయంగా చేసినవే. జవాబుచెప్పి అవన్నీ పచ్చి అబద్ధాలు అని బుకాయించడానికి ధైర్యంలేదు. స్తబ్దతలోనే వుండిపోయేడు.

"అవ్వాళ ఇచ్చిన ఉత్తరాలు పోస్టు చేసేరా?"

"అప్పుడే."

"ఒక్కదానికి జవాబు రాలేదు. అదేమిటో అలావుంది."

దొరికింది అనుకుంటూ "మీరు శ్యామల చెప్పినవన్నీ వూకొట్టేరు ఒక్కటి అడుగుతా! ఆనాడు నా దగ్గరనుండి వివరాలు రాబట్టి మా మామగారికి ఉత్తరం వ్రాయడంలో అర్థమేమిటి?" యాజులు ఎదురుప్రశ్న.

గతుక్కుమంది మొదట్లో "అదా! ఆయన మీ మామగారా?" ఎంతో తెలియనట్లు అడిగింది.

తెల్లబోతూ "ఆ! మీకు తెలియదా?" అన్నాడు.

"లేదే! అయితే ఈ సారి తప్పకుండా వాళ్ళింటికి వెళ్ళి మీ పట్టమహిషిని చూచివస్తా లెండి."

కట్టుకున్న ఆశలన్నీ కుప్పకూలిపోయేయి. ఏడుపూ వచ్చింది. రుద్ధకంఠంతో నే,

"ఎందుకంత శ్రమ. ఇప్పుడు మీరు అగ్నిహోత్రావధానులు అవనక్కర్లేదు. ఆ శ్రమకూడా ఎందుకు?" అనేసేడు ఈసడింపుతో.

నవ్వేస్తే ఏమనుకుంటాడో అన్న గౌరవంతో లోపల్కి వచ్చేసింది. కోపంలోవుండి శ్యామల వంకాయల్ని చిత్రవధ చేసేస్తుంటే, జబ్బ పట్టుకుని, కళ్లల్లోకి చూచి, ఓసారి ఊపుతూ నవ్వేసింది ఆవిడ.

కలకం అయి యాజులు లెక్చరర్ ఇంటికి బయల్దేరేడు. ఆయన్ని పట్టుకుని, పేపర్లుచూచి. చెయ్యెత్తి సహాయంచేసి, విజయం వచ్చిందన్న భావనలో అడుగులు వేసూ వే వచ్చేడు. ఆదివారం కదా! తొందరేముంది, ఇంటికి వెళితే ఏ పేచీల్లోకి ఏవిధంగా దిగుతుందో అన్న పీకతో. ఏ శ్రీపతిఇంటికేనా వెళదామనుకున్నాడు. ఉదయం జరిగిన సంఘటన వెనక్కు తీసింది. రామారావు ఇంటికి వెళ్ళడం ఇష్టంలేదు. పైగా ఆ యింటివరసచూస్తే, మునిసిపాలిటీ చెత్తబండి చాలాశుభ్రంగా వుంటుందన్న భావన. వెళ్ళినా కూర్చోలేడు.

బజారున పడ్డాడు. అప్పుడే పట్నంనుండి వచ్చిన బుట్టలు విప్పుతూ, చామంతిపూలు, గులాబీపువ్వులు నీళ్ళల్లో వేసి దుకాణంలో సర్దుతున్నాడు సాయిబు. ఆవిడ, శ్యామలా ఎవరైనా, తనమీద ఏభావమున్నా, వాళ్ళకు కొనితీసుకువెళ్ళడంలో ఏం తప్పుంది. అంతగా అడిగితే పరీక్షలో ప్యాస్ అయినందుకు అన్న సమాధానం చెప్పెయ్యవచ్చు. అనుకుంటూ నే కొన్నాడు. అందులోనూ ఎక్కువగా నే.

ఇంటి మొగంపడుతున్నప్పుడే "యాజులూ నీజాతకంలో ఏదో పెద్ద నీచభంగరాజయోగం వుండితీరాలి,

ఎప్పుడూ నువ్వు అనుకునేవి ఒకటి; జరిగేవి మరొకటి. ఒక్కటికూడా నీకు సంతోషంగా సరిగ్గా, క్రమంగా జరగవు. అదే నీ కర్మ!" అని ఆత్మ ఎత్తిపొడిస్తే నిలువునా నీరైపోయేడు. కళ్లు చెమర్చేయి. సింహావలోకనం అదే నిజమనిపిస్తే, చేతిలో పువ్వులు ముళ్ళ కంపలా తట్టాయి

దిగతీతిలోనే అడుగులు వేసేడు. నడపీనుగు అయినట్లు మెట్లు ఎక్కేడు. సావిట్లో కుర్చీలో తన మామగారు ప్రక్కగా బొద్దుమీసాల్తో మరో పెద్ద మనిషి కూర్చునే వున్నారు. వాళ్ళను చూచేసరికి పై ప్రాణాలు పైనే పోయాయి.

క్రమ్ముకున్నట్లుగా, అణగిపోయిన ద్వేషం. కోపం విజృంభిస్తే "ఎందుకు వచ్చేరు!" అని నిలదీసి అడిగినట్లే అడిగేడు మామగార్ని.

"మీకు తెలియదా! అందుకే" అన్నాడు పెద్ద మనిషి.

"అందరికీ తెలుసు. ఆనాడు ఏనాటితో తుది నిర్ణయం అయిందో అప్పటినుండి మీకూ మాకూ సంబంధం లేదు. మీరు అడపా తడపా ఇల్లా మాగుమ్మం ఎక్కనక్కర్లేదు."

"అల్లా అంటే ఎల్లా చెప్పండి యాజులుగారూ! కన్నకడుపైరి, పైగా అది మాకళ్ళఎదుటే మనోవ్యథతో క్రుంగిపోతూవుంటే కడుపు చెరువై పోతోంది. దాని దుఃఖం చూడలేకుండా వున్నాం. కత్తికోతే మాకు.

"ఇవి చేతులుకావు కాళ్ళనుకోండి. పెద్దవాణ్ణి. ప్రాధేయపడుతున్నా. బావగారు అన్నట్లుగా ఆ రెండెకరాల పొలం ఇప్పుడే మీ పేర కట్నం బాకీ క్రింద వ్రాసి ఇస్తాము. వారికి క్షమార్పణలు చెప్పుకుంటాను. మీరు ఏంచెయ్యమంటే అది చెయ్యడానికి సిద్ధం. దాని సంసారం సరిదిద్దితే చాలు. నాకు ఏమీ కోర్కెలు లేవు." కళ్లు నీళ్లు కారుతుంటేనే చేతులు పట్టుకున్నాడు మామగారు.

"గతం మర్చిపోవాలి మీరు. తప్పు జరగడం సహజం అయినా, మీరు విజ్ఞానవంతులు లోకజ్ఞానం తెలిసివున్నవారు ఆ ముసలాయన మనస్సు కొంత సంతోషపెట్టవలసిన బాధ్యత మీ మీద వుంది." మధ్యలో పెద్దమనిషి.

"మా నాన్నగారు మొన్ననే మనోవర్తి దస్తావేజు వ్రాయించి సంతకం తీసుకున్నారు. తెగతెంపు చేసుకున్న తర్వాత ఇక అతికడం కష్టం కూడాను."

"అల్లా అనకండి. మీరు తలచుకుంటే అవన్నీ చాలా స్వల్పవిషయాలు. అల్లా, అవేస్తే అగ్నిసాక్షిగా ఉద్వాహం ఆడిన ఆమెకు పెద్ద అన్యాయం చేసినట్లే అవుతుంది, ఆమె తప్పు ఈషణ్మాత్రం ఏమీ లేకపోయినా." అన్నాడు పెద్దమనిషి.

"అల్లా అనడం నన్ను నిలువునా చీల్చినట్లే యాజులుగారూ! మళ్ళాఅడుగుతున్నా, ప్రార్థిస్తున్నా, క్షమించండి గతంను." చెంబేలు పడిపోయాడు.

"నా చేతుల్లో ఏమీ లేనేలేదు. మీరు ఏమైనా మాట్లాడదలచుకుంటే మా నాన్నగారితో సంప్రదించండి...ఇక మీరు వెళ్లవచ్చు."

యాజులు చచ్చేంతభయంలో ఈ పీడల్ని ఎల్లా వదుల్చుకోవాలా అన్న భావంలోనే ఆఖరుమాట చెప్పేడు; పైగా లోపలవాళ్ళిద్దరూ కూడా ఈ సంభాషణలు వినకుండా వుంటేనే మంచిది అన్న అభిప్రాయంతో. ఒకవేళ మధ్యలో వాళ్లువచ్చి కలగచేసుకుంటే, తను గంగిగెద్దు అయిపోయి తలాడించవలసి వస్తుంది. మాట్లాడనే లేకపోతాడు. నోరు మూగపోతుంది కూడాను.

"దస్తావేజు కూడా వ్రాయించి తెచ్చేం. మీరు కనికరించాలి. నేనూ కొంత వయస్సు మళ్లినవాణ్ణి. ప్రాధేయపడుతున్నా ఇవ్వాళే మీరు 'ఊ' అంటే రిజిస్టరీ చేయిస్తాం." పెద్దమనిషి.

"మీకు చెప్పగల్సింది చెప్పేను. ఇక వట్టి వాగ్వివాదాల్తో ప్రయోజనము లేదు. వెళ్ళండి. నా నిర్ణయం కూడా అదే." కొంతచురుగ్గా అన్నాడు యాజులు.

అంతవరకూ లోపలి గుమ్మంఅవతల, ఆవిడ, శ్యామల పొంచివింటున్నారని యాజులుక్కు తెలియదు. ఒక్కసారి ఇద్దరు తొంగిచూచేసరికి తెల్లబోయేడు. వాళ్ళిద్దరు ఈ వయస్సులోవున్న పిల్లల్ని చూచేసరికి డిల్లపోయేడు.

పెద్దమనిషి గొంతుక సవరించుకుంటూనే "గాండీ సుందరం గారూ! ఇంత మూర్ఖపు పట్టుదల మనిషుల్ని చూడ్డం ఇదే మొదటిసారి నా జీవితంలో. అయితే అబ్బాయిగారి కృష్ణలీలలు కన్పిస్తూనేవున్నాయి కా. ఇంకా ప్రాధేయపడ్డం మన మూర్ఖ్యం అవుతుంది." అంటూ కొంత చురుకు పాల్లోనే లేచేడు.

"అల్లా అనెయ్యడం భావ్యం కాదు. స్వయంగా నేను వచ్చేను. కాళ్ళు పట్టుకుని అడుగుతున్నా. కనికరించండి." మరీ ప్రాధేయపడ్డాడు మామగారు.

మాట్లాడలేదు యాజులు. గుండెల్లో గుర్రాలు పరుగెత్తుతున్నాయి, లోపల వీళ్ళిద్దరూ ఏంచేస్తారోఅని. పైగా ఝువ్వున తగిలింది ఆ పెద్దమనిషి ఈసడింపు. చేసేదికన్పించలేదు, నిప్పున్న కర్రలామసి అభసంతప్తు.

"మీ మమకారం అంతే. ఈయన ప్రభుత్వ ఉద్యోగి కదా! వాళ్ళవాళ్ళు అన్నట్లుగా ద్వితీయ వివాహం ఎట్లా చేసుకుంటాడో చూస్తాను! అటు ఉద్యోగానికి తిలోదకాలు ఇచ్చుకోవడం, ఇటు శ్రీకృష్ణజన్మస్థానం అలంకరించడం చేయించకపోతే నా పేరు..." తడబడ్డాడు పెద్దమనిషి.

ఎర్రగా కాల్చి వాత పెట్టినట్లయ్యింది. ఏమైనా అంటే, ఎదరతిరగబడి ఆ యింట్లో వున్న వాళ్ళకూ నీకూ ఏం సంబంధం అని వీధిని పెట్టేస్తాడేమో అన్న భయంలో క్రుంగిపోయేడు.

"అలాగే చెయ్యండి. ఇక బయటకు దయయుంచి వెళ్లుతారా?" లేచేడు.

ఆయనా తన పంచీ పట్టుకునీ, శోకమూర్తి అయితే, వెనకాల పెద్దమనిషి కళ్ళెర్రతో బయటపడ్డాగ.

'ఉస్సు' రంటూనే కుర్చీలో కూలపడ్డాడు. ఆలోచనల మీద అంతస్తులు ఒకటి తర్వాత ఒకటి క్రమ్ముకున్నాయి. భోజనానికి పిలుపు వచ్చేవరకూ.

ఎవ్వరూ మాట్లాడనే లేదు. ఏదో మరయంత్రాల్లా పనులు జరిగిపోతుంటే ఉండబటలేకనే "మీరు ప్యాసు అయ్యేరు." అన్నాడు ఆవిడవైపు తిరుగుతూ.

"మీ సహాయానికి కృతజ్ఞురాలిని." అంది ఆవిడ అతి ముక్తసరిగా.

"అయితే మనం రాత్రిబండికి వెళ్లిపోదాం."

యాజులుకు ఏమీతోచలేదు. ఎత్తిన చేతిలో పచ్చడీ అన్నం దింపేసి, దిగులుపడిపోయాడు.

"అల్లాగే!" అంది ఆవిడ సమాధానంగా.

"ఒక్క నా ప్రార్థన వుంది. ఏదో ఈ వారం నుండీ నా యిల్లు పావనం చేశారు. జీవితాంతం మరువు రాని క్రొత్త అనుభూతి కల్గచేశారు. మీ పనీ అయ్యింది. కనుక ఇంకో రెండురోజులు వుండి వెళ్ళండి అని కోరుతున్నా." ప్రాధేయత బాగా చూపించేడు.

ఆవిడ పులకిత అయింది.

శ్యామల కొత్త చిరాగ్గానే "అంత అల్లావుంటే, మీ ఇంటావిడని తెచ్చుకోకూడదు టండీ! ప్రొద్దుట ఆ ముసలాయిన్ని చూస్తే కడుపు దేవింది నాకు. దస్తావేజు కూడా వ్రాసి తెచ్చేరుకా మీ తృప్తికోరకూ." అంటించింది.

"అవును యాజులుగారు! ఏదో పెద్దలపట్టుదలల్లో ఆవిడని అలా నరకబాధపెట్టడం మంచిదికాదు. ఇంతకీ ఆవిడచేసిన తప్పు ఏమీ కన్పించటం లేనేలేదు. అల్లాంటప్పుడు..."

ఏమీ సమాధానం చెప్పలేదు. గబగబా పెరుగు పోసుకొని లేచిపోయాడు.

* * * *

వాళ్ళు తన కోర్కె మన్నించి ఉన్నందుకు సంబరపడ్డాడు యాజులు. ఈ రెండు రోజులూ ఆఫీసుకు శెలవు పెట్టేసేడు. ఏఏ చరిత్ర చిత్రాలు చూపిస్తే బావుంటుంది అనే మీమాంసలో రామప్పవెళితే మంచిదని, స్నేహితుడిద్వారా ఓ పెద్దమనిషి కారు పుచ్చుకున్నాడు. అక్కడ రామప్ప చెరువుగట్టుమీద కూర్చుని పిక్నిక్ కు సరిపోయే తినుబండారాలు, మిఠాయిలు, పళ్ళు అన్నీ కొనే యింటికివచ్చి సుప్పాముని చెపుతూ "త్వరగా బట్టలు వేసుకోండి" అని ఆదేశించాడు.

వంటప్రయత్నాలకు దిగుదామన్న సంసిద్ధతలో వున్న వాళ్ళిద్దరూ మొదట్లో తెల్లబోయినా, అనుకోనంతటి తొందర్లో తెమిలిపోయేరు. కారులో వున్న బండెడు సామాను చూచి ముసిముసిగా నవ్వుకున్నారు.

"అప్పుడు కాలేజీలో..." అంటూ మొదలు పెట్టి ఒక్కొక్కళ్ళే అనుభవాలు, మధ్యమధ్య ఛలోక్తులు కొసరుగా వేళాకోళాలుతో రామప్పగుడి చేరేరు. పాలంపేట బంగాళాలో సామానుదించుకొన్నారు.

ఈ కాకతీయశిల్పం, ఆ ప్రకృతి సృష్టి, కైగరి స్లూయీస్, ఆలయం మీద చెక్కిన శాస్త్రచిత్రాలు, అన్నీ వాళ్ళిద్దరు విస్తుపోయి చూస్తుంటే; యాజులుకు ఎంతో సంతోషమైంది. బూజంపంక్తిలాగే భోజనాలు చేసేరు. కాళ్ళు అరిగేటట్లు తిరిగేరు. ప్రశాంతయామిని; పచ్చటిచేలు ఓ పక్క, లోతు తెలియని అఖాతాలు రెండో పక్క, చుట్టూరా అడవులు, అడవుల్లో మృగాలు, ఇవన్నీకూడా ఎక్కువగా మైకం కల్పిస్తే, ఉద్రేకం చెందడు. ఏవోఏవో ఎక్కువగానే మాట్లాడేడు; ఉత్సాహం ఆపుకోలేకనే.

"ఏం మరదలూ! ఎల్లావుంది మా దేశం!" అన్నాడు శ్యామలవైపు తిరుగుతూ గర్వంతో.

అన్నివైపులనుండి ఒక్కమారు గాలి వచ్చి ఉక్కిరిబిక్కిరి అయినట్లయ్యింది శ్యామల ఈ చుట్టరికానికి; ఆతని పిలుపుకూ. తేరుకుంటూనే, పాడుపడ్డ గుడిశిఖర్ల నుండి అడవుల అంచుల్లోకి చూస్తున్న ఆవిడవైపు చూచి, "అయితే యాజులుగారికి శృంగారం కష్టం అన్నమాట." కసిరినట్లు అని "ఏమండోయి, మిమ్మల్నే ఏకుతున్నాడు ఆయన. నేను పనికి రానట" అంటూ కిలకిలమంది.

# కొమ్మ కొమ్మకో సన్నాయి!

ఆతను అన్నమాట విని, మైకంలో సరస్వతీ ఝరిని చూచినట్లయి, కదిలిపోయిన ఆవిడ,చుకున్నని ఓసారి యాజులు కళ్ళల్లోకి చూచింది. ఆయన చూపు నిలుపుకోలేకపోతే గుబగుబుని, ప్రస్తుతంలోకి వచ్చేసింది ఆవిడ.

"అయితే నన్ను పెళ్లాడి ఈ ములుగు అడవుల్లో వదిలేస్తారేమో!" అని వేళాకోళం చేసింది.

"విన్నారుకా! అసలు ఆవిడను చేసుకోడానికి భావగారూ మీకూ తాహతు వుందండీ? ఏ ఐ. ఏ. యస్. నో అయి, చున్యంనెగ్గర నుంచుని, వంగి వంగి సలాములు చేస్తే, అల్లాంటివాళ్ళను కనీసం కన్నుగోటు నుండి చూడ్డానికైనా ఒప్పుకుంటుందో లేదో ఆవిడ మరి?" శ్యామల వ్యాఖ్యానం.

'వచ్చేమురా భగవంతుడా! ఎందుకు నోరుజారింది! ముళ్ళకంపలో పడిపోయేను' అని తల వంచేసుకున్నాడు. ఎత్తి కుదేసినట్లయ్యింది పుట్టెడు ఆనందమున్నూ.

"పోనీలెండి. అంత అంతస్తులో లేను నేను. మిమ్మల్ని పెళ్లాడ్డానికి అభ్యంతరమూ లేదు నాకు. మీరా పర్వాలేదు! ఉద్యోగమూ మోతాదుగానే వుంది. ఆవిడ అన్నట్లు అడవుల్లో వదిలేసినా, రాత్రికి తిరిగి ఇంటికి వచ్చేస్తాను. ఆ భయంలేదు. పోనీ నన్ను ఏరుకోకూడదూ?" అతిప్రాధేయపడ్డట్లు. మోహం ఎక్కువైనట్లూ త్రిప్పుకుంటూ, స్వగంగా మురుపుతూ. దగ్గరావచ్చి పరపనే కూర్చుంది; భుజంమీద చెయ్యి వేసింది.

గాబరాపడి మొఖంమీద నీళ్లుచల్లాల్సినంత పరిస్థితి వచ్చింది యాజులుకు. దీనికి తోడు ఆవిడ విరగబడి నవ్వడం వుండుకు కారం జల్లినట్లుంది. పైగా శ్యామల ఇంకా జరుగుతూ "బావగారూ! ఇటు చూడండీ" అని సుతారంగా గదవ తనవైపు త్రిప్పుకుంది.

"నేను బాగోలేనా? మా నాన్న చేత మీకు ఇరవై వేలరొఖ్ఖం ఇప్పిస్తా. అక్కర్లేదంటే భూమి వ్రాయిస్తా. మాట్లాడరేం?"

ఇక లాభం లేదనుకున్నాడు. వళ్లంతా అప్పటికే ముచ్చెమటలు పోసేయి. లేచి రెండడుగులు వేసేడు. ఈ బ్రహ్మరాక్షసులకన్న ఆలీల్లీ ఎంతోమంచిది అనుకున్నాడు. ఎంత త్వరగా ఇంటికి చేరి, ట్రైను రైలు ఎక్కేనే అంత మంచిది అన్న తొందరా కలిగింది. కారు వైపు ఓసారి చూపులు సంజ్ఞాభావంగా త్రిప్పినా ఆవిడ చూడనట్లు, ఈడ ఇంకా మనకథ మంగళహారతిపాడే వరకు రానట్లూ వుండడంతో ఉస్సూరనిపోయేడు.

"పోనీ ఆలీల్లీకంటె బాగోలేనా?"అంది శ్యామల.

ఓరి అరిష్ట జాతకుడా! అన్నట్లయ్యింది ఆ ప్రశ్న.

"సమాధానం చెప్పకపోతే పోయిరి. అది నెలకు ఏభై రూపాయిలు తీసుకుంటుంటే నాకు ముప్ఫై ఇస్తే చాలు. దానితోనే తృప్తిపడుతా. ఆఖరుకు తాళికట్టకపోయినా సరే!"

పట్టపగ్గాలులేకుండా వచ్చే నవ్వు ఆవిడకు ఆగలేదు. కళ్ళమ్మట నీళ్ళు తిరిగేయి. ఎంత పమిట కొంగులో ఈ శ్యామల వేళాకోళంలో శాస్తి చేస్తోంది. నాతలు పెకుతోందన్న గుంభనవున్నా, ఆయనంతగా క్రుంగిపోవడం ఆర్ద్రి పరిచింది. ఏర్పడ్డ భావన, చేసిన ఉపకారం 'కృతజ్ఞత' అని అంటుంటే ఊగిపోయింది.

"చాల్లే శ్యామా!"

"ఉరుకో అక్కయ్యా! ఈ గురివిందగింజ బావగారు, మహామన్మధుడనుకుని, పట్టుమని పది రోజుల నుంచే నా ఎరగని నిన్ను ప్రేమించేస్తాడుట. పెళ్ళి చేసేసుకుంటాడుట. మరదలూ అని పిల్వడానికైనా మానవత్వపు హక్కు లేని ఈయన్ని అసలు ఆవిడే వదిలేసిందేమో!" అనీ అనేసింది.

అంగుళాని అర్ధాలు అతిగా వెళ్ళేయి. గుండెలు తూట్లు తూట్లు పడిపోయేయి. పైగా వాళ్ళు ఇద్దరూ అక్క చెల్లెళ్ళయ్యి కూడా కానట్లు నటించడం, తనకి తెలియకుండా ఆలీల్లీని మూడు చెరువుల నీళ్ళు త్రాగించి, పొలిమేరల్లో కాలెట్టనియ్యకుండా చేసి వుంటారన్న నిరూహ, ఇంకా వుంటే కొంపనిప్పే పెట్టేస్తారన్న భయం, పిరికితనం, ఆవేశాల్లోపడి, అగమ్యగోచరతలోకి దిగిపోయేడు యాజులు. ఇదంతా చూస్తే మొగలిపువ్వు తెచ్చి భార్యకు ఇచ్చిన బ్రహ్మాండుకూడా అయినట్లే తట్టింది; తన వరుస.

"ఇంక వెళ్దామా?" అంది ఆవిడలేస్తూనే.

"జీహుజూర్" అనేసేడు యాజులు ఒక్క మార్గం కల్గిస్తే తప్పుకోడానికి కృతజ్ఞత చూపిస్తూ.

కారు కదలనూ కదిలింది. ఈసారి యాజుల్ని కోరి ఆవిడ దగ్గరగా కూర్చోపెట్టుకుంది. ఎగుడు దిగుడులో ఊగుతూ జబ్బలు తగిలించింది.

ఈ స్వతంత్రహిందూదేశానికి ప్రెసిడెంటు పదవి వస్తే ఇల్లాంటివాళ్ళను ఉప్పుపాతర వేయిస్తే...అని మనస్సులో అనుకున్నాడు.

మల్లంపల్లి దాటేసరికి, ఆవిడ చెయ్యి తన మీదనే నిప్పిపోయింది. జారిపోతువాగు దాటేటప్పుడు భయంతో అన్నట్లు గదవ భుజంమీద ఆన్చింది. అత్త కూరు వెనక్కు వెళ్ళేసరికి పూర్తిగా ఆనుకుని కళ్ళే మూసుకుంది నిద్రలో.

అర్థంకాలేదు. జరిగిన సంఘటనలు గుండెల్ని ఇంకా స్వస్థానంలోకి చేర్చనే లేదు. ఆవుదుట తగ్గనే లేదు. అప్పుడే ఇదేమిటరా నాయనా! అని చీమలూ జెర్రెలూ పాకినట్లయ్యేడు. ఉక్కిరిబిక్కిరే అయ్యింది.

గుమ్మం దగ్గర ఆగేసరికి, ఏవి ఎట్లా పరిణమించినా, ఆవిడకు తనంటే ప్రేమ అని, అది వ్యక్తీకరించటంలేదని, ఇప్పుడు చూపించినవన్నీ నాందీప్రస్తావనలన్న తలంపు వదలుకోలేక పోయేడు. పురుగు అత్తరువు రాసుకున్నట్లే అయ్యింది.

ఇంకా సామాను దింపనేలేదు "అయ్యా! మిమ్మల్ని ఎప్పుడు ఇంటికి వస్తే అప్పుడు వెంటనే పెద్దదొరవారు దగ్గరుండి పట్టుకురమ్మన్నారు. సందకాలనుండి కూర్చున్నా."

వాళ్లిద్దరూ తెల్లబోయేరు ఏం ఉప్పెనమీద పడ్డానికి సిద్ధంగా వుందో అని.

"ఏమిటి! విశేషం?"

"ఏముంది. మధ్యాహ్నం నుంచి నిప్పులు కురిపించేస్తున్నాడు. చింతామణిగారిని మోత్తల్ చేసేడు. హెడ్‌గుమాస్తాను మీకు శెలవు ఎందుకు మంజూరు చేసేరని తిట్టేడు."

లోపల భయంవున్నా పైకి వాళ్ళేమనుకుంటారో అని "ఏం అమ్మగారు ఇంకా రాలేదా?"

నవ్వేడు వాడు "వస్తుం దనుకున్నాం కాని నే వచ్చేవరకూ రాలేదు సార్."

కారు డ్రైవర్ని పిల్చి కొత్తనన్ను ఆ బంగ్లా వరకూ దింపి నువ్వు వెళ్లవచ్చు అన్న ఆదేశాల్లో ఎక్కి కూర్చున్నాడు.

గజిబిజిగా తడితే, అగ్గిపెట్టె వెతుక్కుంటూ, లాంతర్లు ముట్టించేరు. ఎదురుగా రెండు ఉత్తరాలుపడి వున్నాయి. తనుకే అన్న కంగారులో ఎడ్రెస్‌లు చదివిల, ఆయనకే వుండడం నిరుత్సాహపరచింది.

"అక్కయ్యా! ఈ కవరు నరసారావుపేటనుండి; ఇది బెజవాడనుండి అనేసింది శ్యామల.

"ఏమిటే, ఏవీ ఇల్లా ఇయ్యి." అంటూ పుచ్చుకుని, నిరుకూ చేసుకుని, ఫ్రగున చింపేసింది. మడతలు విప్పి చదవడం ప్రారంభించింది.

"వెంకట్రామయ్యగారి కూతుళ్లిద్దరూ ప్రస్తుతం ఇక్కడలేరు. మద్రాస్ వెళ్ళేరని వార్త. ఈ మధ్యనే ముసలాయన, వార్ధక్యం వచ్చేస్తోందని, పెండ్లికొడుకుల వేట జోరుగానే చేస్తున్నాడు.

పెద్దమ్మాయిపేరు కస్తూరి. రెండో అమ్మాయి పేరు శ్యామల. ఇరువురిలోనూ పెద్దావిడ చాలా సౌమ్యురాలు. బుద్ధిమంతురాలు. ఇక రెండోది ఒట్టి చిలిపిరకం. చూడ్డానికి ఇద్దరూ బాగానే వుంటారు.

ఓవేళ నీవైపు ఎవరేనా మంచి సంబంధంవుంటే ఆయన గుమాస్తా మా ఇంటి ప్రక్కనే వున్నాడు. ఆయన ద్వారా కాస్త చెవిని పడేయిస్తాను..."

ఇక రెండోదాల్లో "కాలేజీలో చదువుకుంటున్నప్పుడు, కాస్తకాలుజారితే గుంటూరు మిషన్ ఆస్పత్రిలో ఏదో చేయించడం, వినువెంటే అలక పాన్పుమీద ర్యాలీ సైకిల్ ఇవ్వలేనందుకు కోపగించిన అల్లునకు ఘంటలో బి. యస్. ఏ. సైకిలు, హిండ్ రేడియోలు ఇచ్చి, ఆమెను కాపురానికి పంపడం జరిగింది.

నా వాకపుల్లో అప్పుడప్పుడు ఎవరో ఇద్దరమ్మాయిలు వీళ్ళింటికివచ్చి, పదేసిరోజులు వుండడం. జరుగుతూనే వుందిట. వాళ్ళిద్దరూ దూరాన్నుంచిచూస్తే కవలల్లా వుంటారు. ఒకామెపేరు కస్తూరిట. రెండో ఆమెపేరు తెలియనేలేదు.

వాళ్ళిద్దరికి ఇంకా పెళ్ళికాలేదని, మా మామగారు మాటల సందర్భంలో అన్నారు. నిర్దుష్టా ఫలానా వారి అమ్మాయిలని చెప్పలేక పోయేరు.

ప్రయత్నంచేసి, వాళ్ళ పుట్టుపూర్వోత్తరాలు, అంతగా కావాలంటే వాకపుచేస్తాను."

మిల మిలా మెరసిపోయేయి నాల్గు కళ్ళున్నూ. పై సంబోధన, క్రింది సంతకాలు చూస్తే ఈ ముసుగులో గుద్దులాటకు నవ్వూ వచ్చింది. యాజాలు పన్నాగమూ తేటతెల్లమైంది.

"వెన్నపూస నోట్లో నానవట్లుఉన్న ఈయన ముత్తంమీద దేవాంతకుడే! ఏమిటో అనుకున్నా" అని ఆశ్చర్యం కనపరచింది శ్యామల.

"మనమీద పెద్ద సి. ఐ. డి. తనం చేస్తున్నారన్నమాట" అంటూ ఫ్రరుఫ్రరున చింపేసింది ఉత్తరాలు ఆవిడ.

మొదట్లో ఆపనికి తెల్లబోయినా "అక్కయ్యా! పేపర్లన్నీ కొంటున్నాడు. ఏ తప్పిపోయిన, పారిపోయిన ప్రకటనలకోసం కాబోలు!" అంటూ నేగూట్లోవున్న కట్టలన్ని తిరగవెయ్యడం, తాక్కున ఆగిపోతూ "ఇదిగో దొరికిపోయేడు. ఇది చదవ్వే అక్కయ్యా" అనీ పేపరు ముందుకు త్రోసింది.

ఆవిడ చదివింది. "అయితే ఇంకో స్వయంవరం వుందన్నమాట."

"అవ్వాళ దీనికే కాబోలు ఎక్స్‌ప్రెస్ డెలివరీ ఉత్తరం వ్రాసేడు." దగ్గర లేనుకాబట్టి ఎడ్రస్ ఆనలేదు కాని కేరాఫ్ పోస్టుమాస్టరు అని వ్రాసినట్లుందే."

# కొమ్మ కొమ్మకో సన్నాయి!

"సరే కానియ్యి. ఇంతవరకూ వచ్చినతర్వాత ఇప్పుడు వెనక్కి తియ్యడం ఎందుకూ! ఆపని ఏమిటో తెముల్చుకునే వెళ్లడమో, వుండడమో చేద్దాం."

హుషారుగా అన్నా, శ్యామల పట్టుకుంది. "అక్కయ్యా! ఏమిటే ఆపని? ఉండడం, వెళ్లడం అంటున్నావేమిటే?" నిలదీసేసింది.

నాలిక్కొరుకున్నా ఆవిడకు ఏవిధంగా సమాధానం చెప్పాలో తెలియలేదు. మాట తప్పిద్దామనుకునే "శ్యామా! ఇంతవరకూ ఆయనకు నా పేరేమిటో చెప్పలేదే!"

బాగా తెల్లబోయింది. ఏదో నిగూఢం వుంది అక్కయ్యలో. అదే అర్థం కావటంలేదు. దాన్ని తెలుసుకుందామనుకున్నా, ఆ గాంభీర్యం, ముక్తసరి జవాబులు, ఏవిధంగానూ దోహదం చెయ్యకుండానే వున్నాయి. ఆపలేకపోతోంది.

"నువ్వు జబ్బుపడుకుని, చిన్నాయన ఇందుకూరి రాజుగారు వచ్చినప్పుడు వెనక్కి లాగకపోతే, వెళ్ళి ఈదవడా అదవడా వాయించివుందును సుమీ!"

"ఆయనే!" బెంబేలుపడిపోయినట్లే ఆవిడ తడబడింది.

అవ్యక్త ప్రేమ పెల్లుబికితే ఒక్క ఉదుటలో వెళ్ళి, అక్కయ్యచేతుల్లో వాలిపోయింది; వ్యక్తావ్యక్తంలో ఏదో తెలియని ప్రసన్నత, ఆర్ద్రత అపుకోలేక కళ్ళమ్మట నీళ్లు పెట్టుకుంది శ్యామల.

ముఖం చేతుల్లోకి తీసుకుని కళ్ళమ్మట నీళ్లు తుడుస్తూ, అంతవరకూ పైకితియ్యని మాంగళ్యం తీసి చూపిస్తూ "ఆయనే నా పసుపుకుంకుమా?" అని బావురుమంది కస్తూరి.

ఇద్దరి కన్నీళ్లు కారి, వెలుగులో వన్నెలై, ఇంద్రధనస్సుల్లా మారేయి. ఒకళ్ల కౌగిట్లో ఒకళ్లు కాలంలేకుండానే ఉండిపోయేరు.

* * *

గాలివాన వెలిసినతర్వాత వచ్చే ప్రశాంతిలా, యాజులు ఎన్ని లేవుడీలు చెయ్యబడ్డా, కౌగిలో ఆవిడ తన సర్వస్వం నువ్వేఅన్నట్లు తనమీద గవద ఆనుస్తూ, కుదుపులకు కితకితలు పెట్టినట్లుగా యౌవనంలోని బిగి చేస్తుంటే, నోటితో అనలేని ప్రేమ, శరీరంతో అందిచ్చేసింది అన్న విషయం, పీయూషపానం చేసినట్లే అయ్యింది. శరీరంలో కణకణం ఏదో క్రొత్త తేజస్సును బలం తెచ్చుకున్నట్లు, వరవరాలు మధురతలో గానం చేసినట్లు, పూర్తిగా తను గాలిలో ఎగిరిపోతున్నట్లుగాను అనుభూతి పొందేడు, యాజులు.

దాంతో, ఆ కౌగిలో చిన్నగా తను చెయ్యి నడుంమీద వేసి ఒత్తుకోలేనంతకు, భయపడి తనవేపు ముగ్గినప్పుడు కొంచెం గట్టిగా తనవైపు లాక్కోనందుకు, ఏదో చీకట్లో తన పెదిమలు ఆమె బుగ్గమీదనుండి మెత్రతిప్పి వంకలో రాసుకోనందుకు, ఇప్పుడు చింతపడ్డాడు. ఎంతగా వగర్చినా, మళ్ళీ అది పునఃఅవదు అన్న తలంపులో తల్లడిల్లిపోయేడు. తన్ని తానే తిట్టుకున్నాడు పిరికితనానికి. గత్యాగత్యా తను ఆ శూరత్వం లేకపోయినా, ఈసారి తప్పకుండా ఆవిడే పాఠం చెప్పేస్తుంది అని పులికిపోయేడు.

ఈ జరిగిన విషయంతో ఆవిడ మనస్సులో పూర్తిగా నిండిపోతే, రెండురోజులు కాదు రెండు నెలలు వుంటారు వాళ్ళు తనదగ్గరఅని మురిసిపోయేడు.

ఇక రేపో, మాపో, నవోఢ సిగ్గు ఒలికిస్తూ చామంతిపూలు జడతో, అత్తరువు వాసనల్తో, తన దగ్గరగా వస్తూ, కళ్ళల్లోకి చూడలేని సిగ్గు చూపుల్తో బొటనవ్రేలు వ్రాస్తూవుంటే, అప్పుడు తను, తను... ...ఎల్లా తలంచుకోవాలో తికమక అయింది.

"అయ్యా! దిగండి" అనే వరకూ ప్రకృతిలో పడనేలేదు. వెంటనే పెద్దదొర, ఆయన ధుమారింపు, వెర్రికోపం వగైరాలన్నీ గాలి నింపుకుంటే, గుండెల స్పందనంతో దిగి లోపల్కి వెళ్ళేడు.

వరండా. చికట్సు. గోడకు మాక్‌లైటు. పైపు కాలుస్తూ దొర. ఆయన ప్రక్కగానే పంచికట్టు, ఓ బనీను, పైన తువ్వాలుతో ఇంకో ఆయన. ఆయన్ను చూడ్డంతోనే 'ఈ దేశంవాడు కాడు' అనీ అనిపించింది.

"ఓ! యాజూలూ! కమాన్!" అన్నాడు దొర నవ్వుతూ. 'కూర్చో.'

ఏ కొండ విరిగి నెత్తిన పడుతుందో అన్న భయం కొంచెం సడలినా, భృత్యభావంలోనే నుంచుని పోయేడు వంగి.

"దిస్ కాల్ ఈజ్ నాట్ అఫీషియల్. కూర్చో. వారు నా స్నేహితులు. కాకినాడలో సబ్ జడ్జీ. పేరు సీతారామారావు గారు."

వినయంగానే నమస్కారం చేసేడు. చిరునవ్వు నవ్వుతూనే ఆయన స్వీకరించేడు; ఆఫీసరు హుందాలో.

"వారు రెండురోజులు సెలవుపెట్టి వచ్చేరు. నిన్ను చూద్దామని."

"నన్నా!" పూర్ణంగా తెల్లబోయేడు. కుదురుకునే; అయితే ఈయనకూ ఓ కూతురుంది కాబోలు, లేకపోతే అంత పెద్దమనిషి నన్ను చూడ్డం ఏమిటి? ఎక్కడ వున్న కాకినాడ? ఎక్కడ వుంది ఈ పూరూ అని అనుకున్నా, మీ నాన్నగారు వాళ్ళు ఆ దరిదాపుల్లోనే వున్నారుటే అన్న వ్యాఖ్య చెలరేగింది.

తలవెంట్రుకలు కాస్త నెరసివుంటే, పింఛనీ పుచ్చుకునే కాలం దగ్గరలోనే వుందికాబోలు. చవగ్గా వస్తాయని ఈ మూలుగు తాలూకాలో భూము లేమైనా కొందామనుకున్నాడేమో అన్న సందేహమూ వచ్చింది. ఆయనా ఊరుకోకుండా నిశితంగా నఖ శిఖ పర్యంతం తన్ని పరీక్షించడం, ఫర్వాలేదు అన్న నిబ్బరంలో తలూపుతూ దొరవైపు చూడ్డం చూస్తే, కంగారుపడ్డాడు. ఏ నాన్నగారితో చెబితే, ముందు పిల్లాడిని చూచుకోండి. నచ్చితే తక్కిన విషయాలు మాట్లాడుకుందాం అన్నట్లున్నది ఈ సింహావలోకనం అనుకుని, అవ్యక్తంగా ఓ సారి నిటార్గా నుంచుని ఫోటో తీయించుకునే దశలోకి వెళ్ళింది యాజులు శరీరం.

"మా ఆఫీసులో మంచి బుద్ధిమంతుడు చురుకైన వాడు ఈతను ఒకడే." దొర ప్రశంస చెప్పి, కుల ప్రతిష్ఠలు చెప్పగా, సిల్కుకోటు తొడుక్కున్నట్లయ్యింది.

"నీకు పెళ్ళయిందా?" ఆయన ప్రశ్న.

తికమకపెటినా, యాజులుకు అబద్ధం చెపితేనే కాని తప్పేమార్గం లేదన్న ఊపులో "నా కాళ్ళమీద నేను ఇంకా నుంచోలేక పోతున్నాను అప్పుడే..." అని నసికేసేడు. పైగా అందులో ఉన్న ద్వంద్వార్థాలకు తనే మురిసిన్నీ పోయేడూ.

"మీ నాన్నగారిని ఎరుగుదును. మంచి పలుకుబడివున్నవారు ఆ తాలూకాలో." దొరతోనా, తనతోనా అన్నది అర్థం కాలేదు.

"నీ ఉత్తరం అందింది" చటుక్కున ఆయన అన్నాడు. తెల్లబోయేడు యాజులు. దొర, ఆయనా కూడా నవ్వుకున్నారు.

"అదనోయ్! పత్రికవాళ్ళు నాకు డైరెక్టు చేసేరు" రామాయణం అంతా వినక్కర్లేదు అనుకున్నా, యాజులు తన ఎగుడుదిగుడు ఊహాలకు మాత్రం సిగ్గుపడిపోయేడు.

"ఆ అమ్మాయి ఇంకా మీ ఇంట్లోనే వుందా?" తలూపేడు. "ఆవిడ స్నేహితురాలుట. ఇంకో ఆవిడ కూడా వచ్చింది."

"స్నేహితురాలా!" ఆయనకి అర్థం కావటం లేదు.

"అవును. ఆవిడ వచ్చిన రెండోరోజునే వచ్చింది."

"మరి వాళ్ళెవరితో ఏమైనా వాకపు చేసేవా?"

"ప్రయత్నించే, కాని అంతుచిక్కటం లేదు."

"అలాంటప్పుడు పోలీసులకు రిపోర్టు ఇవ్వవలసింది. లేకపోతే నిమీద కేస్ పెట్టవచ్చు."

చికాకు కల్గించింది యాజుల్కి. నల్లగౌనులు తొడుక్కుని, విగ్గుపెట్టుకుంటూ అక్కడ ఆ కాకినాడ కోర్టులో, దోషిని ప్రశ్నించినట్లు, వివరించినట్లు ఇప్పుడు తన్ని చెయ్యడం, కోపం తెప్పించింది. అయినా తమాయించుకున్నాడు.

"ఆ రిపోర్టూ ఇచ్చేను." నెమ్మదిగా జవాబు చెప్పినా, గుండెల్లోంచి, ఇచ్చిన సన్నివేశమూ, ఇప్పించిన వ్యక్తులు, వ్రాసిన విధానమూ సజావుగా లేదు. అల్లా చేసినందుకు నీకు ఇండియన్ కాన్‌స్టిట్యూషన్‌లో ఫండమెంటల్ రైట్సునే ఉల్లంఘించేవు అన్న వణుకు పుట్టింది. 'దేవుడా ఆయన మరింత చిత్రవధ ఆ విషయంలో చెయ్యకుండా వుంటే కొబ్బరికాయ కొడతాను' అని మొక్కుకున్నాడు.

"చూచేరా! మా యాజులు తెలివితేటలు, దూరపు ఆలోచనా" అని ఆఫీసరుగారు కళ్లు మిలమిల్లాడించుకుంటూ ఆయనవైపు చూచేడు.

"పత్రికలో ఇచ్చినట్లుగా ఆవిడ ఆకారం పోలికలు సరిపోయేయా?"

"చిత్తం" అన్నాడు.

సమస్యే అయినట్లయ్యింది ఆయనకు. కాస్సేపు మాట్లాడలేక పోయేడు. ముందు ఏవిధంగా దారి తొక్కాలా అన్నదే నిర్ణయం కాలేనట్టు ఉన్నాయి చూపులు.

"మీ ఇంటికే ఏకటాకీని రావడానికి కారణం?"

"వీడెక్కడ దాపురించేడురా తండ్రీ నాపాలిట" అన్నట్లుగ దొరవైపు ఓసారి నమ్రతతో చూస్తే, ఆయనా గ్రహించేసినట్లుగానే తలపంకిస్తూ "ఆయన కూతురు ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయింది. సుబ్బారావుగారి కొడుక్కి ఇద్దామనుకుని తాంబూలాల వరకూ వస్తే, తనకి అక్కర్లేదని, తప్పించుకోడానికే చేసింది. ఆయన..." ఇక చెప్పనక్కర లేదన్నట్లు ఆగిపోయేడు. ధైర్యం వచ్చింది.

"పరీక్షకు కూర్చున్నా. ఇంగ్లీషులో కొంత లోగసానుగా వున్నట్లువుంది. వెంకట్రామయ్యగారు పంపేరు. మీరు సహాయం చెయ్యగలరూ అని..."

"ఎవరా వెంకట్రామయ్యగారు?"

"ఆయన బెజవాడలో మంచి పేరు మోసిన క్రిమినల్ లాయరు అని తెలిసిందండి."

"మరి మార్కులు వేయించేవా?" దొరకళ్ళల్లో చిలిపితనం కన్పించింది.

తలవంచుకుంటూనే, వినబడీ వినపడనట్లు "చిత్తం" అనేసేడు.

ఉత్సాహంలో ఒక్కసారి "యు ఎపియర్ టు బి ఎ టెరిబుల్ ఫెల్లో" అన్నాడు దొర.

ఆయన వినిపించుకోనట్లే "నా పోలిక లేమైనా ఆ అమ్మాయిలో ఉన్నాయా?" అందులో ఆ వ్యక్తి హృదయంలో జరిగే యుద్ధం బాగా స్ఫుటమైంది.

చాలా ఇంటరెస్టెడ్‌గా వున్నట్లు, పైపులో మళ్లీ పొగాకు నింపి, వెలిగించి గుమ్మని వదిలేసేడు దొర. "అదా!" అంటూనే లేచి హుషారుగా గోడ మీద స్విచ్ వేసేడు. ఫళ్ళున తెల్లారినట్లు వరండా వెలిగిపోయింది.

పదిరోజులు క్యాంపుల సాహచర్యం, అంత రాత్రంలో కొత్త చిలిపితనాన్ని ప్రోత్సహిస్తే ఈయన్ని, మొఖం అట్టు తిప్పండి, ఇటో, నేరుగానో, కళ్ళు కదల్పండి, గలిపేస్కోండి అని కొత్త బజాయిద్దామన్న తలంపు మెసిలింది. నోటి చివరవరకూ వచ్చిన ప్రశ్నలు సంబాళించుకుంటూనే "చాలా మటుకు వున్నాయనుకుంటా" అని ఆఫీసుల్లో పార్టీలకు ఇచ్చే పైమాయిషు నామాలా సమాధానం ఇచ్చేడు.

గట్టిగా నవ్వేసేడు దొర.

సిగ్గు వచ్చింది యాజులుకి. ఆయన కూడా చిరునవ్వు పైకెళ్ళి గక్కకుండా ఉండలేకపోయేడు.

"థాంక్స్. నువ్వు వెళ్ళవోయ్." అన్నాడు ఆయన. దొర తలూపేడు.

లేచి, నమస్కారాలు చేస్తూనే, మెట్టుదగ్గరకు వచ్చేటప్పటికి "పేరేమని చెప్పిందోయ్" అడిగేడు ఆయన.

"ఇంతవరకూ చెప్పలేదండి"

"ఆ!" అన్న ఆశ్చర్యం ఆయనా, "ఈజ్ ఇట్ ట్రూ" అని దొర నోరు వెళ్లబెట్టేసేరు.

మెట్లుదిగి, పోర్టికోలోకి వచ్చేసరికి యాజులుకి "వెరీ లకీ ఫెలో" అన్న దొరమాటలు వినపడితే, మేఘాల మీదనే ఎగిరిపోయినట్లయ్యింది. గబగబా అడుగులు వేసేడు. అర్ధరూపాయి ఇచ్చి రిక్షా కుదుర్చుకున్నాడు నేరుగా చేరగానే కంటూ. ఇల్లాంటి సమయంలో ఒకప్పటి ట్రాగితేనే కాని వుండలేనట్లు టీహోటల్లో మైమరపులో మల్లిపొదలైన తలంపుల్ని 'ఖుదేరహో' అన్నట్టుగానే జోసఫ్ వచ్చి "ఏమండీ! మా ఇంటికి అసలే రావడం మానేసేరు. పోలీసు సబ్ ఇనస్పెక్టరు రేపు వాళ్ళిద్దర్నీ అరస్టు చేస్తానన్నాడు, మీకు తెలుసా?" అంటూనే ఇదిగామాస్తు చతికలపడ్డాడు.

ఆవిడ రావడంతో లిల్లీకి సమాధికట్టేసేను అనుకుని తృప్తిపడ్డ యాజులుకి, దాని తమ్ముడు ఇప్పుడు ఇల్లా చెప్పడం, కడుపు దేవేసినట్లయ్యింది. మాట్లాడకుండానే టీ వాడికీ తెప్పించేడు.

కృతజ్ఞత అన్నట్లుగా "అక్కయ్య మీకోసం ఏ రోజూ కాలోజే ఎదురుచూస్తోంది. నిన్న విడ్చేసింది కూడాను. ఆయన్ని చూడలేందే వుండలేనని గోలెట్టేస్తే అమ్మకూడా బాధపడిపోయింది. 'వస్తారు! కొత్త వాళ్లపని అమీతూమీ తేలిపోయేవరకూ రారు. వస్తే ప్రమాదం కూడాను' అని నేనింతో చెపితే, ఇవ్వాళ కొత్త అన్నం తింది."

వింటుంటే - ఏదో కార్యరీత్యా వచ్చి ప్రాధేయపడ్డ ఆవిడ చూటూ తనే ఓ బ్రహ్మచెముడు డొంక అల్లి, దానికి నీరుపోసి. ఎరువువేసి పెద్ద జీమూతంలా చేయగా. ఆఖరుకు అది బ్రహ్మరంక డొంకలా ప్రాకితే, మానవ తోటమాలి పరిస్థితిలో, అందులోంచి ఎల్లా పైకి తియ్యాలి. ఈ డొంకని ఏ విధంగా మంటపెట్టాలి అన్నది తన చేతులు దాటిన విషయంలా తట్టింది. తను ఎంత మూర్ఖుడు, మూఢుడూ అని అనుకున్నా, చేతులు కాలిం తర్వాత ఆకులు పట్టుకోవడం వట్టి అవుతోంది. మొదటనుండీ తన జాతకమే అంత. హృదయం లోలోపల లోలాడిపోయింది.

"చిన్నాయన కూడా అన్నాడు. ఆయనకు పెద్దదొరదగ్గర మంచి పలుకుబడి. గౌరవం ఉందని, మాటనికొర్సయిన మనిషి అని. చేసిన వాగ్దానం నిలుపుకుంటూనని. తప్పకుండా నిన్ను పెళ్ళి చేసుకుంటాడని." జోసెఫ్ వదల్లేదు.

ఎర్రతేలు కుట్టినట్లయ్యింది. ఏమీ జవాబు చెప్పలేని శూన్యంలోనే లేచేడు.

"క్రొత్తగా సర్కస్ వచ్చిందండి. చాలా బాగా వుందట. వెళదామా?" జోసెఫ్ వెంటపడ్డాడు. యాజులుకు తెలుసు, తను కళ్లపడితే తృణమో ఫణమో చేతిలో పడేస్తేనే కాని వదలడని. జేబులోంచి రెండు రూపాయల కాగితంతీసి చేతులో పెట్టి "ఇప్పుడే ఆఫీసునుండి వస్తున్నాను. నువ్వు వెళ్ళు" అనేసి అడ్డబడ్డాడు ఇంటికి.

'కింకర్తవ్యం' ఇదే ప్రశ్న అడుగడుక్కి వెయ్యి కంఠాల స్వరమేళంతో నే ఎదురయ్యింది; చెవులు గింగుర్లెత్తేట్లు హోరెత్తింది. ఒళ్ళంతా చెమటలే పోసేయి. ఓపక్క ఆవిడ, తన ఆరాధనున్నూ; రెండోపక్క పోలీసులు, లిల్లీ, దాని పరివారం, పెద్దదొర, ఆయనా, మామగారు, బొద్దు మీసాలు, శ్రీపతి, రామారావు, వాళ్ళ సంసారాలు, ఇంటావిడ, వెంకట్రామయ్య, ఆఖరుకు తన తండ్రి, వదిలిపెట్టిన పెళ్ళాం, ఆ తెలియని వార్తలు అందజేసే వ్యక్తులు, ఒక్కొక్కళ్ళే ఎదురై తన నరనరాన్ని కణకణాన్ని చిత్రవధ చేసేట్లుగా, వాడికత్తులు పుచ్చుకుని నుంచున్నట్లయ్యింది. ఏదో వైతరిణీనది దాటాలని అన్నది, ఇప్పుడే కాళ్ళముందే ఉన్నట్లయితే, నిస్సహాయతలో నిష్ప్రహాల్లో, భయంలో, పిరికితనంలో, యాజులు నట్టనడిసముద్రంలోని నావే అయిపోయేడు.

ఏవిధంగాను చుక్కాని దొరికేటట్టు కన్పించలేదు. తను ఓటమిని అంగీకరించి ఆద్యంతాలు ఆవిడకు చెప్పి 'త్వమేవ శరణం మమ' అంటే బాగుండు అన్న ఒక్క ఎండమావుల ఆశతప్ప. అదే బీజం మొలక వృక్షం అయితే, ధైర్యం వచ్చింది; బలం వచ్చినట్లయింది. అడుగులు చురుగ్గానే పడ్డాయి.

ఎదురుగా ఆవిడే తలుపుతీసి, ప్రక్కగా నిలబడి వుంటే, పూర్ణంగా కళ్ళల్లోకి చూచి ఆ ఆర్ద్రత ప్రతిబింబంలోకి మనస్సునింపుకుని కుర్చీలో కూలబడి పోయేడు. లైటు టేబిలు మీదపెట్టి, దగ్గరగా వస్తూనే "ఏమైంది? దొర ఏమైనా అన్నాడా? ఏం జరిగింది? తిట్టేడా? సస్పెండు చేసేడా? చెప్పండి?" ఒక దాని వెనుక ఒకటి ప్రశ్నలు కురిపించేసింది; చూపులు తప్ప మరొకటిలేని యాజుల్ని చూసి కంగారూ పడింది.

"శ్యామూ కాస్త కాఫీ ఫ్లాస్కులోది తీసుకురా బావగారికి" అనేసింది ఒక్క కేకలో. అంగులోని స్వరం సప్తలోకాలు ఆహుతైనట్టే పొంగింది. పమిట చెంగుతో మొఖం తుడుస్తూనే, ప్రేమ కట్టలు తెగి వరదలైనట్టే "ఏం జరిగిందో చెప్పరూ? నా గురించైనా చెప్పరూ?" దేహీఅన్న ప్రార్థేయత అన్న పూర్ణ ప్రతవులాగే వుంది.

కదలిపోయేడు; కరిగిపోయేడు; ఈ ఏకాకి జీవితంలో జ్యోతులు వెలిగించిన ఆవిడ ఎదురుగా ఎలుగెత్తి తనకోసం, తనశాన్నతి, భావి, సర్వస్వంకోసం, చేతులుచాచి, హృదయానికి హత్తుకున్నట్లు వుంటే. అప్రయత్నంగానే హృదయం ఆర్ద్రపడిపోయి కన్నీళ్ళు కార్చేయి యాజుల్కి. నిలువు దోపిడీ అయినట్టే ఆవిడ హృదయాంతరంలోని రక్తనాళాలు పొంగిపోతూంటే, కుర్చీ చెయ్యిమీద తలపెట్టేసి బావురు మనిపోయింది.

హృదయం ఒక్కసారి తూర్పారబట్టినట్టే జబ్బలు పట్టుకుని లేవనెత్తి, తనవైపు లాక్కున్నాడు యాజులు. కరిగిపోయింది ఆశ్లేషంలో ఆవిడ. ఆ క్షణంలో ఇరువురూ లేనట్టే అయ్యేరు.

కంగారుగా వస్తున్న శ్యామల అలికిడి విని దూర దూరం అయిపోయేరు. ఇచ్చిన కాఫీ కళ్లు తుడుచుకుని చప్పరించేటప్పటికి, ఆవిడ మెళ్లో మంగళసూత్రాలు కనపడితే, 'శ్రీకృష్ణ జన్మస్థానం తప్పదురా నాయినా' అనికళవరపడిపోయి, 'మీకు పెళ్లయ్యిందా?' అన్నాడు.

ఒక్క దూకులో ఆవిడ లోపల్కి వెళ్లిపోయింది.

శ్యామల ఫక్కున నవ్వేస్తూనే "ఇంత వెర్రి బావగారు ప్రపంచంలో ఎల్లా బ్రతుకుతారండీ? ఇప్పటి కాలపు నాల సంగతి తెలియక అవి మంగళసూత్రాలు అనుకుంటున్నారా!" అంటూ హేళనలోకి దిగింది.

"అయితే...అవి"

"వాట్లపేరు టి. వి. నెక్ లేసు లండీ!"

"నిజంగా? అంటే?"

తల ఆమూలనుండి ఈ మూలకు త్రిప్పుతూ "భలే వాళ్లు, కాఫీ త్రాగండి, చచ్చేంత నిద్దర వస్తోందినాకు" అంటూనే తుర్రుమంది. టి. వి. అంటే అర్థమేకాలేదు ఆ రాత్రల్లా పాడి కళ్ళయినా యాజులుకు.

* * * *

"ఇంకా లేవలేదండీ! లోపలికి వచ్చి కూర్చోండి" అని శ్యామల గొంతుక వినపడితే "ఎంత మొద్దునిద్రబోయేను అనుకుంటూనే, వళ్లు విరుచుకుని, దొడ్లోకి వెళ్ళేడు; కాలకృత్యాలకు.

వంటింటిలో అడుగుపెట్టేసరికే ఆవిడ "గుడ్ మార్నింగ్, రాత్రి బాగా నిద్రపోయేరనుకుంటా" అని నవ్వుతూ సిగ్గుదొంతర్లమధ్య అడిగింది.

బద్ధకం అంతా పటాపంచలైనట్టే హుషారు వచ్చేసింది. పొట్లపువ్వే అయి "ఏమండీ! టి. వి. అంటే ఏమిటి?" అన్నాడు.

"దాన్నే అడగకండి. మీ ఆఫీసు సైన్యం అంతా వచ్చినట్లుంది. పరామర్శకా?"

"ఎందుకనీ?"

"మరి రాత్రి ఏదో జరిగిందిగా! ఎంత అడిగినా చెప్పకుండా గునిసేరు. దానికే."

నవ్వేసేడు, ఆ ఓపెన్ కోపం రెండో పెడ ఏమిటో తెలియని మాధుర్యంలో అన్నమాటల్కి.

శ్యామల వస్తూనే "ఓహో! బావగారు పొద్దుటే నవ్వేస్తున్నారు. మరి రాత్రి మర్చిపోయేరా! నడవండి అక్కడ రథులు, అతిరథులు, మహారథులు తహతహలాడిపోతున్నారు తమదర్శనానికి."

"కాఫీలు ఇవ్వాలా?" ఆవిడ.

"తమ దయా! మా ప్రాప్తిన్నీ" అంటూనే గుమ్మందాటేడు. రహస్యం అన్నట్టు టి. వి. అంటే అడిగేరేమన్నా అని చెప్పేసింది కస్తూరి. దాంతో గుసగుసలూ, పాడేలు వెయ్యడం, పంచదార కలపడం జరిగేయి. నవ్వులూ పొంగేయి పాలల్లా.

ఎదురుగా, పెద్దగుమాస్తా, చింతామణి, తోడు అన్నట్టు శ్రీపతి, రామారావు ప్రభృతులు. అంతమందినీ కట్టకట్టుకు రావడం ఆశ్చర్య పరచింది.

"ఏం యాజులూ! ఈ ముసలివాడు ఏం కాగితాలైనా సంతకాలు పెట్టాలా? నిన్నొకటి అయ్యింది ఆచండశాసనుడి చేతుల్లో" అడిగేడు పెద్ద గుమాస్తా, వయస్సు మళ్ళిన స్వరం వణుకుతుంటే.

"ఏం లేదు. అంతా సవ్యంగానే వెళ్ళింది." అంటూనే "ఏదో ప్రవేటు పనికే పిల్చేడు" అని తేల్చేసేడు.

"నిన్నటినుంచీ పిసుక్కు చచ్చిపోతున్నాం, ఆ వరస చూస్తే నిన్నుకూడా ఏదో చేసేట్టేవుంటే హెడ్ గుమాస్తాగారు రాత్రల్లా నిద్రపోలేదు. నాకు జాగారమే" అన్నాడు చింతామణి.

తర్వాత ఏవో ఏవో కబుర్లు కాఫీకప్పులమీద వెళ్ళేయి. వర్ణనలూ జరిగేయి. వెళ్ళుతాం అని లేస్తున్నప్పుడే హెడ్ గుమాస్తా "యాజులూ! ఇన్నాళ్ళయి సంసారం పెట్టేసా, కాస్త అమ్మాయి వచ్చిందని చెప్పేవు కావేం." అంటూనే లోపల్కి వెళ్ళిపోయేడు. సిమెంటు వేసేసట్టుగా యాజులు కుర్చీకే అతుక్కు పోయేడు మిడిగుడ్లు వేసుకుని.

# కొమ్మ కొమ్మకో సన్నాయి!

"అమ్మాయీ" ఆయన పిలుపు.

బిలబిలా ఇద్దరూ వచ్చేసేరు. వయస్సుకు నమస్కారం చేసేసేరు. ఎవరు యాజులు భార్య. అడగలేని అభిజాత్యంలో "నేనూ ఆయాజులూ ఒక్క ఆఫీసులో నే పనిచేస్తాం అమ్మా!" అన్నాడు. మంచిదంటూ నే సందిగ్ధపు సవాలు మొఖంమీద ప్రతిబింబించుకుంటూ నే వీధిలోనూ పడ్డారు.

"ఏమండి! శ్రీపతిగారూ, ముసలివాణ్ణి. పైగా చత్వారం. ఈ కాలపు పోకడలు నాకేం తెలుసూ. ఒకే వయస్సు, ఒకే ముఖాలు ఒకే విధంగా బట్టల తీరు. ఇద్దరున్నారు. ఇద్దరి మెళ్ళోను నల్లపూసలు కాని నానుతాడు కాని కన్పించనే లేదు. అందులో ఎవరండి యాజులు భార్య?"

తెలియని చింతామణి, అందులో సగంగా శ్రీపతి రామారావులు కూడా తలగోక్కున్నారు, ఏం చెప్పాలా అని. అంచనా వేసినా, శ్రీపతికి ఎదుటి దెబ్బ తగుల్తుందేమో అన్న భయమూ వేసింది.

రామారావు ఉండబట్టలేకనే "వాళ్ళిద్దరూ కూడా యాజుల్కి ఏమీ అవరు" అనేసేరు చల్లగా.

"ఆ!" నోరు తెరిచేరు పెద్ద గుమాస్తా.

"మరి...?" చింతామణి ప్రశ్న మొఖం పెట్టేడు.

నెమ్మదిగానే, తన ఇంటికి రావటం, ఉత్తరాలు వ్రాయించటం, పేర్లుకొన్న అనుమానం, లెక్చరర్ గారింటికి వెళ్ళినవయినం వివరాలన్నీ ఏకరువు పెట్టాడు.

"బుద్ధిమంతుడు, వృద్ధిలోకి రావలసినవాడు అనుకున్నా. ఇంత పోకిరిగా వుంటాడా! ఉండు వాళ్ళ నాన్నకు ఉత్తరం వ్రాస్తాను వెంటనే రమ్మని, ఆ మామగారికి కూడా?" నిప్పులు క్రక్కుతున్నట్లే అన్నాడు హెడ్ గుమాస్తా.

"మామగారా?" శ్రీపతి మధ్యలో అడిగేడు.

"ఓహో! ఆ సంగతి మీకు తెలియదు కాబోలు" అంటూనే వివరాలు చెప్పేడు. అంతా విస్తుపోయేరు.

"వీలైతే మీరు పెద్ద దొర చెవిని పడేస్తే నాల్గు చివాట్లు వేస్తాడు. దాంతో కాని తిక్క తిరగదండి! ఆ పనిచేస్తే వాడికి చాలా ఉపకారం చేసినవాళ్ళవుతారు." శ్యామలన్న మాటలు మనస్సులో పట్టిపోతే ప్రతీకారంగా, మిరపకాయ అయ్యేడు శ్రీపతి పెద్ద సలహాదారులా.

"అదేమిటి? మొన్న మావాళ్ళూ, శ్రీపతి భార్య చూడ్డానికి వెళదామనుకుంటే నిర్మొఖమాటంగా రావద్దని అనేసేడండి. పైగా వాడిలో కొత్త ముఖం చిట్లింపులు కన్పిస్తూనే వున్నాయి కూడాను" కుళ్ళుమోతుతనంలో తనకు ఏ రహస్యాలూ చెప్పకుండా, గాడిదచాకిరీ చేయించుకున్నాడన్న భావంతో రామారావు వేసేడు సమిధ.

"అంతపని జరిగిందా?" అన్న ఆశ్చర్యంలో మొగలోనే నుంచుండి పోయి దగ్గులు ప్రారంభించేరు. అందులో రిక్షావాడి గంట కూడా వినిపించనే లేదు. "అయ్యా దారి" వాడు అరుస్తూనే వున్నాడు.

ఈ తప్పుకోని వాళ్ళు ఎంతవింతగా వుంటారో అన్న ఆశ్చర్యంతో, బెడ్డింగుమీదుగా వంగిచూసేడు వెంకట్రామయ్య. తల నెరపులు సమానం అనుకుంటూనే "యాజులుగారి ఇల్లు ఎక్కడండి? ఆయన ఆ ఆఫీసులో పనిచేస్తూ వుంటారు!" అని అడిగేడు.

"ఆవరసలో మూడో ఇల్లు" అని అనేసినా గుట్టన్నీ గూబల్లో పెట్టుకుని, సతమతమయ్యేడు శ్రీపతి. 'ఎవరు చెప్పా?' అన్న చూపులు కళ్ళజోడు వెనకాల వుండిపోయేయి. అగ్ని పర్వతం బద్దలైపోతుందన్న ఉత్సాహం రామారావులో వుంటే, చింతామణి, 'తను మళ్ళీ ఆఫీసులో పునఃప్రవేశానికి ఆయనే అండ, ఏం జరగకూడదు దేవుడా' అన్న తహతహ కనపరిచేడు.

ఆయన మెట్లు ఎక్కేడు. అంతవరకూ వెనుక చూపులు చిల్లులు పొడిచే, ముందుకు సాగేయి మనం ఇక్కడే వుండటం మంచిది కాదని.

ఎవరా అనుకున్న సంశయం ఊగిసలాడితే, పులుకు పులుకు ఓసారి చూచి, అనమాలుక లేచి, ఒక్క గెంతులో శ్యామలా. కస్తూరి "నాన్నా" వచ్చేవా అనేసి చెరోపిడా గునిసేరు. ముఖాలు పొంగిపోయి నవ్వుల మడుగులే అయ్యేయి.

స్తబ్ధు అయిన యాజుల్ని లేపినట్లుగా "వీరు మా నాన్నగారు" అంది శ్యామల

"మరి ఆయనెవరే?"

"ఆయన యాజులుగారు. ఆఫీసులో ఉద్యోగం. ఎంతో మంచివారు నాన్నా. ఇన్నాళ్ళు ఇక్కడే వుండిపోయేం."

చిరునవ్వు నవ్వినా "ఏం అబ్బాయి! ఏదో వచ్చినపని ఘంటల్లో చేసి పంపెయ్యక ఆ పెళ్ళి అనవలసిన పిల్లల్ని ఇలా రోజులతరబడి అట్టేపెట్టేస్తే ఏమవుతుందో తెలియదయ్యా! ఎప్పుడు ఇల్లు వదలనివాడిని కదిలించేవు కదా! రేపొద్దున్న ఇదే ఒట్టబయలు అయితే ఇంకొకడు పెళ్ళి చేసుకుంటాడయ్యా!" అని నిలబెట్టినట్లు అన్నాడు వెంకట్రామయ్య.

'ఇదెక్కడి అభాండం రా బాబూ' అంటూనే దోషిత్వం వహించేడు యాజులు. ఏం చెప్పాలి జవాబు తెలియనే లేదు.

"అల్లా బెల్లం కొట్టిన రాయిలా మొఖం వంచుకుంటావేమయ్యా! మాట్లాడవేం?"

వాళ్ళిద్దరూ కిలకిలమంటుంటే క్రేవులతో దేసినట్లయి కళ్ళు మూసుకున్నాడు. ముందుగా యాజులు మామగారు, బొద్దుమీసాలు, ఆ వెనుక అత్తగారు వచ్చి నుంచున్నట్లే గుర్తులేదు యాజుల్కి. చీకట్లో ఏవో

యమపాశం లాక్కు వెళ్తున్నట్టే అయితే, కణతలమీదుగా చేతో కళ్ళు దాచుకున్నాడు. చూపుల్లోనే చిరునవ్వులు వెళ్ళేయి. కస్తూరి అమ్మపొదివిలో కొత్త పెళ్లికూతురే అయ్యింది.

"యాజులుగారూ!" వీధిలో బూట్ల చప్పుడు. తలెత్తేడు. ఎదురుగావున్న వ్యక్తులు, మొఖాల్లో నవ్వులూ, ఆవిడ కునుపులు, శ్యామల పొట్లపువ్వు, పై ప్రాణాలు పైనే ఎగిరిపోయేయి యాజులుకి. లేచనే లేకపోయ్యేడు, రాళ్ళవర్షం!

వచ్చిన సబ్ఇనస్పెక్టరుకు, ఆ వెనుకాలవున్న సీతారామారావుగార్కి, ఎవరూ ఏం చెప్పనక్కర్లేనట్టే అర్థం అయిపోయింది. మొఖాలు పులకితం అయిపోతే, సీతారామారావు పదిరూపాయల కాగితం బంట్రోతు చేతులో పెడుతూనే "నిముషాలమీద మిఠాయి తీసుకురా" అని పురమాయించేసేడు.

ఎదురుగా వెంకట్రామయ్య వెళ్ళుతూ "రండి బావగారూ!" అన్న ఆహ్వానమూ పంపేడు, సీతారామారావుగారికి.

కంగారుపడుతూ, ఏంచెయ్యాలో తెలియక, లేవాలని, కూర్చోవాలని, చేతులెత్తి నమస్కారం పెట్టాలని, మర్యాదా చెయ్యాలని ఊగింపుల్లో, ఊయ్యాలే అయ్యింది యాజులుమనస్సు.

అందరూ కూర్చునే వుండిపోయేరు, సంతోషం పట్టలేక మిఠాయి వచ్చేసింది అంచెలమీద.

"అమ్మాయి కస్తూరీ! ఇల్లారా!" అనేసేడు వెంకట్రామయ్య.

పొట్లం విప్పుతూ, సిగ్గేతనైన కస్తూరికి అందిస్తూ, "ఆయననోట్లో పెట్టమ్మా" అన్నాడు సీతారామారావుగారు.

అందరినోళ్ళూ తీపే అయిపోతే, పెదిమలకు అంటిన పంచదార తీపిల్లోంచి యాజులు గతం ప్రస్తుతాలమధ్య ఊగిపోయి, అంబరం ఎక్కేస్తూనే, బాబుగారి చేతుల్లోంచే మిఠాయి అందుకుంటూ నవ్వులపువ్వులైన కస్తూరినోట్లో "ఎంతనాటకం ఆడేవు" అన్న కసిలో కుక్కేసేడు.

అందరి మొహాలూ ఓసారి పూర్ణిమలే అయిపోయేయి; నెమిలికళ్ళేకూడాను.

"ఏమండి! అసలు బావగారూ! ఇప్పటికైనా టి. వి. సెక్స్ అంటే అర్థం అయ్యిందా?" శ్యామల.

అందరికళ్ళూ మిలమిలలాడి, తెల్లబోయేయి.

"టర్మరిక్–వెర్మిలాన్ సెక్సండి"

ముందుగా థర్మోడైనమిక్స్ అనుకున్నాడు. కాని తర్వాతే ఏమిటో తెలియక బుర్రగోక్కున్నాడు. వేలకు వేలు కేసుల్లో తీర్పు చెప్పిన సీతారామారావుగారు, దోషుల్ని నిర్దోషులన్న నిరూపణలో అందెవేసిన చెయ్యి వెంకట్రామయ్యగారు, మీసాలమీద నిమ్మపండు నిలబెట్టేటట్లు వంపులు దిద్దడంచేతైన రాజుగారు, ఒక్కరేమిటి అందరూ మొఖమొఖాలు చూసుకున్నారు.

"ఇంకా తెలియలేదూ? ఇంగ్లీషులో పసుపుకుంకుమా హారం అంటే మంగళసూత్రం కాదుటండీ స్త్రీకి" అనేసి చప్పట్లు కొట్టేసింది శ్యామల.

* * * *

పెద్ద కారుమేఘాలు, ఈదురుగాలి, ఫెళఫెళల్లో ఉరుములూ మెరుపులూ ఉన్న ప్రకృతి ఒక్కసారిగా పుచ్చపువ్వులా విడిపోయినట్టే అయితే, యాజులు ఏదో ప్రశాంతయామినీ ప్రసన్నతలోకే వెళ్ళేడు.

పెట్టెలు, బెడ్డింగులు టాంగాలోకి ఎక్కేయి. మరచెంబులు చేతుల్లోనే ఊగేయి. బావమీద గౌరవము చనువు, చేసిన అల్లరి అన్నీ క్రమ్ముకుంటే, ఈ పిచ్చిబావను ఎల్లా వదిలిపెట్టి వెళ్ళడం అన్న ఆ వేదన పొంగింది శ్యామలలో. ఈ నాడు అర్థం అయిన అక్కయ్య లోతుగుండెలు ప్రక్కగా స్వరమేళం చేస్తే, ధైర్యంతోనే "బావా! వెళ్ళిరానా?" అంది. ఏవి ఎల్లావున్నా కంఠం రుద్ధం అయ్యింది.

ఒగ్చులేని శూన్యంలో ఇద్దరూ కట్టాళ్ళు అయ్యేరు గుమ్మందగ్గర. అప్రయత్నంగా, ఆలోకాలోని పిలుపులు మేగవులైతే, కళ్ళూ చెమ్మగిల్లేయి, కుర్చీలోనే జేర్లపడిపోయేడు.

ఇప్పుడు. ఈ సాగిన రోజుల్లో, ఆరోజు జ్ఞాపకం వచ్చింది. అప్పుడూ తను అదే కుర్చీలో కూర్చున్నాడు, రేండేమ్ హార్వెస్టు పుటలు తిరగేస్తూనే. గుమ్మంలో కాలెట్టినప్పుడు అల్లాగే నుంచుని ఉండిపోతే, గుండెలు కొట్టుకున్నాయి. తలంపులు......

"ఇది భలానా సోమయాజులుగారి ఇల్లేనండి. లోపలికి రండి, కూర్చోండి, కాఫీ తాగుతారా? వక్కపొడి ఇమ్మన్నారా?" అన్నాడు యాజులు.

"అల్లాగ అంకి" తలుపులు మూస్తూనే "నేను భలానా వారి అమ్మాయినండి. పేరు కస్తూరి. పంతొమ్మిది వందల ఏభైలో శ్రీ సోమయాజులుగారు నన్ను పెళ్ళి చేసుకున్నారు...కాని..."

"లెంపలు వేసుకుంటున్నా" అన్న రెండు ఎత్తిన చేతులూ మెళ్ళోకే సవరించుకుంటూ, కౌగిట్లో గువ్వపిట్టె అయిపోయి కువకువలాడింది కస్తూరి. విడియం వేసుకున్న వణుకున్న పెదిమల్ని అందిచ్చేసింది యాజుల్కి.

. అంతే! కొమ్మకొమ్మకో సన్నాయే అయ్యింది.

* * *

తర్వాత ఎప్పుడో కస్తూరే అంది—"ఆ నరసారావుపేట అమ్మాయి ఎవరో కాదు. మీ చింతామణి భార్య." అంటే, గొంతుక బిగుసుకున్నంత పని అయింది యాజుల్కి. పతివ్రత అని చెయ్యెత్తి నమస్కరించిన రోజులు వుంటే, మళ్ళీ "రేండేమ్ హార్వెస్టు" పుటలు త్రిప్పనేలేదు యాజులు.

# తంత్రశాస్త్ర రహస్యాలు

శ్రీ వాసిరెడ్డి పార్థసారథి

[డిశంబరు సంచిక తరువాయి]

పూజలలో కూడా దేవునితో పాటు దేవిని వుంచి పూజించాలి. శివశక్తుల సంమేళనం వల్లనే ఫలసిద్ధి దొరుకుతుంది. ఇందువల్ల పార్వతి పరమేశ్వరులు, లక్ష్మీనారాయణులు అను దంపతులను కలిపి పూజించుట జరుగుతుంది. పూజలలో బ్రహ్మచారులకు కూడా శక్తిని చేర్చారు తంత్రకారులు. అస్ఖలిత బ్రహ్మచారి హనుమంతుడు; ఈయనకు సువర్చలను శక్తిని చేర్చారు. బుద్ధుని పూజలో కూడా ఇట్లే తంత్రవేత్తలు ఏర్పరచారు. ప్రజ్ఞాపారమిత బుద్ధునిశక్తిగా పక్కన చేర్చి పూజించారు. ఇతరులను ఇట్లే. శక్తియను స్వభార్యపక్కన వుంటేనే పూజార్హుడని తంత్రశాస్త్ర సిద్ధాంతము. ఇది బహిః పూజ. అంతః పూజచేయువారు కుండలినీ కాంతను శివునితో చేర్చి పూజిస్తారు. శివశక్తులను కలిపి పూజించుటె కళ్యాణం. భగవంతునికి పెళ్ళియంటారు. కాని మంత్రశాస్త్ర రీత్యా శక్తిశివుల సమ్మేళనము లేనిది కామ్యములనే ఫలములు పుట్టవు. శివశక్తుల సంయోగమే శ్రీచక్రం. ఈ చక్రమధ్యలో బిందువైన బీజనుండి సమస్తలోకాలు, భూతాలు పుట్టినవి. కనుక శ్రీచక్రము సమస్తకామిత ఫలదం. ఆదియందు పరమేశ్వరుడు ఒక్కొక్క కామ్యమునకు ఒక్కొకతంత్రశాస్త్రంచొప్పున 64 తంత్రశాస్త్రములను చెప్పాడు. కామ్యములన్నిటిని పొందుటకు 64 తంత్రములను పూజించవలసివచ్చింది. ఇది కష్టమైన కార్యం. కనుక పరమేశ్వరుని సులభమార్గం చూపించమని ప్రార్థించారు. దీని పర్యవసానంగా పరమేశ్వరుడు శ్రీవిద్యోపాసనను ప్రసాదించాడు. త్రిపురసుందరి, శ్రీచక్రము, శ్రీవిద్యామంత్ర ఉపాసనలే శ్రీవిద్యోపాసన. దీనివల్ల సమస్తకామ్యములు ఫలించును. శ్రీవిద్యోపాసనలో 12 సంప్రదాయములున్నవి.

శ్రీచక్రము, సహస్రారకమలము ఒకటే. బహిః పూజలకు శ్రీయంత్రమును వుంచి పూజిస్తారు. అంతః పూజలకు సహస్రారపద్మం. దీనిలోని బిందువునుండే పంచభూతాలు, సమస్తం పుట్టినవి. అంతః పూజలో త్రిపురసుందరీదేవిని, సహస్రారకమలంలోవున్న సుధాసింధువులో ఆరాధిస్తారు. దీని విశేషమే ఈ వ్యాసారంభంలోవున్న "సుధాసింధోర్మధ్యే" అన్న శ్లోకము. దీని అర్థం ఇది. అమృతసముద్రం మధ్యలో మణిద్వీపం వుంది. మణిద్వీపంలో కల్పకోద్యానము. దానిలో నీపోపవనంవుంది. దీనిమధ్య చింతామణిగృహం వుంది. దీనిలో మంచంమీద పంచబ్రహ్మాకారంలోవున్న రత్నసింహాసనంమీద, పరమశివుని పర్యంకంమీద చిదానందలహరి శ్రీదేవి వున్నది. ఈ దేవియే మంత్ర, యంత్ర, యోగముల ఆరాధ్యశక్తి. ఈమెనుగురించి దేవీభాగవతము, మార్కండేయాదిపురాణములలో లలితోపాఖ్యానములలో వ్రాయబడివుంది. ఈ దేవినిగురించి వ్రాయబడ్డ ఆంధ్రలలితోపాఖ్యానంలోని కథను క్లుప్తంగా మనవిచేస్తాను. 'భర్తమాట ధిక్కరించి పార్వతీదేవి తండ్రి దక్షునియజ్ఞంవద్దకు వెళ్లింది. తండ్రి ఈమెను తిరస్కరించగా యోగాగ్నిచేత భస్మమైంది. దేవి పద్మాసనంలో కూర్చుని, ప్రాణములను బంధించి, మూలాధార చిద్వహ్నిని సెగయించి, నాసాగ్రనయనయై చిదగ్నిని ప్రజ్వలింపచేసింది. ఈ అగ్ని ఆమె శరీరాన్ని భస్మరాసికూడా లేకుండా దహింపచేసింది. చిదగ్ని ఆటం అగ్ని ఒకటే అయివుండవచ్చు. పార్వతీదేవి పర్వతరాజుకు కూతురుగా పుట్టింది. నారదులవారు పర్వతరాజువద్దకువచ్చి "నీ తనయ చతుర్దశ జగన్మాతయైన పరమేశ్వరి. ఈమె లక్ష్మి, పుష్టి, ధాత్రి, ఆత్మవిద్య, గుహ్యవిద్య, పాపఘ్ని" అని చెప్పాడు. ఈమెను పరమేశ్వరునికి భార్యగా చెయ్యవలెనని, పరమేశ్వరుని వద్ద వుంచాడు. పరమేశ్వరుడు మహాతపస్సులో వుండి కన్ను తెరచిచూడలేదు. ఇంద్రుడు మన్మథుని బ్రతిమలాడాడు. అప్పుడు తనమిత్రుడు వసంతుని, సేనాని చంద్రుని వెంటబెట్టుకుని వెళ్లాడు. ఈశ్వరునిమీద కామబాణం ప్రయోగించాడు. నిర్వికల్పసమాధిలో వున్న ఈశ్వరుని మనస్సు చలించి, కళ్ళు తెరిచి చూచాడు. నేత్రాగ్నివల్ల మన్మథుడు భస్మమై

వాడు. ఈ భస్మంనుండి భండాసురుడు పుట్టి లోకాలను హింసించ నారంభించాడు. మన్మథుడు లేకపోయినందున, ప్రపంచము రసహీనమైంది. ఆఖరికి చెట్లు కూడ పుష్పించుట లేదు. పశుపక్షిమానవసృష్టి ఆగింది. అప్పుడు ప్రపంచోత్పత్తి ఒకటొకటి, భండాసుర బాధ నివారించవలసినపని ఒకటి వచ్చింది. ఇందుకు ఆది శంభుడు మహాయజ్ఞం చేశాడు. అందులో దేవతలను, త్రిమూర్తులను వేల్చాడు. ఆ అగ్నికుండంనుండి శ్రీ త్రిపురసుందరి లలితాదేవి ఆవిర్భవించింది. ఈ జగజ్జనని సృష్టిని మళ్ళీ చేసింది. భండాసురునితో ఘోరంగా పోరి చంపి, ప్రపంచబాధ నివారించింది. యుద్ధంలో రాక్షసులు ఆడసేనమీద తృషాజ్వాలం ఉపయోగించారు, నేటి విషవాయువులవలె. ఆడసేన యుద్ధం చేయలేకపోగా సురాసింధువు వచ్చి వీరందరికి ఉత్సాహశక్తుల నిచ్చింది. దీనికి ప్రత్యుపకారం సురను మంత్రపూతంగా యజ్ఞములందు త్రాగిన సిద్ధిపొందుదురనీ, దత్తాత్రేయులు, పరశురాముడు, భార్గవుడు సురను త్రాగెదరని సెలవిచ్చింది. భండాసురుడు ధర్మవిప్లవం చేయుటకు కలిని పుట్టించాడు. కల్కిశస్త్రం వేయగా ఆ కతిన సాయకమున నాంధ్రులు, పుంధ్రులు కలిగారు. ఈ యుద్ధము శూన్యకపురంలో జరిగింది. యుద్ధంలో ఈ పురమూ భస్మాసురుడూ భస్మమైనారు. ఈ కథవిన్న శుభప్రదం. అణిమాదిసిద్ధిప్రదం. ఇక్కడ మహాపద్మాటవీ వర్ణన చెప్పబడ్డది. మహాపద్మాటవిలో అనేక పద్మాలున్నవి. ఇక్కడ శక్తులు సురను సేవించి చింతామణి నివాసులకు అణిమాదిశక్తుల నిచ్చుచు విహరింతురు. చింతామణిగృహంలో కొన్ని చక్రాలున్నవి. లలితాంబ యోగినీ చక్రదేవి పంక్తియందు తొమ్మిదవ సంఖ్య. దానిమీద నానాంతరమనే స్థానం వుంది. అందు యోగప్రవర్తకులైన బాదాహ్వయులు, మంత్రగురువులై, సర్వవిద్యానిలయులై వున్నారు. లోకరక్షణార్థం పాదుకాత్మకులగు అనేకులు పుట్టించబడిరి. ఇక్కడ వెయ్యిసూర్యుల ప్రకాశంగల బిందుపీఠం వుంది. ఇదే శ్రీపీఠం. దీనిని మహాపీఠమనీ, విద్యాఖ్యపీఠమని, ఆనందపీఠమని అంటారు. ఇందు సదాశివుడు మంచఫలకాకారంగా ఉన్నాడు.

"ఆతనియుత్సంగమున జెలువారు వరుణ
సూర్యపాటలరుచి సదాషోడశాబ్ద
నూత్నయౌవన దర్పిత నూపురాది
సకలభూషణ భూషిత సకలవినుత,
ఆయంబరేశు సకలజనని లలితాహ్వయంబున నలరు... వేద

వినుతయై చెలగు. దేవిని వర్ణించ వాక్కులు సిగ్గుపడుచుండు. శ్రీదేవి శ్రీనగరమును పాలించుచు, భక్తుని అభీష్టములనిచ్చును. శ్రీపురములో నున్నట్టి ప్రాకారములను కట్టించి దేవికి సమర్పించిన పరమగతి పొందుదురు. ఈ మంత్రజపము సకలకామ్యముల నిచ్చును. కవిత్వము నందు స్ఫటికోపల నిర్మలాకారిగను ధనలాభంబున సువర్ణాభగను, మూలాధారాది బ్రహ్మపర్యంతము ఎవరు అంబికను జ్వలన్మాణిక్యదీపమువలె ధ్యానింతురో వారఖిల సిద్ధులపొందుదురు. అంబ మంత్రము గురువుచే పొందినవారు వారి వంశములోని వారంతా తరింతురు. ఇది గుప్త మంత్రము. వేదబాహ్యులకు, కుటిలులకు, ఉచ్ఛిష్టులకు, ఉగ్రకర్మపరాయణులకు, కాముకులకు, చార్వాకులకు, ఆర్యదూషకులకు, అంబికామంత్రము లభించదు. ఒకవేళ లభించినను కామితార్థముకాదు. దారుణ సర్పమువలె భీతి పుట్టించును." లలితోపాఖ్యానంలో వున్న ఈకథకు, యంత్రంలోవున్న శ్రీ చక్రమునకు, శ్రీ విద్యకు, సహస్రారంలోవున్న సుధాసింధువుకు ఏకసంబంధం వుంది. అన్నీ ఒక్కదాని రూపములే, కొన్ని స్థూలరూపాలు, కొన్ని సూక్ష్మరూపాలు.

మంత్రము శబ్దంనుండి, శబ్దము ఆలోచననుండి పుట్టినవి. నేటిపాశ్చాత్యశాస్త్రజ్ఞులు ఆలోచనవల్ల తరంగములు బైలుదేరి, రూపము వర్ణమూ తాల్చునని చెప్పుతున్నారు. శబ్దమువల్ల తరంగములు బైలుదేరును. ఈ తరంగములు చక్రాకారంగా వుండును. ఆయాశబ్దమునుబట్టి, ఆ చక్రాకారమునకు దళములు ఏర్పడును. మంత్రోచ్చారణవల్ల శరీరములో, సూక్ష్మనాడీకూటమందు కొన్ని స్పందనములుకలిగి అవి చక్రరూపం తాల్చును. వీటికి రంగు, ఆకారము, తత్వము లున్నవి. చైతన్యరూపంపొందిన ఈ సూక్ష్మచక్రములు, విశ్వప్రాణమును ఆకర్షించి శక్తివంతము లగును. ఈవిధంగా శబ్దసమూహమైన మంత్రము చైతన్యవంతమై సిద్ధిప్రదమౌను.

మానవుని వెన్నెముకలో సూక్ష్మరూపంగా సుషుమ్నయనే నాడి వున్నది. ఇది నిటారుగా వుంది. ఇదే క్రిందిమానసికశక్తులను, ఉన్నత మానసికశక్తులతో కలుపునాడి. దీనిలో ఏడుచక్రము లున్నవి. క్రింది అయిదుచక్రములకు అయిదుభూతములు, ఆభూతసంబంధమైన అక్షరములు, ఆకారములు, దేవతలు, వాహనములు బీజాక్షరములున్నవి. మొదటిదైన ఆకాశము

భూతంగల చక్రం కంఠందగ్గిర సుషుమ్నా నాడియందున్నది అక్షరములలో అచ్చులు ప్రధానములు. అ ఆ మొదలైన అచ్చు అక్షరము లన్నీ ఈచక్రంలో వున్నవి. ఈ చక్రమును విశుద్ధచక్రమంటారు. ఆకాశతత్వం తర్వాతిదైన వాయుతత్వ విశుద్ధచక్రం క్రిందవున్న అనాహత చక్రంలోవుంది. హల్లులలో మొదటిదైనక అక్షరము మొదలుకొని ద వరకు ఈచక్రంలో వున్నవి. దీని తర్వాత అగ్ని భూతంగల మణిపురచక్రంవుంది. దీనిలో పై చక్రంలోని పన్నెండు అక్షరముల తర్వాత అక్షరమైన ధ నుండి ఫవరకు 10 అక్షరములు ఇందున్నవి. దీనిక్రిందవున్న స్వాధిష్ఠానచక్రంలో జలభూతమూ, బనుండి ల వరకు ఆరు అక్షరములిందున్నవి. అన్నిటిలో క్రిందివున్న మూలాధారచక్రంలో పృథివి భూతమూ, వ నుండి స వరకు అక్షరము లున్నవి. విశుద్ధచక్రంపైన భ్రూస్థానంవద్ద ఆజ్ఞాచక్రంవుంది. ఇందుల మన స్తత్వం, బ్రహ్మబీజాక్షరములైన హ. క్షలు రెండక్షరము లున్నవి. ఈ రెండక్షరములతో అక్షర సంఖ్య 50 అవును. 20 × 50 వెయ్యి యౌను. వెయ్యి అక్షరములు పై చక్రమైన సహస్రారంలోవున్నవి. మనము ఏ అక్షరమును పలికిన, ఆ అక్షరమునకు సంబంధించిన చక్రంలో, దానికి సంబంధించిన శక్తిపుట్టును. మననమువల్ల తరింపచేయునది మంత్రము. మననమువల్ల నిద్రిస్తున్న శక్తి చైతన్యవంత మౌను. నిద్రించేవానిని వూపిమేల్కొల్పుటవంటిది మంత్రజపం. ఊది అగ్నిని ప్రజ్వలింపచేయుటంవంటిది మంత్రజపం. మంత్రశక్తివల్ల, మూలాధారంలో నిద్రిస్తున్న కుండలినిశక్తి మేల్కొనును.

మంత్రమునకు అంగము లున్నవి. ఋషి, ఛందస్సు, బీజం, శక్తి, కీలకం. బీజమంత్రంవల్ల మంత్రమునకు విశేషశక్తి ఒనకూడును. మంత్రం గురువువల్ల పొందాలి. సాధకునికి మంత్రం సరిపోవునో లేదో చూడాలి. మంత్రాలు నాలుగు విధాలు. అవి (1) సిద్ధ, (2) సాధ్య, (3) సుసిద్ధ (4) అరి. కొన్ని మంత్రములు సేవకునివలె సేవచేయును. కొన్ని శత్రునివలె అపకారంచేయును. కనుక సాధకునికి తగిన మంత్రాన్ని గురువు చెప్పాలి. గురువు మంత్రాన్ని చెప్పునప్పుడు శిష్యుని నెత్తిమీద తన హస్తం వుంచి ఆ మంత్రమును 108 సార్లు జపించాలి. అప్పుడు మంత్రం చైతన్యవంత మౌతుంది. తర్వాత ఆ మంత్రమును గురువు శిష్యుని చెవిలో చెప్పును. తర్వాత శిష్యునిచేత ఆ మంత్రమును చెప్పించును. మంత్రం జపించకమునుపు అంగన్యాస కరన్యాసము చేసికోవాలి. ఇది ఆ మంత్రదేవతను తనశరీరావయములమీద వుంచుకొనుట. మంత్రంవల్ల ఆ మంత్రదేవత అతని శరీరమందు ప్రవేశించును. అప్పుడు అతనిది దేవతాశరీరమౌను. మంత్రాలు అనేకములు.

బీజాక్షరములూ చాలా వున్నవి. ఓంకారము వేదబీజాక్షరము. హ్రీం తంత్రబీజాక్షరము. ఒక్కొక్క దేవతకు ఒక్కొక్క బీజాక్షరమున్నది. హ్రీం మాయాబీజం. శ్రీం లక్ష్మీబీజం, క్రీం కాళీబీజం, హం దుర్గాబీజం, హుం (కవచ) వర్మబీజం, ఫట్ అస్త్రబీజం, రాం అగ్నిబీజం, ఎం యోనిబీజం, క్లీం కామబీజం, శ్రీం బంధుబీజం, ఐం సరస్వతీబీజం. కొన్ని దేవతామంత్రంలలో మొదటిఅక్షరం బీజాక్షరమౌతుంది. గణేశదేవతా మంత్రంలో గం, దుర్గాదేవతకు దం బీజాక్షరాలు. ఏ దేవత బీజాక్షరమును జపిస్తే, ఆ దేవత ప్రత్యక్షమై, ఆమెకు సంబంధించిన కామ్యమిచ్చును. ప్రతి దేవతలోను బ్రహ్మత్వమేవుంది కనుక ఏ దేవతను జపించినా బ్రహ్మజ్ఞానం కలుగుతుంది. ఇదే ఏ రూపంలో సేవించినా నాకే చెందుతుందన్నాడు కృష్ణభగవానుడు. గాయత్రి బ్రహ్మశక్తి— వేదగాయత్రిని శూద్రులు స్త్రీలు చెప్పకోకూడదు. కాని తంత్రగాయత్రిని చెప్పకోవచ్చు. “పరమేశ్వరాయ, విద్మహే, పరతత్వాయ, ధీమహి, తన్నో బ్రహ్మప్రచోదయాత్” ఇది తంత్ర గాయత్రి. అనగా ఆపరమేశ్వరుని తెలిసికొందుము గాక, ఆ పరతత్వాన్ని ధ్యానింతుము గాక, ఆ బ్రహ్మ మనను మంచిమార్గమున నడుపును గాక?

శత్రువో మిత్రుడో చూడనవసరం లేకుండా, అందరూ చెప్పకోతగ్గమంత్రం ఒకటివుంది. “ఓం సచ్చిదేకం బ్రహ్మ” గురువుచే చెప్పకోబడ్డప్పుడే మంత్రం ఫలప్రదమౌతుంది.

## యోగము

సంసారపాశమునకు మాయకన్న బలమైందిలేదు. పాశవిచ్ఛేదమునకు యోగమునకన్న శక్తివంతమైంది ఇంకొకటలేదు. అహంకారంకన్న శత్రువులేదు. జ్ఞానంకన్న పరమమిత్రుడూ లేడు. మనస్సును లరించి అర్థం చేసుకుంటే యోగమును అర్థంచేసుకున్నట్లే. పంచీకరణం ప్రకారము ఆత్మసగం, వాయువుసగం కలియగా మనస్సేర్పడుతుంది. ఆత్మ అనగా జ్ఞానము. వాయువనగా స్పందనము, చరంము. కదలిక, జ్ఞానంతో స్పందనం కలవగానే, స్తిమితంపోతుంది. వాయురూపమైన

స్పందనమును తీసేయగా స్థిరత్వం పొందినజ్ఞానం మిగులుతుంది. దీనినే పాతంజల యోగసూత్రం "యోగశ్చిత్తవృత్తినిరోధః" అని చెప్తుంది. చిత్తవృత్తి నిరోధమే యోగము. వృత్తులే వాయులక్షణమైనస్పందనం. దీనిని తొలిగించుట యోగం. ఇది రాజయోగము. యోగము యుజ్ అనే ధాతువునుండి పుట్టింది. యుజ్ అనగా కలుపుట. జీవిని బ్రహ్మతో కలుపుటే యోగము. ఇదే తంత్రసాధనల పరమలక్ష్యం. ఇందుకు తంత్రకౌలులు హఠయోగంతో ప్రారంభించి, రాజయోగంతో గమ్యం చేరారు.

హఠయోగంలో యోగమునకు వేరే అర్థం చెప్తారు. సూర్యచంద్రులను, ప్రాణాపానములను, శివశక్తులను కలుపుటే హఠయోగము. దీనిని ఘటయోగమనీ అంటారు. హఠంచేత సిద్ధిని పొందు యోగ మిది. జ్ఞానవాశిష్ఠం దీనిని ఒప్పుకోదు. వాసనాక్షయంవల్లనే సిద్ధి పొందాలంటుంది. అందరికీ మనస్సు సాధ్యం కాదు. కనుక శరీరంనుండి ప్రారంభించాలంటారు కొందరు. శరీర, ప్రాణ, మనస్సులను శుద్ధిచేసి, ఒక్క త్రాటిమీద నడుపుటే హఠయోగము. హఠయోగిని వామాచారి, వీరాచారి అంటారు. ఇందులో వజ్రోలివంటి వామాచారసాధనలున్నవి. జితేంద్రియుడైన తర్వాత వీరుడై, ఈయోగమును సాధించ అర్హుడౌను. హఠయోగంలో అత్యాశ్చర్యములైన శీఘ్రఫలప్రదములైన సాధనలున్నవి. యమనియమాలతో ఆసనప్రాణాయామాలను బహిస్సాధనంటారు. వీటికితోడు హఠయోగం షట్కర్మలను చేర్చింది. అవి ధౌతి, నౌలి, ఉడ్యాణ, నేతి, కపాలభీతి, త్రాటకములు. నేడు కనిపెట్టిన ఎనిమా సాధనల వంటివి. ఎనిమాపరికరాలేకన్నే, పేగులను, ఊపిరితిత్తులను, నోరు, ముక్కులను, శుభ్రం చేయు సాధనలివి. ఇవీ ఆసనప్రాణాయామములు చాలా ఆరోగ్యప్రదములు. త్రాటకంగురించి మనవిచేసినయెడల ఈ సాధన లెట్టిగొప్పవో తెలుస్తుంది త్రాటకంలో నాసికాగ్రం మీద కన్నార్పకుండా చూచుట ఒకవిధానం. మనశ్చలనానికి వాయువు కారణమన్నాం నాసికాగ్రదృష్టి కొద్దిరోజులు గురువు సహాయంతో సాధనచేసిన సులభంగా కుదురును. నాసికాగ్రమును ఏకాగ్రంగా చూచుటవల్ల ముక్కువెంట జరుగువాయు సంచారం కొద్ది, కొద్దిగా, ఆగుతూ, చివరకు పూర్తిగా ఆగును. మనస్సు కోతివలె బహుచంచలమైంది. ఈ నాసికాగ్రదృష్టివల్ల మెదడు మొద్దుబారి, మనస్సు నశిస్తుంది. ఈ విధంగా రెండుపనులు నెరవేరును. ఈ సాధన చేసేయెడల కళ్ళద్దముల అవసరం లేదని గట్టిగా చెప్పవచ్చు. వాయువు, మనస్సు చూపుకు దగ్గర సంబంధంకలవి. వీటిలో ఏది ఆగినా, తర్వాతవి ఆగును. దీని పర్యవసానం సమాధిసిద్ధి. భగవద్గీతలలో సాధనగురించి నాసికాగ్రదృష్టి ఒక్కటే చెప్పబడ్డది. ఎంత వెతికినా, హృదయం నాయంగుంచి నాసికాగ్రం చూడమన్నాడు. ఇదే శాంభవి. రమణమహాఋషి ప్రియమైన సాధన. ఇటువంటి ఆశ్చర్యకరమైన ఉపాయాలు చాలా వున్నవి.

హఠయోగంలో ప్రాణాయామంవల్ల కుండలినీ శక్తిని మేల్కొల్పుసాధనముఖ్యం. కుండలినియే సరస్వతియైన శబ్దశక్తి. శబ్దములు ఈమెయందున్నవి. ప్రాణము ఉచ్ఛ్వాసనిశ్వాసలు ఈమెవల్ల జరుగుతున్నవి. ఈమె బ్రహ్మశక్తి. ఈమె త్రిపురసుందరీదేవి. సుషుమ్న పక్కలను సూర్యచంద్రనాడులున్నవి. ఈ మూడునాడులే త్రిపురములు. కుండలిని అగ్నిశక్తి. లలితోపాఖ్యానంలో శంభుడుచేసిన మహాయజ్ఞంలోని అగ్నికుండంనుండి లలితాత్రిపురసుందరీదేవి పుట్టిందని పైన మనవిచేశాను. ఆమె ఈమె. ఇట్లే కుండలిని అగ్నికుండంలో పుట్టింది. ఈమె మంత్రంలో ఇట్లుంది. "మహాకుండలినీ జాత జాతవేదస మండలం" అగ్నిమండలంలోపుట్టింది కుండలినీశక్తి. అనగా బైటి శ్రీవిద్యలోని లలితాత్రిపురసుందరే ఈ కుండలినీదేవి ఈమెను ప్రాణాయామంవల్ల, ఇంకా కొన్ని సాధనలవల్ల మేల్కొల్పి సహస్రారంలో వున్న పరమేశ్వరునితో కలుపుటే జీవబ్రహ్మైక్యం.

తంత్రశాస్త్రకౌలులు నాడులకు అధికప్రాధాన్యం ఇచ్చారు. సూర్యచంద్రనాడులు కాలమును తెలుపునాడులు. సుషుమ్న కాలం మింగునది. యోగి శక్తిమంతుడు. అతనికి కర్మను మార్చగల శక్తి వుంది. ఇందుకు నాడీజ్ఞానమును ఎంతో వృద్ధిపరిచారు. ఒక్కొక్కనాడి నడచునప్పుడు ఒక్కొక్కకార్యం విజయమౌనని కనిపెట్టారు. ఇందుకు ఉదాహరణ జ్వరం వచ్చినప్పుడున్న నాడిని ఇంకో నాడికి మార్చిన జ్వరం నయమౌతుంది. సూర్యనాడి ఆడుతుండగా భోంచేసిన సులభంగా జీర్ణమౌను. నాడులను వారిష్టం వచ్చినట్లు మార్చి కర్మఫలితాలను మార్చగలిగారు. భవిష్యత్తును కూడ నాడీసంచారము ననుసరించి గ్రహించగలరు. జ్ఞాని

నాడీదలనం తెలిసికుని, మృత్యువును చెప్పగల్గుతాడు. గర్భంలో వున్న శిశువు మగ ఆడ చెప్పగలడు.

వామాచారులు చేయు ప్రత్యేకపూజను చక్రపూజ అంటారు. స్త్రీ పురుషులు కలిసి చక్రాకారంగా కూర్చుండుటచే చక్రపూజ న్నారు. ఇందులో వీర, రాజ, దేవ, మహాచక్రాల నే విభేదాలున్నవి. మధ్య ముఖ్యులైన స్త్రీ పురుషు లిద్దరూ కూర్చుంటారు. వీరిని చక్రేశ్వరి చక్రేశ్వరు డంటారు. వీరివద్ద కలశంలో సురను వుంచి, కుంకుమ, పసుపు, పుష్పగంధాక్షతలతో కలశమును దేవిగా పూజిస్తారు. ఇక్కడ పూజాద్రవ్యముల నుంచుతారు. దేవికి సమర్పించువాటిని పంచమకారములని, కులద్రవ్యములని అంటారు. ఇవి పంచభూతాలకు సంబంధించినవి ఈ ద్రవ్యప్రథమాక్షరములలో 'మ' వున్నందున, పంచమకారములన్నారు. మానవుడు పంచభూతాలతో చేయబడివున్నాడు. ఈ పంచభూతములను దేవికి సమర్పించుటః తనను దేవికి సమర్పించు పూజ ఇది. మత్స్యం, మాంసం, ముద్ర, మధువు, మైథునాలు ఈ ఐదు వీటిని మంత్రంతో పవిత్రం చేయంది దేవికి అర్పించకూడదు. కామక్రోధాలను పాశములో వున్న పశ్వాచారి ఈ పూజకు అనర్హుడు. జితేంద్రియుడైన వీరాచారియే పూజకు అర్హుడు. ఈ పూజలో ఛండాలుడు బ్రాహ్మణుడనే భేదంలేదు. ఇందులో శక్తిగా స్వభార్య ఉత్తమం. మహానిర్వాణతంత్రంలో ఈపూజా విశేషము చెప్పబడ్డది. ఇందులో సురవున్నదిగదా యని త్రాగుడు ఒప్పుకోలేదు. ఇతరత్రా ఆ త్రాగుడు అలవాటున్నవారి ఆస్తిని రాజు సంగ్రహించవలెనని మహానిర్వాణతంత్రం శాసించింది. ఆగమసారంలో పంచ మకారములనగా ఈక్రిందివాటిని చెప్పింది. సహస్రారంనుండి ప్రవహించు సుధయే మధువు, మౌనమే మాంసం, ఇడాపింగళ నాడులు మత్స్యలు, యోగముద్రే ముద్ర, కుండలినీ కాంతను సహస్రారంలో శివునితో చేర్చుట మైథునము. చక్రపూజకు అష్టమి, అమావాస్య, పౌర్ణమి, శుక్రవారము, రాత్రి వేళలు ముఖ్యం. కుండలిని ఊర్ధ్వముఖియై సహస్రారంకు వెళ్లినప్పుడు, క్రింద ఐదు చక్రాలలో వున్న పంచభూతాలను తను లయింపచేసికొని పరమేశ్వరుని చేరును. దీని సంకేతమే పంచ మకారపూజ. దేవికి అహం అను పంచభూతములను బలి ఇచ్చుటే ఇది.

## గురుస్థానము

తంత్రశాస్త్రంలో ప్రధానకారణమైన మహాబిందువు, ఆదినాథుడైనగురువు వున్నస్థానము చాలా ముఖ్యం. (I) కనుక క్లుప్తంగా మనవి చేస్తాను. ఇది గుప్తమైనది. ఆజ్ఞాచక్రంమీద ఒక గుప్తచక్రం ఉంది. దీనిని మానసచక్రం అంటారు. దీనికి ఆరు దళము లున్నవి. ఇవి మనస్సుయొక్క ఆరు గుణములు అని ఇవి (1) శబ్దజ్ఞానం, (2) స్పర్శజ్ఞానం, (3) రూపజ్ఞానం, (4) ఆఘ్రాణోపలబ్ధి, (5) రసోపభోగం, (6) స్వప్నం. ఈ చక్రం చైతన్యం పొందినప్పుడు ఈ గుణములు వికసించి, దూరదర్శనిమొదలైనవి కలుగుచేస్తాయి. ఈ చక్రంమీద ఇంకొక గుప్తచక్రంవుంది. దీనిని సోమచక్రం అంటారు. దీనికి షోడశకళలనబడు 16 దళములున్నవి. ఈదళముల గుణములివి (1) కృప, (2) మృదుత, (3) ధైర్య, (4) వైరాగ్య, (5) ధృతి, (6) సంపత్, (7) హాస్య, (8 రోమాంచ (9) వినయ, (10) ధ్యాన, (11) సుస్థిర, (12) గాంభీర్య, (13) ఉద్యమ (14) అక్షోభ, (15) ఔదార్య, (16) ఏకాగ్రతలు. 8 ఈ చక్రంమీద ఆధారంలేని గృహమున్నది. దీనిని నిరాలంబపురి అంటారు. యోగులు ప్రకాశమానమైన ఈశ్వరుని సందర్శించేస్థానం ఇదే. దీనిమీద వెలుగువలె ప్రకాశించే ప్రణవమున్నది. ప్రణవంమీద తెల్లనిబాలచంద్రునివంటి నాదంవుంది. నాదంమీద బిందు వున్నది. ఇక్కడ తెల్లని పద్మంవుంది, ఇది 12 దళాలుకలిగి ఊర్ధ్వముఖియైవుంది. ఈ పద్మంమీద యోగులుకాంక్షించు ముఖ్యాతిముఖ్యమైన సుధాసింధువుంది. దీనిమధ్య మణివలె, ధగధగాయమానంగా వెలిగే మణిద్వీపం వుంది. దీనిమధ్య చింతామణివుంది. దానిమీద అ, క, థలు గల త్రికోణాకారం ప్రకాశమానమై వుంది. దీనిలో నాద బిందువు లున్నవి. వీటిపై పరమహంస వుంది. దీనిమీద పాదుక లుంచుకుని గురునాథుడు కూర్చుని ఉన్నాడు. గురుధ్యానం చేయవలసిన చోటిదే. పాదుకలున్న పరహంస యొక్క శరీరము జ్ఞానమాయ, రెక్కలు రెండూ ఆగమ నిగమములు, కాళ్ళు రెండు శివశక్తులు, ముక్కు ప్రణవం, కంఠం కళ్ళు కామకళలై వున్నవి. సహస్రారం దగ్గరగా చంద్రుని 16 వ కలగల పద్మం వుంది. దీనిని అమాకల అంటారు. ఇది అగ్నివలె శుద్ధంగాను, ఎర్రగాను వుంది. దీనిముఖం అధోముఖంగావుంది. దీనిలో సూర్యునివలె వెలుగు నిర్వాణకల వుంది. ఇది వెంట్రుకలో వెయ్యోవంతు సన్నంగా వుంది. ఇదే అంతర ఇష్టదేవత. నిర్వాణకలవద్ద పరమనిర్వాణకల వుంది. ఇది చాలా సూక్ష్మంగా, రవి ప్రభాసమానంగా వుంది. తత్వజ్ఞానమునకు జన్మభూమి ఇదే. దీనిమీద బిందు విసర్గ

లున్నవి. ఆనందమునకు మూలస్థానం ఇది. సహస్రారచక్రం బ్రహ్మరంధ్రంనుండి అధోముఖమై వుంది. ఇది బ్రహ్మలోకస్థానం. ఇందు పరమశివుడూ ఆద్యశక్తి ఉన్నారు. ఇదే బ్రహ్మాండపిండాండములకు మూలస్థానం. ఇదే సగుణబ్రహ్మవాచకశక్తి. ఇందులో గుణాలు శక్తులు లోకాలున్నవి. పరమశివుడు ఆకాశరూపంలోవున్నాడు. పరమాత్మ చీకటికి సూర్యునిలా వెలుగునిస్తున్నాడు. క్రిందచక్రాల్లో వున్న లోకాలు అంకురములు. భూతములు ఇక్కడ అవ్యక్తరూపంలో వున్నవి. శైవులు దీనిని శివస్థానమని, వైష్ణవులు పరమపురుష స్థానమని, శాక్తేయులు దేవీస్థానమని, సాంఖ్యులు ప్రకృతిపురుషస్థానం అని అంటారు. కొందరు దీనినే హరిహరస్థానమని, శక్తిస్థానమని, పరబ్రహ్మస్థానమని, పరమహంసస్థానం అని, పరంజ్యోతిస్థానమని, కుల (శక్తి) స్థానమని, అకుల (శివ) స్థానమని అంటారు. సృష్టి మూలస్థానమిదే. శ్రీచక్రంలోని బిందువిదే. యోగులు కోరు గుప్తభూమి ఇది. పైన లలితోపాఖ్యానంలో చెప్పిన మహాపద్మమే ఈ సహస్రారపద్మం.

## గురుదీక్ష

మానవాకారంలో కనుపించే పరబ్రహ్మ గురువు; బ్రహ్మజ్ఞానస్వరూపి. అట్లే గురువు జ్ఞానస్వరూపి. ఇందువల్ల తంత్రశాస్త్రం గురువుకు అధిక ప్రాముఖ్యమిచ్చింది. గురువు శిష్యునకు దీక్ష ఇవ్వక పూర్వం తాను గురుత్వం పొందాలి. అసలు గురువు పైన వివరింపబడినట్లుగా సహస్రారకమలంలో పరమేశ్వర స్వరూపియై ఉన్నాడు. విగ్రహములకు, యంత్రములకు దేవతను ఆవాహనచేసి ప్రాణప్రతిష్ఠ చేయవలెను. అట్లే సహస్రారకమలంలో వున్న అసలు గురునాథుని, తన యందు ఆవాహన చేసికొని, ప్రాణప్రతిష్ఠ పొందవలెను. అనగా సహస్రారకమలంలోని గురుఅంశమే ఈ మానవగురువు. గురువు దీక్షకు మూలం, దీక్ష మంత్రానికి, మంత్రం దేవతకు, దేవత సిద్ధికి మూలం. గురువు నుండి మంత్రం, మంత్రంనుండి దేవత పుట్టింది. ఈ విధంగా గురువు ఇష్టదేవతకు పితామహుడు. దేవత, మంత్రం, గురువులకు భేదంలేదు. స్త్రీలకు అర్హత వున్న గురుత్వ వహించవచ్చు. తల్లి గురువైన ఎనిమిదరెట్లు శ్రేష్ఠం. శిష్యుడు సన్మార్గం కలిగి జితేంద్రియుడు కావాలి. గురువు శిష్యుడు సర్వసమర్పణ చేసికోవాలి. దీక్షకు ఉపవాసంవుండి, నిష్ఠగా వుండాలి. శిష్యుని శిరస్సుపైన గురువు హస్తం వుంచి సప్త మంత్రంను, నియమితసంఖ్య జపించి. శిష్యుని చెవిలో చెప్పి, శిష్యుని శిఖను గురువు ముడివేయును. శిష్యుడు మంత్రాన్ని మూడుసార్లు అని, గురువుకు సాష్టాంగనమస్కారం చేయును. దీనితో శిష్యునియందున్న పాపపురుషుడు నశించి, జ్ఞానం కలుగును. ఒకదీపంనుండి ఇంకొకదీపమును ముట్టించినట్లు, మంత్రశక్తి గురువునుండి శిష్యునియందు చేరును. శిష్యుడు గొప్పసంస్కారం పొందినవాడైతే గురువు హస్తస్పర్శతోనే సిద్ధి పొందును.

## అభిషేకం

ఒక స్థితికి వచ్చిన తర్వాతనే అభిషేకం ఇవ్వబడుతుంది. మొదటిది శక్త్యభిషేకం. ఇందులో గురువు శక్తి, తత్వముల రహస్యములను చెప్పును. దీనితో శిష్యునిలో దుష్టశక్తులు నశించి, అద్భుతశక్తి ఆవిర్భవించును. దీనితర్వాత పూర్ణాభిషేకము. ఇదే అసలైన సాధన. యమ, నియమ, ఆసన, సాధనలు చేయించబడును. ఇందులో శిష్యుడు నిలువగలిగేది లేనిది తెలుస్తుంది. దీనితర్వాత సాధన ఇంకొకష్టమైంది. క్రమదీక్షాభిషేకం అంటారు దీనిని. ఒకప్పుడు వశిష్ఠుడు దీనిలో చిక్కుకుపోయినాడు. విశ్వామిత్రుడు ఈ సాధనవల్ల బ్రాహ్మణత్వం పొందగలిగాడు. శిష్యుని కంఠమందు అతని జందెమును మాలగా వేయబడి, అనేక పరీక్షలు ఇవ్వబడుతుంది. తర్వాతది సామ్రాజ్యాభిషేకం. దీనితర్వాత మహాసామ్రాజ్యాభిషేకం. దీనితర్వాత కష్టాతికష్టప్రదమైన యోగదీక్షాభిషేకము. శిష్యుడు గురువువద్ద వుంటూ అష్టాంగములలో చివరిపంచాంగములను సాధనచేయును. ఇది పూర్తయినతర్వాత పూర్ణాభిషేకం ఇస్తారు. దీనినే విరాజగ్రహణాభిషేకం అంటారు. ఇది తురీయాభిషేకం. దీని తర్వాత శిష్యుడు తన శ్రాద్ధమును తాను చేసుకుని, అతని జందెం, శిఖలను తీసి, వాటితో పూర్ణాభిషేకంచేస్తారు. దీనితో గురుశిష్యన్యాయం పోతుంది. సోహంసాధనలో వుంటాడు. సోహంసాధనసిద్ధిపొందినవారిని జీవన్ముక్తుని పరమహంస అని అంటారు.

రామకృష్ణపరమహంస తంత్రసాధనకై పైదీక్షను ఆచరించారు. భైరవి బ్రాహ్మణి, పహ్వారిబాబా, తోతాపురులు తంత్రసాధనలలో వీరికి గురుత్వం

వహించారు. తంత్రశాస్త్రప్రకారం రామకృష్ణపరమహంస, తనభార్య శారదాదేవిని, దేవిగా కూర్చోపెట్టి షోడశోపచారపూజలు చేశారు. స్త్రీయే ప్రకృతిశక్తి. శక్తిని స్త్రీయందు పూజించుట తంత్రసాధన. పరమహంసకు మహాభావం ముందుగానే కలిగినందున వామాచారసాధనలను చేయలేదు. త్రాగుడలవాటైన మిత్రునికి పరమహంస ఈ సలహాని ఇచ్చారు. సారాయమును దేవికి అర్పించి త్రాగమన్నారు. ఇందువల్ల దేవీభావం మనస్సులో ఏర్పడి, త్రాగుడు అలవాటు తగ్గుతుందని చెప్పారు. పంచమకారములకు, ఉపద్రవ్యములనుఉంచి సాధనలు చేయవచ్చు. సురకు పాలను, మాంసమునకు మినుపగారెలను, మత్స్యమునకు తెల్లవంకాయలను, ముద్రకు యోగముద్రను, మైథునమునకు కరవీర, అపరాజితపుష్పములను సమర్పించవచ్చు. రామకృష్ణ పరమహంసగా తంత్రశాస్త్రము జన్మించినది. తంత్రశాస్త్రమువల్ల ఏవిధంగా సిద్ధిపొందవచ్చో పరమహంస తన జీవితంద్వారా చేసిచూపించారు ప్రపంచానికి. యోగసాధనలకు వారి జీవితం ఒక నిఘంటువంటే అతిశయోక్తి కాదు.

కాలం అత్యద్భుతమైంది. కాలమనే సముద్రంలో లేచిపడే అలలే ఈ ప్రపంచం. కాలంలో పుట్టి కాలంలోనే కలిసిపోతున్నాము మనం. మానవుడు పంచేంద్రియమాయలో తగుల్కొని సత్యం తెలియలేక తబ్బిబ్బవుతున్నాడు. ఈలోగా కాలసర్పం తన భయంకర వదనమును తెరచుకొని మనలను మ్రింగ పొంచివుంది. సంసారబంధములనుండి బైటపడు మార్గంలేదా? దీనికి జవాబే తంత్రశాస్త్రం. మనముకన్న కాలశక్తే, మనలను రక్షించు దయామయి. ఈజననికి ఎన్నో నామములున్నవి. సృష్టిస్థితిలయకారిణి ఈమె. సంహారమప్పుడు మహాకాళి అని, పోషించునప్పుడు మహాలక్ష్మియని, సృష్టించునప్పుడు మహాసరస్వతి అని ఈమెనంటారు. అనంతమయిరైన కాళికామూర్తులే అవి. ఈమె ఆద్యశక్తి. కాలము అగాధమైంది. తెలిసికొనుట అలవిగాక మహాభయంకరంగావుంది. కాళిమాతయొక్క నల్లటిరంగే కాలము. ఈమె త్రినేత్రములు త్రికాలములను చూడగలశక్తులు. ఈమెధరించిన పుర్రెలమాల మాతృకాశక్తులు. విడివున్న ఈమె వెంట్రుకలు పాశములకు అతీతమైనస్థితి. ఈతల్లి భయంకరాకారంతో వున్నా వరదాభయహస్తములతో వున్నది. కనుక తన పిల్లలను రక్షించే జగజ్జనని. ఈమెయే అంతస్సాధనలోని మహాకుండలినీదేవి. మహాదేవికి పంచమకారములను సమర్పించినట్లుగా, కుండలినీదేవి ఊర్ధ్వగామియైనప్పుడు క్రిందిచక్రములలోని పంచభూతములను తనలో లయింపచేసికుని సహస్రారకమలము చేరి తిరిగి మూలాధారం చేరునప్పుడు వేటి పంచభూతములను వాటికిచ్చును. ఈ జగజ్జనని, సృష్టికర్త్రి. భక్తుల కామితములను ప్రసాదించు కామేశ్వరి ఈదేవియే. ఈమే ఆగ్నేయశక్తి, అణుశక్తి.

మనశాస్త్రజ్ఞులు, విశ్వవిద్యాలయంవారు పరిశోధనలు చేసేయెడల, మంత్రశాస్త్రమున నాగార్జునివలె లోకోత్తర రహస్యములెన్నిటనో కనుగొనవచ్చును.

# సూదివాన

**శ్రీ దాశరథి**

సూదులవాన కొట్టె పరిశుద్ధ శరచ్ఛశలాంఛనాంబువా
హోదయమైన యంతనె; ముహూర్తము పాటయినన్ భరింపగా
లేదు శరీర మియ్యది; పుళిందుడు లేడిని కొట్టినట్లుగా
ఐదు శరాలవాడు హృదయమ్మున బాణము గ్రుమ్మినవ్వెడిన్.

వెన్నెల వానలో తడిసి బేల్పడిపోయిన మేనితోడ నీ
వున్న కుడుంగ భాగమున కూరక పర్వులువెట్టి, నీవు లే
కున్న, కుడుంగ సంగత సుమోత్కరమున్ తలదాల్చి దుఃఖ సం
భిన్న మనమ్ముతో ఎలుగువెట్టితి నీకయి భాగ్యహీనుడన్.

గుండియ మండిపోయినది కొంచెముగూడ సుఖమ్ము నీని గే
యెండకు, నేమి సేయుదును, హ్రీం ధనరాశివి నీవు వచ్చి నా
అండను నిల్చినన్ గెలువ నౌను మనోజ కిరాతు; నీ భుజా
దండమె చండకాండమును దండన చేసెద నిండుచందురున్.

నీ కురులెల్ల మేఘమయి నింగిని క్రమ్మి శశాంకు చిమ్మి చీ
కా కొనరింపజాలును, సుఖమ్ముగ నిద్దురబోదు నాతప
త్రాకృతిగొన్న నీ కబరికాయత చక్రమునీడ; చంద్రికా
లోకము నాకు గిట్టదు విలోల కనచ్ఛఫరీ విలోకనా!

గగన సరోజలమ్ముల సుఖమ్ముగ నీదు శశాంక హంస మా
నగవుల తారకా కమల నాళములన్ భుజియించి తృప్తిమై
తొగల మనోజ్ఞ హారములతో విలసిల్లక నా నరాలపై
పగగొని నన్ను మెక్కుటకు వచ్చు ని దెక్కడి కర్మమే చెలీ!

శాకాహారము మాని ప్రాణిహతి హింసంబెట్టి మాంసాశన
స్వీకారం బొనరింప చంద్రుడిదె వచ్చెం బో విహాయశ్శిలా
ప్రాకారంబులు దాటి; వాని తలవంపన్ నీ అపాంగాంబకం
బేకై శాయుధమౌను గావున కృపాహీనాకతన్ రాగదే.

తపనుకన్న నధిక తాపమ్ము కలిగించు రేయి యెండ నిక భరించలేను,
మొదలుకోయుచుండె తడిబట్టలను వేసి శాతకరుడు వీడు శీతకరుడె!

# సంస్కృత భాషాభ్యాసము ఎందులకు?

శ్రీ ఆదిత్యనాథ ఝా

నేను స్వాభావికముగ దేశము నాల్గుమూలలనుండి వినవచ్చుచున్న జనాభిప్రాయములను ఆకళించికొని వానికి సమాధానమును రూపింపవలసియున్నది. తఱచుగ ఈ ప్రశ్న పుట్టుచున్నది. ఇప్పుడు సంస్కృతము ఎందులకు నేర్చుకొనవలయును? అది బ్రతుకు తెరువునకు అక్కరవచ్చునది కాదు. పోనీ భౌతిక నవ విజ్ఞానమునకును అది వాహిక కాదు. నవ నవంగా ధనము, సుఖము, కీర్తి, నవీన విజ్ఞానము, వీనిని సాధించుటకుపయోగపడవలెను. సంస్కృతము పైవానిలో నేయొక్కదానికిని అక్కరకు రాదు. ఇక అన్నింటిమాట ఏల? సరి, పూర్వము సంస్కృతమునకు లోకాశ్రయము, రాజాశ్రయము నుండెడివి. అది నేర్చి లోకమునుండి రాజులనుండి అర్థార్జనము చేసెడివారు. మఱి యిప్పుడు లోకదృష్టి మారినది. వెనుకటి ఆకాంక్షలుడిగినవి. ఆధునిక దృక్పథమును నూతనాకాంక్షలను పూరించుటకు సంస్కృతము చాలదు. ఇందువలన దానికి లోకాశ్రయము నేడు లేదు. నేడు రాజులే లేరు. ఇక రాజాశ్రయము వార్త ఎక్కడ? ఈరీతిని సంస్కృత పండితులకు వెనుకటి అర్జనద్వారములు శిథిలములైపోయినవి. నేటి కొలది సంస్కృత పాఠశాలలే వారికి ముఖ్యమైన జీవనాధారములు. అందును కొన్నింటి తప్ప మిగిలిన యెల్లచోటులను సామాన్యముగా, కార్యాలయములలో కడపటి నౌకరులకు లభించు వేతనమంతయు కూడ పండితులకు లేదు. అర్థార్జనకై అన్యరంగములలో వారికి ప్రవేశము కూడ నిన్నమొన్నటివఱకు నేడును దుర్లభముగానున్నది. ధనము లేక అర్థప్రధానమైన నేటియుగములో సుఖమెచ్చటిది? సంస్కృతము నేర్చిన కీర్తి లభింపగలదను ఆశకూడ లేదు. ఏలన? నేటి విద్యావంతులు తమ వడుము, సంస్కృతము చదివినవారిని విద్యావంతులనుగా లెక్కించుటలేదు. చదివిన రాశికే యెక్కని వారికి చదువువలన కలుగు పేరుమీది ఆశ పేరాస. సంస్కృతాధ్యయనమువలన నూతన భౌతిక విజ్ఞానము కలుగు నవకాశము లేదు. విజ్ఞానశాఖలన్నియు ఆంగ్లభాషాద్వారమున విపులముగా విస్తరించుచున్నవి. అట్టి విస్తరణమునకు ఏనాడును సంస్కృతము క్షేత్రము కాలేదు. ఇట్లు ఏ ప్రయోజనమునకును ఉపయోగపడుట లేదుకావున ఇప్పుడు సంస్కృతాధ్యయనము మిక్కిలి అనావశ్యకము.

నేటి ఈ ప్రధానప్రశ్నకు సమాధానము చెప్పక సంస్కృత పఠన పాఠనములనుగూర్చి చేయు ప్రచారమే విధముగను సంభావ్యము కాదు.

ధర్మము ప్రధాన పురుషార్థ మనుటలోని తాత్పర్యము—సర్వప్రాణులకు పరమాభీప్సితములైన అర్థకామములకు ప్రభవస్థానము ధర్మ మగుటవలన. వ్యాసులు దీనినే చెప్పిరి: "చెయ్యెత్తి ఆక్రోశించుచున్నాను. నా మాట ఒక్కడును వినిపించికొనుటలేదు. ధర్మమునుండి అర్థము, కామము, జనించుచున్నవి. అట్టి ధర్మము నేల ఉపేక్షించెదరు?"

వైశేషిక దర్శనములో కణాదు డిట్లు చెప్పెను: "యతోఽభ్యుదయనిఃశ్రేయస సిద్ధి స్స ధర్మః." ఏది అభ్యుదయము? ఏది నిశ్శ్రేయసము? అని నిరూపించునపుడు వ్యాఖ్యలో శంకరమిశ్రు డిట్లు వివరించెను:

"నను తస్తు కో ధర్మః కింలక్షణశ్చేతి సామాన్యతశ్శిష్య జిజ్ఞాసాయాం యతోఽభ్యుదయ నిశ్శ్రేయస సిద్ది రిత్యుపతిష్ఠతే. తథాచ యతోఽభ్యుదయ సిద్ది ర్యతశ్చ నిశ్శ్రేయస సిద్ధిః తదుభయం ధర్మః. ఏకం పురుషార్థాసాధారణ కారణం ధర్మ ఇతి వక్తవ్యే పరమపురుషార్థయోః సుఖదుఃఖాభావయో విశేషతః పరిచయార్థం అభ్యుదయ నిశ్శ్రేయససిద్దిరిత్యుక్తం"

ఈ వివరణను పట్టి సుఖమునకు దుఃఖాభావమునకు ధర్మము ప్రధాన సాధనమని తెలుచున్నది.

తైత్తిరీయారణ్యకము 10-63 లో నిట్లున్నది:

"ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా! లోకే ధర్మిష్ఠం ప్రజా ఉపసర్పన్తి! ధర్మేణ పాప మపనుదంతి, ధర్మే సర్వం ప్రతిష్ఠితం! తస్మా ద్ధర్మం పరమం వదన్తి."

వాజసనేయ బ్రాహ్మణోపనిషత్తు (3-4) లో నిట్లున్నది:

"స చతుర్థః సృష్ట్వాఽపి వర్ణాన్ నైవ వ్యభవత్, తచ్ఛ్రేయోరూప మత్యసృజ ధర్మం, తదేతత్ -

---

ఇది వారాణసి సంస్కృత విశ్వవిద్యాలయోపకులపతి పండిత ఆదిత్యనాథ ఝా (ఐ. ఏ. ఎస్.) గారి సంస్కృత ప్రసంగానికి తెలుగు. ఆయన గడచిన మే నెలలో బిహారీ సంస్కృత సమితి స్నాతకోత్సవంలో ప్రసంగించారు. సం. భా.

క్షత్రస్య క్షత్రం, యద్ధర్మః, తస్మాత్ ధర్మాత్ పరం నాస్తి"

పరాశర మాధవములో దీని వివర మిది—

"పరమేశ్వరః ప్రజాస్సృష్ట్వాపి తన్నియామకాభావాత్ కృతకృత్యతారూపం విభవం న ప్రాప్తవాన్। తతో విచార్య నియామకత్వేన శ్రేష్ఠం ధర్మం అతిశయేన అసృజత్, ఇతి। అహో మహాదిదం ధర్మస్య సామర్థ్యం, యత్ క్షత్రియాదిః ఉగ్రో మారణే సమర్థోఽపి ధర్మాద్భీతః కరప్రదానాద్యుపయోగినం యాచకవిప్రాదికం న మారయతి, ప్రత్యుత తస్మై ధనం దదాతి, భటాశ్చాతిశూరాః ధనుఃఖడ్గాదిధారిణో లక్షసంఖ్యాకా ఏకేన నిరాయుధేన స్వామినా అధిక్షిప్యమాణాః తాడ్యమానాః సంతోఽపి స్వామిద్రోహాద్బిభ్యతి, తతో ధర్మాదపి ఉత్కృష్టం న కించిన్నియామకమస్తి।"

మను విట్లాదేశించెను:

"ధర్మం శనైస్సంచినుయాత్ వల్మీకమివ పుత్తికాః।
పరలోక సహాయార్థం సర్వభూతాన్యపీడయన్॥
నాముత్ర హి సహాయార్థం పితా మాతా చ తిష్ఠతః।
న పుత్ర దారా న జ్ఞాతిర్ధర్మస్తిష్ఠతి కేవలః॥
ఏకః ప్రజాయతే జంతురేక ఏవ ప్రలీయతే।
ఏకోఽనుభుంక్తే సుకృతం ఏక ఏవ చ దుష్కృతం॥
మృతం శరీరముత్సృజ్య కాష్ఠలోష్టసమం క్షితౌ।
విముఖా బాంధవా యాంతి ధర్మస్తమనుగచ్ఛతి॥
తస్మాద్ధర్మం సహాయార్థం నిత్యం సంచినుయాచ్ఛనైః।
ధర్మేణ హి సహాయేన తమస్తరతి దుస్తరం॥ (మను-4)

మహాభారతము శాంతి పర్వములో ధర్మమును గూర్చి ఇట్లు తెలియుచున్నది:

"ధర్మాదపేతం యత్కర్మ యద్యపి స్యాన్మహాఫలం।
న తత్సేవేత మేధావీ నహి తద్ధిత ముచ్యతే॥
ఏక ఏవ సుహృద్ధర్మో నిధనేఽప్యనుయాతి యః।
శరీరేణ సమం నాశం సర్వ మన్యద్ధి గచ్ఛతి॥
శక్తిమానప్యశక్తోఽసౌ ధనవానపి నిర్ధనః।
శ్రుతవానపి మూర్ఖశ్చ యో ధర్మ విముఖో నరః॥
ధర్మో మాతా పితా చైవ ధర్మో బంధుస్సుహృత్తథా
ధర్మస్స్వర్గస్య సోపానం ధర్మాత్ స్వర్గమవాప్యతే॥
విద్యారూపం ధనం శౌర్యం కులీనత్వ మరోగతా।"
రాజ్యం స్వర్గశ్చ మోక్షశ్చ సర్వం ధర్మాదవాప్యతే॥

గీతలో కృష్ణుడు సుస్పష్టముగా నిట్లనెను:

"స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥"

మహాఫలమైన ఆయీ ధర్మము స్వరూప సాధన వివరణలతో సంస్కృతి వాఙ్మయములో విస్తారముగ నిరూపింపబడియున్నది. ఇందువలన ధర్మము తెలుసుకొనుటకు, దానియందు లోకమునకు ప్రీతిని—ప్రవృత్తిని కలిగించుటకు సంస్కృతి వాఙ్మయము యొక్క పఠన పాఠములను, వ్యాపింపజేయు నొక వ్యవస్థను రూపింపజేయుట తప్పనిసరిగా ఆవశ్యకమగుచున్నది.

తఱచి చూడగా ఈ ఉపపత్తికూడ నిలుచుట లేదు. ధర్మము తెలుసుకొనుటకే సంస్కృతము వలయునన్నచో వేదధర్మ నిరపేక్షమైన నేటి గణతంత్ర ప్రభుత్వమునుండి సంస్కృతాధ్యయనమునకు ప్రోత్సాహము లభింపగలదను ఆశను వదలికొనవలయును. ధర్మము తెలుసుకొనుటకు సంస్కృతము వలయునన్నమాటకు వర్తమాన భారతప్రభుత్వ నీతియొక్కటియే ప్రతికూలము కాదు. మఱి భౌతిక విజ్ఞానప్రధానమైన వర్తమాన యుగమే ప్రతికూలము.

నేడు మానవుని దృక్పథమే మారినది కదా! వైజ్ఞానిక పరిశీలనముచేత ప్రమాణితము కాని వస్తువు యొక్క ఉనికినే ఆ దృక్పథ మంగీకరింపదు. భౌతిక వైజ్ఞానిక పరిశీలన సాధనములచేత ధర్మము యొక్క ఉనికియే పొడగట్టదు. ఇది ఇంకొక విషయమున్నది: నేటి మానవుడు తన వర్తమాన జీవనమునందే విశ్వసించును. జీవితమునకు ఆవలి యునికియందు అతనికి నిష్ఠ లేదు. నడచుచున్న తన జీవితమునే లౌకిక సంపదలతో సుఖమయముగాఁ జేసికొనఁదలచును. వివిధోపకరణములను నానాటికి ప్రసవించుచున్న భౌతికవిజ్ఞానమే సర్వలౌకిక సమృద్ధులకు మూలమన్నది ప్రత్యక్షసిద్ధము. ఎదురుగా కనపడుచున్న సుఖసాధనము కాదని, కనపడని ధర్మముకొఱకు పట్టించుకొను బుద్ధిమంతుఁడెవఁడు? ఇందువలన ధర్మమును బోధించి సంస్కృతాధ్యయనము లోకము మన్ననకు నెలవు కాలేదనుట సునిశ్చితము. ఇప్పుడు కొంచెము వివరింతును. నేఁడు సంస్కృతము ధనార్జన కుపయోగింపఁగల రూపమున లేదు. ఆయువులో ప్రథమభాగమును పూర్తిగా వెచ్చించి 'ఆచార్య' కక్ష్యాంతము చదివికూడ సంస్కృత పట్టభద్రులు జీవిత ప్రథమావసరములను గూడ సంపాదించజాలక పోవుచున్నారు. ఆంగ్లభాషాద్వారమున శిక్షితమైనవర్గము సంస్కృతజ్ఞులను చదువని వారినివలె చిన్నచూపుఁ జూచుచున్నది. లోకము సముచితముగా వారి నాదరించుటలేదు. ప్రభుత్వము వివేకరహితముగ ఈ స్థితిని పట్టించుకొనుటలేదు, ఉపేక్షించుచున్నది. ఇందువలన సంస్కృతమును చదువుటకు ఒక్కనికిని ఉత్సాహము కలుగుటలేదు. ఇది ఆలోచింపవలసిన విషయము. ఈ నేరము సంస్కృతభాషదా? ఈ పేదతనము సంస్కృతభాషవలనఁ బుట్టినదా? సంస్కృతాభిజ్ఞుఁడు నేటివలె ఎల్లకాలములయందు అసమర్థుఁడు, దుర్బలుఁడు,

నిర్ధనుడునై ఒప్పగింపఁబడి యుండెనా? అయినచో అతనినిగూర్చి మనువుయొక్క ఈ యుద్ఘోష మెన్నడును నిక్కమై యుండెను.

"సేనాపత్యంచ రాజ్యంచ దండనేతృత్వ మేవచ।
సర్వలోకాధిపత్యంచ వేదశాస్త్రవి దర్హతి॥"

నేటున్నట్టి స్థితి సంస్కృతమునకు స్వాభావసిద్ధము కాదని చరిత్ర చెప్పుచున్నది. వెనుకటి కాలములో సంస్కృతము కేవలము ధర్మ భాషగా, సాహిత్య భాషగా మాత్రమే యుండి యుండలేదు. మఱి బహు కాలము లోక భాష, ప్రభుత్వ భాషయునునై యున్నది. భోజుని కాలములో బోయీ "భారో న బాధతే రాజన్ యథా బాధతి బాధతే" అనుచున్నాఁడు. నాటి సాలెవాఁడు పలుకుచున్నాఁడు

"కావ్యం కరోమి నహి చారుతరం కరోమి
యత్నాత్కరోమి యది చారుతరం కరోమి।
భూపాల మౌళి మణిరంజిత పాదపీఠ!
హే సాహసాంక! కవయామి వయామి యామి॥"

మండనమిశ్రుని యూరిలో నీరు తెచ్చికొను స్త్రీలుకూడ అతనియింటికి దారిని జూపుచు శంకరాచార్యులతో ననుచున్నారు:

"జగద్ధ్రువం వా జగదధ్రువం వా
కీరాంగనా యత్ర గిరో గిరంతి।
ద్వారస్థ నీడాంతర సన్నిరుద్ధా
అవేహి తన్మండనమిశ్ర గేహం॥
స్వతః ప్రమాణం పరతః ప్రమాణం
కీరాంగనా యత్ర గిరో గిరంతి।
ద్వారస్థ నీడాంతర సన్నిరుద్ధా
అవేహి తన్మండనమిశ్ర గేహం॥"

ఇట్లే చాణక్య, మాధవ ప్రభృతులు సంస్కృత భాషలో పరమప్రామాణికులైన పండితులైయున్నారు. చతురస్రమును గంభీరమునైన సంస్కృతభాషా పాండి బలమువల్లనే దుర్వహమైన రాజ్యతంత్రమును నడుపుటయందును, దానియం దొకనిని ప్రతిష్ఠించుటయందును పరమమైన నైపుణ్యముతో వీరు నిర్వహించిరి.

ఇది చాలదా? సంస్కృతముయొక్క గౌరవమునకు! సంస్కృతము వైదేశిక ప్రభుత్వ కృతమైన పారతంత్ర్య చిరరాత్రియందు స్వాభిమానులైన ఉపేక్షావమానములను తలపై మోసికొని ప్రాణావశిష్టయై యెట్లో బ్రదికియున్నదన్నంత మాత్రము కాదు. సహజమైన తన మాధుర్యమును రక్షించికొన్నదన్నంత మాత్రము కాదు. మఱి వేదములు ఉపనిషత్తులు పురాణములు తంత్రములు రామాయణ మహాభారతములు దర్శనములు కావ్యములు నాటకములు — వీనియందలి విషయ మహిమ్నతచేత శైలీ సౌందర్యముచేత భాషాకర్షణముచేత స్వీయ మహిమను వృద్ధి పొందించుకొనుచు దేశమును ఒక్క సూత్రమునఁ గుచ్చి ప్రళయమునుండి రక్షించినది. వైదేశిక పాలనములో భారత వర్షము తన సర్వస్వమును నష్టపోయినది. మిగిలిన దేది? అని పర్యాలోచించుకొను వేళ భారతీయమైన దాని ప్రాక్తన దృష్టి — శాశ్వతమైన సంస్కృతి — విచారమార్గము సధరోహించి వచ్చుచున్నవి. ఇవి నశించినవని చెప్పుటకు శక్యము కాదు. ఇవి యేల నశించిపోలేదని విచారింతము. అప్పుడు సంస్కృతమే దానికి మూలముగా నిలుచుచున్నది. కడచిన ఫిబ్రవరి మాసము 23 వ తేదీ ఢిల్లీలోని విజ్ఞానభవనమునందు అజాదు వ్యాఖ్యానమాలాను బంధములో ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ పలికినదిది సర్వథా యథార్థము. "మానవ జీవితముయొక్క చరిత్రలో ఒకేయొకసారి ఒకేయొక భాష భారతవర్షములో సంస్కృతము చేసినంత మహత్తమైన కార్యమును చేయగలదు. సంస్కృతము పరమోదాత్తము లయిన విచారధారలయొక్క అభివ్యక్తికిని — సర్వోత్తమమైన సాహిత్యమునకు మాత్రమే వాహికగా నుండియుండ లేదు. మరి రాజకీయ దృష్టిచేత విభక్తమైనను భారతవర్షముయొక్క ఏకత్వ సంరక్షకు మహనీయమైన సాధనముగ కూడ నిలిచియున్నది. వర్ష సహస్రములనుండి లక్షల వ్యక్తుల జీవన మార్గములలో రామాయణ మహాభారతములు అల్లికపడి యున్నవి. ఎప్పుడయిన నది తలంపునకు వచ్చిన వేళ నాకు మిక్కిలి కష్టము కలుగుచుండును — మన జాతి, బుద్ధి విషయములను, ఉపనిషత్తులను, సంస్కృత మహా కావ్యములను విస్మరించియుండెనేని అప్పుడు దీని రూపమెట్లు పరిణమించి యుండెడిది! అని. ఏ గుణములచేత యుగయుగములనుండి ఈ జాతి ప్రసిద్ధమైనదో అసాధారణము లయిన అట్టి గుణములను విడిచి పశువులముగా నశించియుండెడిది. సంస్కృత భాషను విస్మరించి భారతవర్షము భారతవర్షముగా మిగిలియుండెడిది కాదు."

ఈ పర్యాలోచనలో తేలిన విషయ మిది. నేడు సంస్కృతభాషకు గోచరించుచున్న స్థితి దానికి స్వాభావికమైయున్నది కాదని. అన్ని విధముల సంస్కృతవాఙ్మయము సమృద్ధము సర్వగుణ సంపన్నమునై యున్నది. భావాభివ్యక్తికి — నూత్న సృష్టికి వలసిన శక్తి నేటికిని సంస్కృతములో అనంతముగా నున్నది. ఆ భాషాద్వారమున ఆయా కాలములలో మహాపురుషులు లిఖించియున్న సందేశములు నేటికిని [illegible]ములైన సత్యములు శాశ్వతములును.

వైదేశిక పాలనములోని సంస్కృతభాషానిరాదరము స్వతంత్ర భారతములోకూడ కొనసాగినచో,

పము చితస్థాన మిచ్చినచో, నేర్పుటకు వలయు నిర్బంధ మేర్పఱించినచో, సంస్కృతాధ్యాపకులను ప్రభుత్వ మాదరించె నేని, అనతికాలములోనే పూర్వ వైభవము నందుటమాత్రమే కాక విపులమైన యుగదీప్తితో ప్రకాశింపగలదు.

ఇది వైజ్ఞానికయుగము. ఈ యుగప్రభావము చేత మానవుని దృక్పథము మాఱినది. నే డెవ్వరును గ్రుడ్డి నమ్మకముతో ధర్మమును పరలోకమును అంగీకరించి తన వర్తమానము నొప్పతికింప దలపడు. వైజ్ఞానిక పద్ధతిచేత ఋజువయిన వస్తువుయొక్క ఉనికినే నేటి సర్వజనము విశ్వసించును. ఇది ముమ్మాటికీ సత్యము. నేడు విజ్ఞానముయొక్క మహిమచేత దేశకాలముల అనంతదూరములు పిడికిలి లోనికి వచ్చినవి. స్వాస్థ్యమునకు, ఆరోగ్యమునకు ఉపయోగించు క్రొంగ్రొత్త సాధనములు కనిపెట్టబడుటచేత జనుల జీవితము వృద్ధి నొందింపబడినది. వలయువస్తువులెల్ల పుష్కలముగా సృష్టింపఁబడుటచేత జీవితమెంత సుఖమయ్యమయినదో తెలియుచున్నది. శీతాతపములను అదుపులోనికి తెచ్చుటచేత తితిక్షతో పని తీరినది. రాకపోకలకు క్రొత్త సాధనములు వచ్చి ప్రపంచమెల్ల చేరువయై విశ్వబంధుత్వమునకు, వికాసమునకు, ద్వారము తెరువబడినది. పలు విధములైన పరికరములను నిర్మించి బలసాహసములను పెంచుటచేత లోకము దైవముమీద ఆధారపడి యుండెననుమాట త్రోపుపడినది. ఈ విధముగా నేటి విజ్ఞానముయొక్క సామర్థ్యము మాటల కందుటలేదు. కాని దీని అంతటితో పాటు ఇంకొకటికూడ ప్రత్యక్ష సత్యముగా కనుపడుచున్నది. ఈ వైజ్ఞానికములైన సుఖసాధనముల సమృద్ధిలో కూడ లోకము వెనుకటికంటె సుఖముగను శాంతముగను లేదు. ఎల్లచోటుల భయము, అవిశ్వాసము, ఉద్వేగము, వేఱూనియున్నవి. నేడు రాజ్యవిస్తారకాంక్షచేత లోకమెల్ల ఆక్రమింపఁబడియున్నది. ఎల్లయెడల సంఘర్షణాగ్ని భగ్గుమనుటకు సిద్ధముగానున్నది. విశ్వముయొక్క ప్రతిక్షణమునందు ప్రళయము చేరువయై ఉన్నది. ఇందువలన నేడు లోకములో ఈ చర్చ తఱచుగా వినఁబడుచున్నది. ధర్మ విషయమై మానవుని తొలుతటి నమ్మకము తొలఁగిన గ్రుడ్డినమ్మకమగును — కాదు — మఱి నాస్తిక్యపు టొఱగల్లుపై పదనుపెట్టి పాలకుల సాధకమై ప్రపంచమునకెల్ల శాపముగా మాఱుచున్న భౌతికవిజ్ఞానమును కిన్నుమానసికోని కొనియాడుట నిస్సంశయముగా గ్రుడ్డినమ్మకమే యగును. నేడు ప్రపంచనాయకులును మేధావులును ఈ అనర్థకరమైన సంఘర్షణకు వాస్తవమైన తొలుతటి కారణమేది? నూటిగా దీని ప్రతీకారమునకు ఉపాయమేమి?-అని తలపట్టు పట్టుకొనుచున్నారు. ఈ అన్వేషణమే ఈ సమయములో మునిముందు చేయదగియున్నది. వారికీ విషయము రూఢిగా తెలిసివచ్చుచున్నది. 'మానవుని దృక్పథము కేవలము భోగవాదమునందు మాత్రమే కేంద్రీకరింపఁబడి—నానియోగుట నొకానొక విశిష్టలక్ష్యము ఒకానొక విశిష్టాదర్శము నిలిచియుండని నాఁడు—సర్వదేశములయందును పెచ్చుపెరుగుచున్న మాత్స్యన్యాయము నరికట్టుటకు వేఱొక తెరవు లేదు. ప్రళయకరములైన అస్త్రశస్త్రముల నిర్మాణ ప్రవృత్తిని ఆప శక్యము కాదు.' అని. మానవ జీవితము యొక్క ఈ అంతిరువులో 'ఇప్పుడు సంస్కృతమేల చదువవలెను?' అన్న ప్రశ్నకు సమాధానము సరిశముగా తేటపడుచున్నది. కేవల భౌతిక సంపదచేత-విషప్రాయమైన కేవల విషయనిష్ఠచేత మానవునకు శాంతి సౌఖ్యములు కలుగనేరవన్న పరమసత్యమును భారతవర్ష తత్త్వ చింతకులు చిరకాలము విచారించి వందలసార్లు పరీక్షించి యీ అనుభవసారమును సంస్కృత వాఙ్మయమునందు పదేపదే నింపి యున్నారు.

'మానవుని ఉనికి శరీర మున్నంతవఱకే. శరీరము రాలిపోయిన పిమ్మట మానవుడు లేడు. ఈ లోకముకంటె వేఱేమియును లేదు. భౌతిక సుఖ సంపత్తికంటె మానవునకు ధ్యేయము మఱియొకటి లేదు.' ఈ వైఖరి మానవునకు హితావహమైనదిగా లేదు. సంస్కృతవాఙ్మయ మీ వైఖరిని సమర్థింపదు.

"అన్యత్ శ్రేయః అన్యదుతైవ ప్రేయః,
తే ఉభే నానార్థే పురుషం సినీతః,
తయోః శ్రేయ ఆదదానస్య సాధు భవతి
హీయతేఽర్థాత్ య ఉ ప్రేయో వృణీతే॥
న సాంపరాయః ప్రతిభాతి బాలం
ప్రమాద్యంతం విత్తమోహేన మూఢం,
అయం లోకః, నాస్తి పర ఇతి మానీ
పునః పున ర్వశ మాపద్యతే మే॥"

సుఖశాంతులు ఎవ్వనికి? ఇదికూడ మృత్యువచ్చటనే వివరించెను.

"ఏకో వశీ సర్వభూతాంతరాత్మా
న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః,
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః
తేషాం సుఖం శాశ్వతం నేతరేషాం॥
నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానాం
ఏకో బహూనాం యో విదధాతి కామాన్,
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః
తేషాం శాంతిః శాశ్వతీ నేతరేషాం॥"

# సంస్కృత భాషాభ్యాసము ఎందులకు ?

తైత్తిరీయోపనిషత్తు ఆనందమీమాంసా ప్రసంగమున నూరు మానుషానందములు అకామహతుఁడైన శ్రోత్రియుని ఒక ఆనందముతో తూఁగునని చెప్పఁబడినది.

"సైషా ఆనందస్య మీమాంసా భవతి, యువా స్యాత్ సాధు యువాధ్యాయకః, ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః, తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణా స్యాత్, స ఏకో మానుష ఆనందః, యే తే శతం మానుషా ఆనందాః, ఏక ఆనందః శ్రోత్రియస్య కామహతస్య"

అనాత్మవిద్యలన్నింటిని దనగోసి ఛాందోగ్యోపనిషత్తులో ఆత్మజ్ఞానోపదేశముకొఱకు నారదుఁడు సనత్కుమారుని ప్రార్థించుచున్నాఁడు.

"ఋగ్వేదం భగవోఽధ్యేమి, యజుర్వేదం, సామవేదం, ఆథర్వణం చతుర్థం, ఇతిహాసపురాణం పంచమం వేదానాం వేదం. పిత్ర్యం, రాశిం, దైవం, నిధిం, వాకోవాక్యం, ఏకాయనం, దేవవిద్యాం, భూతవిద్యాం, క్షత్రవిద్యాం, నక్షత్ర విద్యాం, సర్పదేవజనవిద్యాం, ఏతద్భగవోఽధ్యేమి। సోఽహం భగవో మంత్రవిదేవ అస్మి నాత్మవిత్ । శ్రుతం హ్యేవ మే భగవద్దృశేభ్యః, తరతి శోకమాత్మవిదితి, సోఽహం భగవ శోచామి। తం మా భగవాన్ శోకస్య పారం తారయత్వితి।"

బృహదారణ్యకములో సన్న్యసింపనున్న యాజ్ఞవల్క్యునిగూర్చి అతని భార్య మైత్రేయి ప్రశ్నించుచున్నది.

"యన్ను మే ఇయం భగోః సర్వా పృథివీ విత్తేన
పూర్ణా స్యాత్ కిం తేన అమృతా స్యాం?
యాజ్ఞవల్క్యుని నోటనుండి
"యథైవ ఉపకరణవతాం జీవితం, తథైవ తే జీవితం
స్యాత్, అమృతత్వస్య తు నాఽశాస్తి విత్తేన।"

అనుమాట విన్నవెంటనే అతఁడు తన కొప్పగించుచున్న సంపదను కైకొన నొల్లక ఖచ్చితముగ నిట్లనుచున్నది.

"యేనాఽహం నాఽమృతా స్యాం, కిమహం తేన కుర్యాం, యదేవ భగవాన్ వేద, తదేవ మే బ్రూహీతి"

ఆత్మతత్త్వవివేకములో ఉదయనాచార్యుఁడిట్లు చెప్పెను.

"ఇహ ఖలు నిసర్గప్రతికూలస్వభావం సర్వజనసంవేదనసిద్ధం దుఃఖం జిహాసవః సర్వ ఏవ తద్ధానోపాయమవిద్వాంసః అనుసరంతిశ్చ సర్వాధ్యాత్మవిదేకవాక్యతయా తత్త్వజ్ఞానమేవ తదుపాయమాకర్ణయంతి"

యోగభాష్యములో వ్యాసమహర్షి యిట్లు చెప్పెను:

"తదస్య మహతో దుఃఖసముదయస్య ప్రభవబీజమవిద్యా. తస్యాశ్చ సమ్యగ్దర్శనమభావహేతుః, యథా చికిత్సాశాస్త్రం చతుర్వ్యూహం. రోగో, రోగహేతుః, ఆరోగ్యం, భైషజ్యమితి। ఏవమిదమపి శాస్త్రం చతుర్వ్యూహమేవ, తద్యథా సంసారః, సంసారహేతుః, మోక్షః, మోక్షోపాయ ఇతి। తత్ర దుఃఖబహుళస్సంసారో హేయః, ప్రధానపురుషయో స్సంయోగో హేయహేతుః, సంయోగస్య ఆత్యంతికీ నివృత్తి ర్హానం, హానోపాయ స్సమ్యగ్దర్శనం."

బ్రహ్మసూత్ర భాష్యములో భగవత్పాదు లిట్లు చెప్పిరి:

"ఏవమనాదిరనంతో నైసర్గికోఽధ్యాసో మిథ్యాప్రత్యయరూపః కర్తృత్వ భోక్తృత్వ ప్రవర్తకః సర్వలోక ప్రత్యక్షః, అస్యానర్థహేతోః ప్రహాణాయ ఆత్మైకత్వవిద్యాప్రతిపత్తయే సర్వే వేదాంతా ఆరభ్యంతే."

జైనదర్శనములో తత్త్వార్థసూత్రమునందు —

"మిథ్యాదర్శనా విరతి ప్రమాద కషాయ యోగా బంధహేతవః। సకషాయత్వాజ్జీవః కర్మణో యోగ్యాన్ పుద్గలా నాదత్తే స బంధః కృత్స్న కర్మక్షయో మోక్షః। సమ్యగ్దర్శన జ్ఞానచారిత్రాణి మోక్షమార్గః।"

అని యీ సూత్రములచేత జైనాచార్యుఁడైన ఉమాస్వాతి దుఃఖమునకు మొదటి కారణము ఆత్మవిషయక మిథ్యాదృష్టియనియు ఆ మిథ్యాదృష్టిని తొలఁగించు సమ్యగ్దర్శనము దుఃఖనివృత్తికి హేతువనియును చెప్పెను.

బౌద్ధదర్శనమున —

"ఇదం ఖో పన భిక్ఖవే, దుక్ఖం, అరియసచ్చం। జాతిపి దుక్ఖా, జరాపి దుక్ఖా, మరణంపి దుక్ఖం, సోకపరిదేవదోమనస్సుపాయాసాది దుక్ఖా, అప్పియేహి సంపయోగో దుక్ఖో, పియేహి విప్పయోగో దుక్ఖో, యంపిచ్ఛం న లభతి తంపి దుక్ఖం, సంఖిత్తేన పంచుపాదాన క్ఖంధాపి దుక్ఖా."

ఈ విధముగా ఎల్ల ఘనలును దుఃఖరూపములని ప్రతిపాదింపఁబడినది. తనుపరి—

"ఇదం ఖో పన భిక్ఖవే, దుక్ఖసముదయం అరియసచ్చం యాయం తణ్హా పోనబ్భవికా నందిరాగసహగతా తత్రతత్రాభినందినీ, సేయ్యథిదం కామతణ్హా, భవతణ్హా, విభవతణ్హా."

ఈ మొదలైన మాటలతో సర్వవిధములైన దుఃఖములకు తృష్ణయే తొలి కారణమని వక్కాణింపఁబడినది. ఆ పైన—

"ఇదం ఖో పన భిక్ఖవే, దుక్ఖనిరోధం అరియ సచ్చం, యో తస్సాయేవ తణ్హాయ అసేసవిరాగనిరోధో చాగో పటినిస్సగ్గో ముత్తి అనాలయో."

ఈ మొదలైన మాటలలో దుఃఖము తొలఁగుటకు తృష్ణ విడుపు హేతువని వర్ణింపఁబడినది. సర్వక్లేశములకు తల్లియైన ఈ తృష్ణ ఎచ్చటినుండి ఉదయించుచున్నదని విచారించుచు 'బోధిచర్యావతార పంజిక'లో నాగార్జునుఁడిట్లు చెప్పెను:

"యః పశ్యత్యాత్మానం
తస్యాహమితి శాశ్వతః స్నేహః।
స్నేహాత్ సుఖేషు తృష్యతి
తృష్ణా దోషాం స్తిరస్కురుతే॥
గుణదర్శీ పరితృష్యన్
మమేతి తత్సాధనముపాదత్తే।
తేనాత్మాభినివేశో
యావత్ తావత్తు సంసారః॥"

నాగార్జునుని యీ దృక్పథమును "ఆత్మతత్త్వ వివేక దీధితి"లో బౌద్ధపక్షము నుపపాదించుచు రఘునాథ శిరోమణి యిట్లు సమర్థించెను. "సర్వ ఏవహి భోగభాజం స్థిరమాత్మానం మన్వానాః సుఖాదికం కామయంతే। యదాహుః—

సుఖీ భవేయం దుఃఖీ వా మాభూవమితి తృష్యతః।
యైవాహమితి ధీస్సైవ సహజం సత్త్వదర్శనం॥

ఇతి. సత్త్వం ఆత్మా। కామయమానాశ్చ సుఖాదికం విహితం నిషిద్ధం వా సాధనమన్విష్యంతః కర్మాశయా నాచిన్వానాః జన్మాదిక మనుభవంతి। యది పునరమీ కిమపి నాహం, నాహమాస్పదమస్తి కించిదపి వస్తుస్థిరం, విశ్వమేవ క్షణభంగుర మళీకం వేత్యేవ ధారయేరన్, న కించిదపి కామయేరన్. నచాకామయమానాః కేచిదపి ప్రవర్తంతే, నచాప్రవర్తమానా అపి కర్మాశయేన సీవ్యంతే, నచాంతరేణ కర్మాశయం సంభవో భోగస్య."

ఈ ప్రసంగముల నన్నింటిని పర్యాలోచించిన మీఁద తేలిన నిష్కర్ష— భారతవర్షమునందలి సుప్రసిద్ధములైన వైదిక, జైన, బౌద్ధ విచారధారల నన్నింటి ననుసరించి చూచినచో భోగములయందలి అత్యాసక్తియే రాగద్వేషాదులవలన కలుగుచున్న వర్తమాన ప్రపంచ సంఘర్షణకు మూలకారణము. కావున ఈ సంఘర్షణము నుపశమింపఁజేసి మానవజాతి యొక్క పరిత్రాణమును వాంఛింతుమేని మానవుని మనో[illegible]ములనుండి విషయవాంఛోద్రేకమును శీఘ్రముగ తొలగించుట ఆవశ్యకము. దీనికి మూలకారణమై మానవునిలోనున్న మిథ్యాప్రత్యయము తొలఁగింపఁబడనంతవఱకు నిది చేయుటకూడ అసాధ్యమే యగును.

ఈ మిథ్యాప్రత్యయముకూడ బహువిధములుగా నున్నది. అనాత్మవాదుల దృష్టిలో ఇది ఆత్మాస్తిత్వప్రత్యయముగను, ఆత్మవాదుల దృష్టిలో ఆత్మనాస్తిత్వప్రత్యయముగను, లేక—దేహాదులయందు ఆత్మప్రత్యయముగ కాని గోచరించుచున్నది. మార్కండేయపురాణములో ఈ మిథ్యాదృష్టియే అనేకానర్థమూలమైన అజ్ఞాన తరువుగా రూపింపఁబడినది.

"అహమిత్యంకురోత్పన్నో మమేతి స్కంధవాన్మహాన్।
గృహక్షేత్రోచ్చశాఖశ్చ పుత్రదారాదిపల్లవః॥
ధనధాన్య మహాపత్రో నైకకాలప్రవర్ధితః।
పుణ్యాపుణ్యాగ్రపుష్పశ్చ సుఖదుఃఖ మహాఫలః॥
తత్ర ముక్తి పథవ్యాపీ మూఢసంపర్క సేచనః।
విధిత్సాభృంగమాలాఢ్యో హ్యజ్ఞాన మహాతరుః॥
సంసారాధ్వపరిశ్రాంతా ఏతచ్ఛాయాం సమాశ్రితాః।
భ్రాంతిజ్ఞాన సుఖాధీనాస్తేషామాత్యంతికం కుతః॥
యైస్తు సత్సంగపాషాణ శితేన మమతాతరుః।
ఛిన్నో విద్యాకుఠారేణ తే గతాస్తేన వర్త్మనా॥
ప్రాప్య బ్రహ్మవనం శీతం నీరజస్కమకంటకమ్।
ప్రాప్నువంతి పరాం ప్రాజ్ఞా నిర్వృతిం వృత్తివర్జితాః॥"

ఈ నెట్లును పెళ్లగింపఁ బూనిన మన దేశమునందలి తత్త్వవేత్తలు చిరకాలము క్రిందటనే ఆత్మయొక్క వాస్తవస్వరూపమును నిష్కర్ష చేసికొనుటకు మిక్కిలి ప్రయాసపడిరి. మెట్టువిడిచి మెట్టెక్కినట్లు న్యాయాది దర్శన భూమికాక్రమము ననుసరించి నిరపాయమైన ఏకాత్మవాద సౌధము నధిరోహించిరి. భేదదృష్టి దుఃఖమునకు అభేదదృష్టి దుఃఖాభావమునకు సాధనములని భారతవర్షముయొక్క చిరపరిశీలితమైన సిద్ధాంత దృక్పథముగ ఫలించుచున్నది. ఇందువల్లనే గీతలో శ్రీకృష్ణుఁడు

"సర్వభూతేషు మామేకం భావమవ్యయ మీక్షతే।
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికం॥"

అను వచనములో 'సాత్త్విక' శబ్దప్రయోగముచేత ఏకత్వదర్శనమును సంస్తుతించెను.

"పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసం."

అనుచోట 'రాజస' శబ్ద ప్రయోగముచేత నానాత్వ దర్శనమును నిరాకరించెను. ఈశావాస్యోపనిషత్తులో—

"యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవానుపశ్యతి।
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే॥
యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః
తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః॥"

ఈ రీతిని—ఏకాత్మ్య దర్శనము అనర్థములనెల్ల యెట్లు తొలగించునో నిరూపింపబడినది. భారతీయ నీతి శాస్త్రముకూడ పై ఉపనిషత్సిద్ధాంతమును పరిపోషించుచున్నది.

"అయం నిజః పరో వేతి గణనా లఘుచేతసాం।
ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకం."

భారతదేశముయొక్క చిరకాలానుగతమును పరమార్థసత్యమునైన ఈ అపన్నదృష్టిని తిరిగి ఉజ్జీవింపజేయుటకు లోకమునందెల్ల ప్రసరింపజేయుటకు సంస్కృతాభ్యాసమును ప్రోత్సహించుటయు పెంపొందించుటయు తప్పక కోరదగియున్నవి. స్వతంత్ర భారతమునందలి మహాజనము, ప్రభుత్వము. ఈ సత్యమును నిర్వివాదముగ అంగీకరించుచున్నారు. కావుననే కేంద్రశాసనసభ, అఖిలభారతసంస్కృతపరిషత్తు నేర్పరచి, అది నిర్దేశించిన క్రమము ననుసరించి సంస్కృతాభ్యాసముయొక్క వ్యాప్తికై ప్రయత్నించుచున్నది. ఉత్తరప్రదేశ ప్రభుత్వము కాశిలో సంస్కృత విశ్వవిద్యాలయమును నెలకొల్పినది. పుట్టిన ఏడాదిలోనే అది పొందిన బహుముఖాభ్యుదయమును తిలకించినచో అందరును మిక్కిలి సంతోషింపగలరని నా విశ్వాసము. చిరకాలము నుండి పఠనపాఠనములలో విస్మరింపబడిన సంస్కృతవాఙ్మయ శాఖల యొక్క అధ్యయనాధ్యాపనములకు అచ్చట కొన్ని విభాగములు తెరువబడినవి. రాబోవు సంవత్సరములలో మిగిలిన భాగములుకూడ తెరువబడును. సంస్కృతమునకు సంబంధించిన పరిశోధనము నేటివరకు నేయే విదేశభాషలలో జరుగుచున్నదో ఆ యా భాషల అధ్యయనమునకుగూడ నచ్చట ఏర్పాట్లు చేయబడినవి. పరప్రభుత్వ కాలములో ఉపేక్షింపబడిన సంస్కృతముయొక్క పూర్వశైలికి సంబంధించిన పరిశోధన కార్యమును తిరిగి ప్రవర్తింపజేయుటకు ఒక పెద్ద పరిశోధన సంస్థకూడ స్థాపింపబడినది. సంస్కృత విద్యార్థులలో లేఖన, ప్రవచన, సామర్థ్యమును పెంపొందించుటకు పలువిధములైన ఉపాయములు అనుసరింపబడుచున్నవి. వేదములలో ఉపనిషత్తులలో పురాణములలో తంత్రములలో యోగశాస్త్రములలో లౌకికములైన విద్యల ప్రసక్తి యెచ్చెచ్చట నున్నదో పరిశోధింపబడి పఠనపాఠనములలో నవి కూర్పబడి తిరిగి ప్రచారమొనర్పబడు నెడల నేటి విజ్ఞానయుగముకూడ ఆశ్చర్యచకితము కాగలదు. కాశిలోని సంస్కృత విశ్వవిద్యాలయ మీ మార్గమునఁగూడఁ దన సాధనసంపత్తుల ననుసరించి ప్రయత్నింపఁగలదు. కాశిలో సంస్కృత విశ్వవిద్యాలయము స్థాపించిన వెంటనే దేశమునందలి అన్యప్రాంతములలో గూడ సంస్కృత విశ్వవిద్యాలయములను స్థాపించుటనుగూర్చి చర్చలు కొనసాగుచుండుట సంస్కృతాభ్యాసమునకు శుభసూచనము. విహారప్రాంతములో రాబోవు శిక్షాసత్రము నుండియే సంస్కృత విశ్వవిద్యాలయము పని మొదలిడఁగలదని తలంచుచున్నాను. వేదముల నాటినుండి—ఉపనిషత్తుల నాటినుండి సర్వసంస్కృత విద్యలకును నేది కేంద్రమో, గౌతమ యాజ్ఞవల్క్య ప్రభృతులైన తత్త్వద్రష్టలకు నేది సాధనాక్షేత్రమో, దేని ఒడయుడు రాజర్షి జనకుని వైరాగ్య, త్యాగ, కీర్తిని ఔపనిషదులైన ఋషులు గానము చేసిరో, సీతవంటి స్త్రీరత్నము నొసంగెనో, ఎచ్చట గంగేశ, వాచస్పతి, వాత్స్యాయన, ప్రభృతులైన దార్శనికులు, జయదేవ, విద్యాపతి ప్రభృతులైన మహాకవులు, జన్మించిరో, ఎచ్చటి విద్వత్పరీక్ష నేడుకూడ యావద్భారత సుప్రసిద్ధమో అట్టి మిథిలలో సంస్కృత విశ్వవిద్యాలయమును నెలకొల్పుటకు విలంబమగుట లోకప్రసిద్ధమైన మిథిలా గౌరవమునకే అనుచితము. ఇది విచారించి నేటి మిథిలామహారాజు విశాలమైన తన రాజభవనమును, గొప్ప గ్రంథాలయమును నిచ్చి దర్భంగా నగరములో సంస్కృత విశ్వవిద్యాలయమును నెలకొల్పుటకు మార్గమును సుగమము చేయుట ముచితముగ నున్నది. విహార సంస్కృత విశ్వవిద్యాలయము, వారాణసీ సంస్కృతవిద్యాలయము జ్ఞానవిజ్ఞానముల నిచ్చి పుచ్చుకొనుటలతో నొండొంటిని పెంపొందింపఁ జేసికొనుచు లోకము మేలునకు నొనఁగూడఁ గలవని దేశము యొక్క దృఢ విశ్వాసము.

"ఉత్థాతవ్యం జాగ్రతవ్యం
యోక్తవ్యం భూతి కర్మసు,
భవిష్యతీత్యేవ మనః
కృత్వా సతత మవ్యథైః"

అను వ్యాస సందేశమును దీపించుమని పరమేశ్వరియైన ఆద్యశక్తిని అభ్యర్థించుచున్నాను.

యుష్మాకం కాంచిదన్యా జగదుపరి సమా
ద్యుతి లావణ్య ధన్యా
ధన్యా శైలేంద్ర కన్యా త్రిభువన జననీ
విశ్వమాన్యా వదాన్యా,
నిశ్శంకం శంకరాంకే తటిదివ సహసా
ప్రోల్లసంతీ హసంతీ
రక్షా దక్షా విపక్షావళి విలయకరీ
శాంకరీ శం కరోతు.

# జాతీయవాదం: దుర్ఖ్‌హీమ్

## శ్రీ జాస్తి జగన్నాథం

[జనవరి సంచిక తరువాయి]

వ్యక్తుల సమాహారమైన సంఘంమాత్రమే వ్యక్తిని అధిగమించి శక్తిని సంపాదించగలదని దుర్ఖ్‌హీమ్ భావం. కనుక ఆస్ట్రేలియన్ తెగలను ఉత్తేజితం చేసి ఆ వ్యక్తులను అధిగమించినదిగా వారికి సామూహిక సాంఘిక శక్తి మాత్రమేనని దుర్ఖ్‌హీమ్ నిర్ణయించాడు. అంటే దేవుళ్లు, సంఘము లనేవి వేరువేరు కావు, ఒకటే అని అతను నిర్ణయించాడు. అంటే సాంప్రదాయిక ఆస్ట్రేలియన్ తెగలవారు సంఘాన్ని పూజిస్తున్నారన్న మాట. ఆ సంఘంలో వ్యక్తులుకూడ ఒక భాగమే కనుక ఆ భాగాన్ని కాక సంపూర్ణ సమాహారమైన సంఘాన్ని వారు పూజిస్తున్నారని దీనిభావం. అదేవిధంగా యెహోవా అంటే ఆ చిహ్నానికి వెనుక ఉన్న హీబ్రూ ప్రజలని అర్థం. ఈ సూత్రాన్ని అంగీకరించిన తరువాత మానవబుద్ధికి అందని మితశక్తి ఏదో ఉన్నదను కోవలసిన పనిలేదని దుర్ఖ్‌హీమ్ విశ్వాసం. ఎందుచేత నంటే ఆత్మయొక్క అమరత్వం అనేది వాస్తవానికి సంఘంయొక్క అమరత్వానికి చిహ్నమే. సర్వ పవిత్ర విషయాలు-అంటే సామూహికాచారాలు, భావాలు, ఉద్రేకాలు-సంఘంనుంచి పుట్టుతవి. సర్వ అపవిత్ర విషయాలు లౌకికవిషయాలు వ్యక్తినుంచే పుట్టుతవి. ఇంచుమించు అన్ని సాంఘిక సంస్థలు, సంప్రదాయాలు, మతంనుంచే పుట్టటానికి కారణం ఉన్నది. అదేమంటే మతానికి సంఘమే ఆత్మ. అట్లా క్లుప్తంగా దుర్ఖ్‌హీమ్ వివరించిన సాంఘికశాస్త్ర ప్రాథమిక సూత్రాలు ఇవే. ఈ సూత్రాలలో అంతర్గర్భితంగా ఉన్న జాతీయవాద ప్రాధాన్యం తరువాత పరిశీలిద్దాం.

### సాంఘిక పునర్నిర్మాణ ప్రణాళిక

అనాదిగా వస్తున్న చరిత్రలోని ఒక యుగానికి మరొక యుగానికి ఉన్న సంబంధం ఏమిటి? పూర్వ యుగంకంటే ఉత్తరయుగం చాలభిన్నంగా ఉంటూ వచ్చిందిగదా! మరి వీటిరెంటినీ కలిపే బంధం ఏమైనా ఉన్నదా? దీనికి దుర్ఖ్‌హీమ్ సమాధానం ఇచ్చాడు. గతించిన చారిత్రక కాలాలలోని స్థితిగతులను పరిశోధించటం ద్వారా ఈ ప్రశ్నలకు సమాధానం లభించినదని అతను అనుకొన్నాడు. చారిత్రక పరిణామ గమనానికి దుర్ఖ్‌హీమ్ సిద్ధాంతం ప్రకారం రెండు మార్గాలున్నవి. ఒకటి యాంత్రికం; రెండవది సజీవసమైక్యం.

సామూహిక వ్యక్తిత్వం మాత్రమే ప్రాబల్యంలో ఉన్న సంఘంలో, జాతులలో, తెగలలో యాంత్రిక గమనం ఉంటుంది. నిర్బంధపూరితమైన న్యాయశాసనాలు. మతసంప్రదాయాలు ఆ జాతుల సర్వకార్యకలాపాలలోను కనబడుతుండటం దీని ప్రత్యేకలక్షణం.

రెండవది సజీవసమైక్యం అనుకొన్నాం గదా! దీనికి ఆధునిక సంఘాలు ఉదాహరణ. జనసాంద్రత, జనసంఖ్య పెరిగిన కొలది సాంఘిక కార్యకలాపాలు బహుధావిభాగాలై సంఘంలోని వృత్తులు, ఆ వృత్తుల తెగలు అనేకంగా పెరుగుతు ఉంటవి. నేటి పారిశ్రామిక సంఘాలే దీనికి ఉదాహరణ. ఈ విధంగా సాంఘిక కార్యకలాపాలు విభాజితం అవటంవలన నిర్బంధ పూరితమైన చట్టాలు పోయి సివిల్ లా ఏర్పడుతుంది. వ్యక్తి స్వేచ్ఛ దినదినాభివృద్ధిగాంచటం ఆర్థిక సాంఘిక రాజకీయాది కార్యకలాపాలు మత ప్రాబల్యం నుంచి విడివడటం ఈ సజీవసమైక్యగమనానికి ముఖ్య లక్షణాలు. ఈ సజీవసమైక్యసూత్రాన్ని అనుసరించి యూరపియన్ సంఘాలలో ఎన్నో మార్పులు అత్యంత స్వల్పకాలంలోనే జరిగినవి. భౌతికంగా సాంఘిక వాతావరణం మారింది. కాని మానవుడు మాత్రం ఈ నూతన వాతావరణానికి అనువుగా సర్దుకోలేక పోయాడు. అంతవరకు వ్యక్తిని సంఘానికి బానిసగా బంధించుతున్న కట్లు సడలినవి. ఈ కట్లు ఊడేసరికి మానవునికి నైతిక ఆధారం దొరకలేదు, ఏకాకి అయి పోయాడు. పారిశ్రామిక సంఘాలలో దీనిఫలితంగానే ఆత్మహత్యలు అధికంగా ఉంటున్నవి. మానవునికి నైతికసూత్రాల విషయంలో ఆధారం, సాహచర్యం లభించక పోవటంచేత ఈ అయోమయస్థితి ఏర్పడుతున్నది. వాణిజ్యపారిశ్రామిక సంఘాలలో విషమస్థితి ఏమంటే ఈ సంఘాలలో ధనానికి శ్రమకు మధ్య - మరొక విధంగా చెప్పాలంటే కేపిటలిస్టులకు కార్మికు

లకు ముఖ్య-వైరుధ్యం. ఈ స్థితివల్ల ఆర్థికపు అరాజకత్వం ప్రబలిపోతుంది.

ఇలా ఉన్న సంఘాన్ని పునర్నిర్మించి నీతినియమాలకు సుఖజీవనానికి అవకాశం కలిగించటం కోసం దుర్ఖీమ్ కొన్ని సూచనలు చేశాడు. ఆ సూచనలు ఈనాడు ఎంతవరకు ఉపయోగపడుతాయన్న విషయం అటుంచి అతని మౌలిక కృషిని గమనించటం కూడ అవసరం. దుఃఖానికి, ఆత్మహత్యలకు దారితీస్తున్న ఈ ఆత్మాధిక్యవాదంనుంచి బయటపడాలంటే బలమైన ఒక నూతన ఆదర్శం కావాలని అతనిసూచన. ఈ నూతన ఆదర్శం మానవులను ఉత్తేజపఱచి ఆదర్శం కోసం వారు ఆత్మత్యాగం చేయగలవారుగా అయ్యేటంత బలమైనదిగా ఉండాలి. వ్యక్తులను ఉత్తేజపఱచి ఆత్మత్యాగానికి పురికొల్పగలగాలి. వ్యక్తులమధ్య పరస్పర బాంధవ్యాన్ని వృద్ధిచేయటం ద్వారా మాత్రమే ప్రస్తుత అరాజకస్థితి అంతరించగలదు. ఎవరికివారే యమునాతీరే అన్నట్లు కాక సంఘటితంగా వ్యక్తులందరు కలిసిమెలిసి ఉండేటట్లు చూడాలి. వారి అనుబంధాలను పెంచాలి. అంతటితో ఊరుకోనక వ్యక్తుల కార్యకలాపాలను నిర్బంధంగా నైనాసరే క్రమబద్ధం చేయాలి. ఇలా ఇవన్నీ చేయగలిగిననాడు నైతిక శాస్త్రానికి ఆధారం, బలం లభిస్తాయని దుర్ఖీమ్ భావం. నైతిక క్రమశిక్షణంటే ఇతనికి ఎక్కడలేని అభిమానం; ఎలాగైనా సరే దాన్ని సాధించాలని ఉబలాటపడుతుంటాడు.

దుర్ఖీమ్ దీనికొక పరిష్కారమార్గం సూచించాడు. గత చరిత్రలోని అనేకసంఘాలను, వ్యక్తుల కూడలులను పరిశీలించాడు. వృత్తిసంఘాలను పునరుద్ధరించి బలవత్తరం చేయగలిగితే ఈ నైతిక క్రమశిక్షణ అలవడగలదని అతనికి పరిశీలనవలన సంపూర్ణ విశ్వాసం కలిగింది. మన వర్ణవ్యవస్థ నాలుగుపాదాలమీద నడచిన రోజులలో సంఘానికి నైతికాధారం ఉండేదని ఈ సూత్రంవల్ల మనం నిష్పన్నం చేయవచ్చు. కాని ఈ నాటివృత్తులు వేరు; పైగా అసంఖ్యాకంగా ఉన్నవి. అందుచేత ఈ సూత్రంవల్ల కూడ మన వర్ణవ్యవస్థను పునర్నిర్మించాలనటం సాధ్యం కాదు.

కుటుంబం, విద్యావిధానం, మతం, ప్రాంతీయ సంఘాలు, ప్రభుత్వశాఖలు, రాష్ట్రాలు అనే విభజనల వల్ల నైతికపునరుజ్జీవనం కలగదని, వీటికి ఆశక్తి లోపించినదని దుర్ఖీమ్ ప్రగాఢవిశ్వాసం. వీటిని చారిత్రక ప్రాముఖ్యం ఉంటే ఉండవచ్చు గాక. కాని నేటి స్థితిగతులలో మాత్రం వీటివల్ల నైతిక క్రమశిక్షణ అలవడటం అసాధ్యమని అతని అభిప్రాయం. నేటి పారిశ్రామిక వాతావరణంలో ఈ వృత్తిసంఘాలే చాల చక్కగా పనిచేయగలవని, అసలవి అవసరమని అతని నమ్మకం. నేటి సంఘంలో పనిపాటలు బహుధా విభాగింపబడి ఏ శాఖకు ఆ శాఖ విడిగా నిర్వహింపబడుతున్న సంగతి మనకు తెలిసినదే. ఇలాంటి సంఘాన్ని పునరుజ్జీవింపచేయటానికి వృత్తిసంఘాలే ప్రధానమార్గమని—ఏకైకమార్గమని కూడ చెప్పవచ్చు. అతనివాదం ఈ వృత్తి సంఘాలు ఎంతకాలంపాటు నిలబడగలవు అన్న సందేహం ఉండనవసరం లేదు. ప్రాచీనకాలంనుంచి ప్రతి చారిత్రక యుగంలోను ఇవి ఉంటునే ఉన్నవి రోమన్‌గిల్డు నాటినుంచి నేటి వాణిజ్య పారిశ్రామిక యుగంవరకు ఇవి ఉంటూనే ఉన్నవి. ఈ భావానికి మనదేశ చరిత్రలో కూడ ఆధారాలు కనబడుతున్నవి. కె. పి. జయస్వాల్ గారి 'హిందూపాలిటీ' అన్న గ్రంథంలో దీనికి ఉదాహరణలున్నవి. అందుచేత ఈ వృత్తి సంఘాలవల్ల నైతికాభ్యుదయం కలుగుతుందని ఆశించటం... అతడు తీర్మానించాడు. కాని మాధ్యమిక యుగాలలో ప్రబలిపోయిన సంకుచిత స్థానికాభిమానాలను, సంఘాలను మాత్రం అతడు నిరసించాడు. ఇలాంటి వాటివల్ల ఏ ప్రయోజనము ఉండదని, అసలివి నిలబడలేవని అతని అభిప్రాయం అందుచేతనే ఆ తరువాత వచ్చిన జాతీయవాదం, రాజ్యాలు వీటిని అణచివేయగలిగినవని అతడు వివరించాడు.

ఇక ఈ వృత్తిసంఘాల నిర్మాణంగురించి అతడు చెప్పినదికూడ చూద్దాం దినదినం పరిశ్రమలు పెరిగిపోతున్నవి; ఈ పెరగటంలో వాటికి పరిహద్దులు కూడ ఉండటం లేదు. ఒక దేశంలోని భారీ పరిశ్రమలలో ఉత్పత్తి అయిన వస్తువులకు అంతర్జాతీయంగా అన్ని దేశాలలోను గిరాకీ ఉంటున్నది. అలాగే స్థానికావసరాలను తీరుస్తున్న చిన్నచిన్న కుటీర పరిశ్రమలు కూడ కొన్ని ఉన్నవి. కాని ఈ చిన్నచిన్న పరిశ్రమలను అవి ఉత్పత్తిచేస్తున్న వస్తువులను ఆధారంగా తీసి కొని కొన్ని తెగలుగా విభజించవచ్చు. ఇలా పరిశ్రమలన్నీ దేశవ్యాప్తంగా విస్తృతమై ఉండటంచేత వృత్తిసంఘాలను కూడ దేశవ్యాప్తంగానే ఏర్పాటు చేయాలి. ఈ వృత్తిసంఘాలు ఎక్కడికక్కడ చిన్నచిన్న కూడలులుగా ఉండటంకాక దేశస్థాయిలో ఉండాలి. ప్రభుత్వనియమాలకు లోబడి ఇవి పనిచేస్తూ ఉండాలి.

ఇక్కడ ఒక సందేహంరావచ్చు. ఈవృత్తిసంఘాలు స్వతంత్రప్రతిపత్తిగల సంఘాలా లేక రాజ్యాధికారానికి తలఒగ్గే బానిససంఘాలా? అని మనం ప్రశ్నించవచ్చు. ఈవిషయంలో దుర్ఖీమ్ నిర్దిష్టసూత్రాలను నిర్వచించలేదు. రాజ్యానికి ఈసంఘాలకు ఉండవలసిన సంబంధాన్నిగురించి అస్పష్టంగా చెప్పాడు. ఏమై

నప్పటికీ ఈ వృత్తిసంఘాలపైన రాజ్యానికి ప్రతి చిన్న విషయంలో నూ ప్రవేశం ఉండరాదని, ప్రభుత్వం కేవలం సార్వత్రిక శాసనాల సాధారణ సూత్రాలను మాత్రమే నిర్ణయించి అమలయ్యేటట్లు చూడాలని అతని అభిప్రాయం. ఈ వృత్తిసంఘాలకు ఒకదానికొకదానికి వైరుధ్యం పెరిగి సంక్షేమం, సమైక్యం విచ్ఛిన్నం కాకుండా చూడటానికి కూడా రాజ్యానికి అధికారం ఉండాలంటాడు. ఆయా రంగాలలోని ప్రవీణులు మాత్రమే చేయవలసిన ప్రత్యేక కార్యకలాపాలలో మాత్రం ఈ వృత్తిసంఘాలకు పూర్తి స్వేచ్ఛ ఉండాలని సూచించాడు. ఆంతరంగిక వ్యవహారాలలో మాత్రం ఈ వృత్తి సంఘాలకు స్వతంత్ర ప్రతిపత్తి ఉండాలి. ఇతర వృత్తి సంఘాలతో వైరుధ్యం వచ్చినప్పుడు తప్ప ఆ యా వృత్తులలోని వివిధశాఖల వైరుధ్యాలను సర్దుబాటు చేసికొనడానికి కూడ వీటికి అధికారం ఉండాలని సూచించాడు. దుర్ఖ్‌హీమ్ అందించిన ఈ ప్రణాళికవల్ల ఆయా ప్రాంతాలలో వృత్తిసంఘాల శాఖలు ఏర్పడటానికి ప్రోత్సాహం లభించింది.

ఈ ప్రాంతీయ సంఘాలకు దేశస్థాయిలోని వృత్తి సంఘానికి ఉండవలసిన సంబంధం ఎటువంటిది? అని మరొక ప్రశ్న వస్తున్నది. వృత్తిసంఘానికి రాజ్యానికి ఎలాంటి సంబంధం ఉండాలని చెప్పాడో ఈ ప్రాంతీయ శాఖలకు వృత్తిసంఘానికి కూడా అలాంటి సంబంధమే ఉండాలని దుర్ఖ్‌హీమ్ అభిప్రాయం.

ప్రస్తుతం అమలులో ఉన్న ప్రతినిధి పురస్సర రాజ్యాంగాలు సక్రమంగా, సమర్థవంతంగా నడవటానికి ఈ వృత్తిసంఘాలనుంచి ప్రతినిధులను పంపటం అత్యావశ్యకమని దుర్ఖ్‌హీమ్ అభిప్రాయం. సంఘంలోని ఆయా వర్గాల అభిమతాలు అభిప్రాయాలు శాసన సభలో వినపడాలన్నా లేక శాసనసభలు నిజమైన ప్రజాప్రతినిధులలో ఉండాలన్నా, ఈ వృత్తిసంఘాలకే ప్రతినిధులను పంపే అవకాశం ఉండటం పునాది అంటాడు. కాని ఇలా వృత్తిసంఘాల ప్రాతినిధ్యాన్ని అంగీకరించి అమలు చేసినంత మాత్రాన ఆనాటి ఫ్రెంచి సంఘంలోని సర్వావర్గాలు మటుమాయమై పోగలవన్న భ్రమ మాత్రం అతనికి లేదు. ఈ వృత్తిసంఘాలు సంఘంలోని ఆయా వర్గాల నిజమైన అభిప్రాయాలకు, అభిమతాలకు ప్రాతినిధ్యం వహించగలవు గనుక వ్యక్తికి జాతికి మధ్య ఉన్న అంతరం, ఖాళీ పూరింపబడుతుందని మాత్రం అతని నమ్మకం. ఈ వృత్తిసంఘాలలో ప్రతి ఒకటి కూడ దాని ప్రత్యేక సంప్రదాయాలతో, విధానాలతో, నియమనిబంధనలతో, ఒక సామూహిక వ్యక్తిత్వంతో విరాజిల్లగలదని అతని ఆశ. ఈ వృత్తి సంఘం తన సభ్యులకు విజ్ఞానవినోదాలను, పరస్పర సహాయాన్ని కలిగించగలదు.

పశ్చిమయూరప్‌లో తీవ్రమైన సాంఘిక సంస్కరణోద్యమాలు ప్రబలంగా ఉన్న రోజులలో దుర్ఖ్‌హీమ్ ఈ పరిశీలనలు చేశాడని గుర్తు చేసికొనటం అవసరం. కాల్వినిస్టులు, సిండికలిస్టులు, సోషలిస్టులు, సోషల్ కేథలిక్కులు, మార్క్సియన్ సోషలిస్టులు మొదలైన వారు ఎన్నో సంఘసంస్కరణోద్యమాలను రేపుతున్న రోజులవి. సుఖమయమైన ప్రపంచానికి ఎన్నెన్నో మార్గాలను సంతోషమార్గాలుగా భావించి చూపుతున్న రోజులవి. ఈ అన్నింటిలోను ఉన్న ఉపయుక్తమైన విధానాలను, ఆచరణయోగ్యమైన మార్గాలను గ్రహించి సంఘటిత పూర్వకమైన నూతన విధానాన్ని రూపొందించినదే దుర్ఖ్‌హీమ్ ప్రణాళిక. కార్మిక రాజ్య స్థాపనకని ఇతడేమీ కొత్తమార్గాలు వేయలేదు. అలాంటి విశ్వశ్రేయ సంపాదనకృషికి అంగీకరించనూ లేదు. గతచరిత్రతో సంప్రదాయాలతో ఉన్నట్టుండి ఒక్కసారిగా ఏదో విపరీత చర్యల ద్వారా సంబంధాన్ని తెంచుకొనటం అతనికి ఇష్టంలేదు. అంటే సంఘగమనాన్ని ఆకస్మికంగా మార్చాలని చేసే సాయుధ విప్లవ సిద్ధాంతం అతనికి రుచించదు. నూతనమైన సాంఘిక పునరుజ్జీవనసాధనకు ఈ వృత్తిసంఘాలే ఆధారమని అతని ప్రగాఢవిశ్వాసం. ఈ వృత్తిసంఘాలను చిన్న చిన్న స్థాయిలనుంచి దేశస్థాయివరకు అన్ని దశలలోను ఏర్పరచాలని అతని సూచన. వ్యక్తిని ఆర్థిక ప్రయోజనాలను – రెంటిని కూడ – ఈ వృత్తిసంఘాల విజ్ఞతా పూర్వక క్రమశిక్షణకు లోబరచటం ద్వారా క్రమంగా శాంతియుతంగా సాంఘిక పునర్వికాసం సాధ్యమవుతుందని అతడు విశ్వసించాడు.

## జాతీయవాద తత్త్వం

దుర్ఖ్‌హీమ్ ప్రతిపాదించిన జాతీయవాదంలో అతని సాంఘిక శాస్త్రసూత్రాలు ఏవిధంగా వ్యక్తమవుతు ఉంటాయో ముందు చూద్దాం. అతడు సాంఘిక విషయాలను వాస్తవ వస్తువులుగా గ్రహించాలని ప్రతిపాదించిన వాస్తవవాది. సంఘానికి ఒక వ్యక్తిత్వం ఉన్నదని ఆ వ్యక్తిత్వం వ్యక్తులకంటె భిన్నమైనది ఉత్కృష్టమైనది అని చాటినట్లుగా ఇదివరలో అనుకున్నాం గదా! సంఘానికి యింతటి ఉత్కృష్టతను, వాస్తవత్వాన్ని ఇచ్చి మాటిమాటికీ దానిని పరించి నొక్కి చెప్పే ఇతడు జాతి వీటి అన్నింటికి ఉన్నతమైనదని, పునాది అని ఎలా చెప్పగలిగాడో పరిశీలిద్దాం.

'సంఘాలు' అన్నప్పుడు కుటుంబం, తెగ, నగర రాజ్యం, జాతి అనేవే కాక మతశాఖలు, విద్యాలయం, వృత్తిసంఘం మొదలైనవి కూడ సంఘాలే అని ఇతని

అభిప్రాయంగా మనం గుర్తించాం. ఇవన్నీ సంఘాలే; కాని సమప్రాధాన్యం గల సంఘాలు మాత్రం కావు. రాజకీయసంఘం మతసంఘం మాత్రమే ఉన్నత ప్రాధాన్యం గల సంఘాలని అతడంటాడు. రాజకీయ సంఘం అంటే పరిపాలన సూత్రాలతో కూడిన రాజ్యమని ఇతని అభిప్రాయం. ఆ నాటి ఫ్రెంచివారి ఆధ్యాత్మిక వాసనల కేంద్రీకరణతో మతసంఘానికి రూపం కల్పించాడు. జాతి అనే ఒకే ఒక వాస్తవ రూపానికి ఈ రాజకీయసంఘం, మతసంఘం భిన్నస్వరూపాలని అతని భావం. రాజ్యానికి జాతిమాత్రమే సరైన పునాది అని అతని విశ్వాసం, దీనికి సాక్ష్యంగా అతని వాక్యాన్నే చూపవచ్చు. "ఆయా జాతులకు సంబంధించిన కారణాల వలనగాని, లేక చారిత్రక కారణాల మూలంగా గాని ఒకే శాసనం క్రింద ఒకే రాజ్యంగా జీవించాలని ఆశించే వ్యక్తుల సమూహమే జాతీయత. పర్యవసానంలోను ఉండే ఈ వాంఛ ప్రబలమైనప్పుడు దానికో గౌరవం ఏర్పడుతుందన్న విషయం నేటి నాగరిక ప్రజలు అంగీకరించిన విషయమే. ఇటువంటి గౌరవం పొందిన వాంఛమాత్రమే సంఘానికి గట్టి పునాది కాగలదు."

ఇక అతని జాతీయవాద స్వరూపాన్ని పరిశీలిద్దాం. అతని సంఘాలు వ్యక్తులకంటె భిన్నమైనవి ఉన్నతమైనవి అని ముందే గమనించాం. అలాగే అతని జాతి కూడ దానిలోని వ్యక్తులకంటె, ఆ వ్యక్తుల సమాహారంకంటె కూడ ఉన్నతమైనది. పైగా ఆసభ్యుల దేశంకంటె కూడ విస్తృతమైనది. ఇది ఒక మనోజీవి అని చూచినప్పుడు నైతికశక్తి భౌతికశక్తి కూడ దీనిలో ఉన్నవి. సంఘనిర్మాణంలోని ప్రధానాంశాలు సాంఘికవిషయాలని. ఈ సాంఘిక విషయాలు న్యాయ నైతిక రాజకీయ సూత్రాల రూపంలోను, మత సంస్థల రూపంలోను, సామూహిక సంప్రదాయాల రూపంలోను రూపురేఖలు దిద్దుకొంటాయని అతడు చెప్పినాడు గదా! దీనిని గుర్తుచేసికొన్న పక్షంలో అతని జాతి స్వరూపం కూడ తేలికగా బోధపడుతాయి. అతడు ప్రతిపాదించే జాతీయసంఘ నిర్మాణానికి సంస్కృతి మూలం. అందుచేత సంప్రదాయాలు, ఆచారాలు గత చరిత్రనుంచి వచ్చే విశ్వాసాలు మొదలైన వాటితోనే అతనిజాతి ఆవిర్భవిస్తుంది.

ఈ అభిప్రాయాన్ని బట్టి తర్కికంగా మనం ఒక విషయం చెప్పవచ్చు. ప్రతి సామూహిక జాతికి (అంటే సంఘం అని అర్థం) దాని ప్రత్యేక మనోగతులు. ఆత్మలక్షణాలు ఉంటాయని ఈ సూత్రంవల్ల తేలుతున్నది. ఇలా ప్రత్యేకసంఘాలలో కనిపించే విశిష్టలక్షణాలు. ప్రత్యేక స్థితిగతులు మొత్తం విశ్వంలో ఇదే రూపంలో కనిపించే అవకాశం లేకపోవచ్చు. ప్రతిజాతిలోను న్యాయశాస్త్రం ఆర్థక వ్యవస్థ సాహిత్యం, భాష, పురాతన శిథిలాలు, నైతికతత్వశాస్త్రం ఆ ప్రజల లక్షణాలను బట్టి ఉంటుంటవి. ప్రజలలోని ఆలాంటి లక్షణాలు రోజురోజుకి మారేవి కావు. ఆయా జాతులు నివసిస్తున్న దేశాల శీతోష్ణస్థితిగతులు, భౌగోళిక పరిస్థితులు ప్రతిసంవత్సరం చూడవచ్చు కాని ఇవి మారినంత త్వరగా ఆ జాతిలక్షణాలు మారవు. మార్పుని పరిణామాన్ని కలిగించేశక్తులు ఎంత శక్తిమంతంగా ఉన్నప్పటికి జాతి అనేది జీవించి ఉన్నంత కాలం ఆ జాతియైక్యమును సంరక్షించటంగురించి దుర్ఖీమ్‌కు నిర్దిష్టభావాలెన్నో ఉన్నవి. ఆ జాతీయైక్యము ఎల్లకాలం నిలబడుతుందని, నిలబడేటట్లు చేయాలని అతని ఉద్దేశం. జాతీయ సంఘాభివృద్ధిలో కూడ ఐక్యము అనేది ఉండబోవటానికి అతనికి ఫ్రాన్సులో చక్కని ఉదాహరణాలు కనిపించినవి.

ఏది చెప్పినా సులభంగా, నిర్దిష్టంగా, హేతుబద్ధంగా చెప్పటం ఫ్రెంచివారి లక్షణమని అతని భావం. హేతుపరిశీలనకు అందని అయోమయభావాల వ్యక్తీకరణకు అసలు ఫ్రెంచి భాషే తగినది కాదని అతని అభిప్రాయం. ఫ్రెంచి కవులు, నవలాకారులు, కళాకారులు మానవునిగురించి సాధారణంగా వ్రాశారే తప్ప హామ్లెట్, ఫాస్టుల సంశ్లిష్టము సమ్మిశ్రితములయిన ప్రత్యేక పాత్రలచిత్రణ వారి కృతులలో లేదని అతడంటాడు.

మొదటి ప్రపంచయుద్ధానికి ముందు జర్మన్ జాతినిగురించి ఆ జాతి విశిష్టలక్షణాలనుగురించి అతనికెంతో విశ్వాసం ఉండేది. కేవల వ్యక్తిత్వవాదంతో సతమతమవుతున్న ఫ్రెంచి జాతి జర్మన్ జాతినుంచి ఎంతో నేర్చుకోవలసి ఉన్నదని అతనికొక భావం ఉండేది. అందరూ కలిసి పాడటం, ఆడటం, నడవటం అనేవి జర్మన్‌జాతి ప్రత్యేక లక్షణాలని, వీటినుంచి ఇతర జాతులు తమ సమైక్యంకోసం ఎన్నో విషయాలు నేర్చుకోవలసిఉన్నదని అతడన్నాడు. కాని ఆ తరువాత జర్మన్ మనస్తత్వంలో అతనికి కొన్ని క్షీణలక్షణాలు, హానికరమైన లక్షణాలు గోచరించినవి. దీనికి కారణం యుద్ధమనస్తత్వంగురించి అతడు కావించిన పరిశోధనలే. జర్మన్ జాతి లక్షణాలను వివరించటంలో అతడు ట్రీచెల్ తత్వశాస్త్రాన్ని ప్రమాణంగా గ్రహించి అంగీకరించాడు. జర్మనివారి అహంకారానికి అత్యాశకు, నియమబద్ధమైన దాస్యానికి, నియంతృత్వానికి ఒక కారణాన్ని అతడు వివరించాడు. ప్రపంచాన్ని ప్రభావితం చేయటంలో సర్వమానవశక్తులకంటె రాజ్యమే ఉన్నతమైనదన్న భావమే దీనికి కారణమని అతని అభిప్రాయం.

నైతికబంధాలు లేకుండాపోయిన ఫ్రెంచివ్యక్తులను సుసంఘటితమైన సంఘంలోనికి తీసికొనివచ్చి ఫ్రెంచి సంఘాన్ని బలవత్తరం చేయాలని అతడు సంకల్పించాడు. ఇలాంటి సుసంఘటిత సంఘావశ్యకతను నిరూపించటానికి, దానివలన మానవజాతికి కలుగగల ప్రయోజనాలను చూపించటానికి దుర్ఖ్‌హీమ్ ఆత్మహత్యలను గురించి అత్యద్భుతపరిశోధన కావించి ఒక గ్రంథమే వ్రాశాడు. మతం, కుటుంబవ్యవస్థ, రాజకీయసంఘం ఎంత సంఘటితంగా ఉంటె ఆత్మహత్యలు అంత తక్కువగా జరిగినట్లుగా అతడు తన పరిశోధనలలో కనుగొన్నాడు. ప్రొటెస్టెంటులకంటె కేథలిక్కుల సంఘాలలో ఆత్మహత్యలు చాలతక్కువ. దీనికి కారణం కేథలిక్కు సంఘం సంఘటితంగా ఉండటమే. ఈ ఆత్మహత్యలు చరిత్రలో ప్రతిదశలోను, ప్రతిసంఘవ్యవస్థలోను ఎలా వింతగా ఉండేవో చూడటంకోసం మొత్తం మానవజాతి చరిత్రనే పరిశోధించాడు. సంఘం వ్యక్తులను ఆకర్షించలేక బలహీనపడినప్పుడు, వైయక్తికాహంకారం ప్రబలినప్పుడు మానవజాతిని ఎంతో దుఃఖం అశాంతి ఆవరించిఉండేవి. అలాకాక జాతికే ఒక విషమస్థితి ఏర్పడి యుద్ధాలు ఆవిర్భవించినప్పుడు, వ్యక్తిమనస్సులో జాతీయత జాతీయైక్యము మతాభిమానం స్థానం సంపాదించుకొన్నప్పుడు, దేశభక్తులు తమతమ సంఘాలతో తాదాత్మ్యం పొంది ప్రవర్తించినప్పుడు, ఆత్మహత్యలసంఖ్య చాలవరకు తగ్గిపోయినదని అతడు చరిత్రలో నుంచి ఉదాహరణలిచ్చి నిరూపించాడు.

అందుచేతనే ఫ్రాన్సుని సర్వవిధాల సంఘటితమైన జాతినిగా చేయాలని అతడు ఆశించాడు. కాని ప్రాచీన సంఘాలలోవలె సామూహిక వ్యక్తిత్వంలో మానవులవ్యక్తిత్వం పూర్తిగా లీనమై అణగిపోయేటంతటి సంఘటితత్వం మాత్రం అవసరం లేదని చెప్పాడు. రాజకీయంగా కేంద్రీకరణను సాధ్యమైనంతవరకు అధికంచేసి తద్వారా తన ఆశయాన్ని సాధించాలని కూడ అతని ఉద్దేశ్యం కాదు. పైగా ఈ రాజకీయ కేంద్రీకరణవిధానం అనుసరించటంచేతనే వ్యక్తి నైతికబంధాలు లేక పతనమైపోయాడని అతని అభిప్రాయం. వ్యక్తికి జాతికి మధ్య సజీవసంబంధాలను, అనుబంధాలను ఏర్పరచటం ద్వారా ఈ నైతిక అవ్యవస్థను తొలగించాలని ఆ ఖాళీని పూరించాలని అతని ఆశ. "రాజ్యానికి, ఆయావ్యక్తులకు మధ్య కొన్ని ఉపసంఘాలు ఉండాలి. ఈ ఉపసంఘాలు వ్యక్తులను అందుబాటులో ఉండి వారిని ఆకర్షిస్తూ సాంఘికజీవిత ప్రవాహంలోకి తీసికొని రాగలవిగా ఉండాలి. అప్పుడే జాతిని నిలబెట్టటం సాధ్యమవుతుంది."

వికేంద్రీకరణ ద్వారా పెద్దఎత్తున సంఘటితమైన జాతీయైక్యమును సాధించాలనటం చాల విచిత్రంగా, విశ్వసించవీలులేకుండా కనిపించటం సహజం. కాని దుర్ఖ్‌హీమ్ చెప్పిన పైవాక్యంలోని అర్థం ఇదే! ఇక్కడ ఒకవిషయాన్ని రుజువుచేసికోవటం అవసరం. సాంఘిక

# జాతీయవాదం: దుర్ఖీహిమ్

పునరుజ్జీవనానికి నేటి పరిస్థితులలో వృత్తిసంఘాల నిర్మాణమే శరణ్యం అనిగదా దుర్ఖీహిమ్ చెప్పినది. ఈ వృత్తిసంఘాలు దేశస్థాయిలో స్థాపించి, వాటిని ఎక్కడికక్కడే చిన్నస్థాయిలలో స్థాపించి, వాటిని ఏకంచేసే సూత్రం ఏర్పరచి, తద్ద్వారా జాతీయజీవన సమైక్యం సాధించాలని అతడు ప్రతిపాదించాడు. అంటే వికేంద్రీకృతమైన వృత్తిసంఘాలే జాతీయైక్యానికి పునాది అని తేల్చాడన్నమాట. ఆ సాంఘికశాస్త్ర సూత్రాన్నే ఇక్కడ జాతీయవాదానికి కూడ అనువర్తింపచేశాడు, కనుక దీనిలో ఆశ్చర్యపడవలసినది లేదు.

అయితే యిక్కడ ఒక సందేహం ఉన్నది. రాజ్యం కేంద్రీకృతమైనందువల్ల వ్యక్తికి అనుబంధం దొరకక నైతిక అవ్యవస్థ ఏర్పడినది. కనుక రాజకీయ కేంద్రీకరణ అనర్థదాయకం అన్నాడు గదా! మరి జాతి పేరుతో కేంద్రీకరణ సాగించినప్పుడు మాత్రం ఈ అనర్థకాలు ఎలా రాకుండా పోతవి? ఒకవేళ వికేంద్రీకరణద్వారా జాతీయైక్యాన్ని సాధించాలని అన్నాడు గదా అనుకొంటే అదే వికేంద్రీకరణసిద్ధాంతంతో రాజ్యమే జాతి స్థానాన్ని ఎందుకు ఆక్రమించరాదు? ఈ ప్రశ్నలను గురించి పాఠకులు యోచించటం అవసరం.

జాతిసమైక్యతను సాధించటంలో బహిరంగ సభలు, ఉత్సవాలు, చిహ్నాలు (పతాకం మొదలైనవి) చాల ప్రధానపాత్ర వహిస్తాయని వాటి అవసరం ఎంతో వున్నదని దుర్ఖీహిమ్ నమ్మకం. "ఒకేభావాన్ని చెప్పటం ద్వారా, ఒకేభావను శబ్దాన్ని ఉపయోగించటం మూలంగా, ఒకే నడవడిని అనుసరించటంచేత మాత్రమే ప్రజలు సమైక్యభావాన్ని పొందగలరు." జాతీయవాద సంపూర్ణతత్త్వం, వాస్తవరూపం ఈ ఒక్క వాక్యం ద్వారానే గ్రహించటానికి వీలున్నది. ఇలాంటి సంఘం ఆవిర్భవించినప్పుడు మానవత్వం, వైవిధ్యం, పరిశీలన, హేతువు అన్న వాటికి ఎంత చోటు ఉంటుందో, మానవుని సృజనశక్తికి ఎంత విలువ ఉంటుందో పాఠకులే ఊహించుకోవటం మంచిది.

జాతికి చిహ్నంగా ఒక పతాకం ఉండవలసిన అవసరాన్ని గురించి ఇతడు నొక్కి చెపుతాడు. మతాల ఉనికికి ప్రాబల్యానికి సాకారుడైన భగవంతుడెంత అవసరమయ్యాడో జాతి ఉనికికి ప్రాబల్యానికి ఈపతాకం అంత అవసరమని అతనిభావం. దానివల్లనే ప్రజలు అనుదినం ఉత్తేజం పొందటం, జాతిలో సమైక్యం కొనసాగటం జరుగుతుందని, అలాంటి పతాకం లేనప్పుడు వ్యక్తికి జాతికి మధ్య అనుబంధం ఏర్పరచే సూత్రం లోపిస్తుందని అతనివాదం. రాజకీయపక్షాలు, మత ఆర్థిక సాంఘిక సంస్థలు అప్పుడప్పుడు తరుచు సమావేశాలు జరుపుకొని అందరు కలిసి ఒకసారి తమ ఆశయాలను ఏకకంఠంతో పలకటం కూడ ఇలా తమ విశ్వాసాలను పటుతరం చేసికొని సంఘటితం కావటానికే. సంఘంయొక్క ఆలోచనలను సాధారణవిశ్వాసాల మీద ఆశయాలమీద కేంద్రీకరించగల సభలు, ఉత్సవాలు, ఆచారాలు ఎంతో ప్రయోజనకారులని, జాతిశక్తియుక్తులను పెంపొందించే నైతిక పునర్నిర్మాణానికి సహాయపడగలవని అతని గాఢవిశ్వాసం. 1880 జూలై 14 వ తేదీని జరిగిన 'బాస్టిల్' పతన వార్షికోత్సవసందర్భంలో దుర్ఖీహిమ్ ప్రజల ఆనందోత్సాహాలలో భాగం పంచుకొంటూ పరవశుడై ఆ ఉత్సవోద్రేకంలో ఆ రోజల్లా వీధుల వెంట తిరిగాడట! 1914 లో యుద్ధం ఆరంభమైన తరువాత కూడ ఇతడు ఇదేవుత్సాహంతో జాతీయైక్యం కొరకు పాటుపడ్డాడు. మేధావులనుకూడ యుద్ధానికి పురికొల్పగలంతగా విజ్ఞతాపూర్వక ప్రచారం చేశాడు. జాతిలో ధైర్యాన్ని ఐకమత్యాన్ని నిలబెట్టి తద్వారా విజయలక్ష్మిని సంపాదించటానికి అహోరాత్రం కృషిచేశాడు. సామూహిక వ్యక్తిత్వంనుంచి ప్రతివాడు ధైర్యసాహసాలు పొందాలని, ఏది ఏమైనప్పటికి దేశంకోసం ఎంతటి త్యాగం చేయటానికైనా సిద్ధంగా ఉండాలని అనేక రచనలు, ఉపన్యాసాలుచేసి ప్రజలను ఉత్తేజపరిచాడు. ఆ రోజులల్లో యుద్ధాన్ని గురించి ఏ సభజరిగినా ముందు అతడు హాజరు. సంఘంయొక్క సహకారపూరితకృషిలో అతనికి ఉన్న విశ్వాసం ఇంత అంత అని చెప్పటానికి వీలులేనిది. ఆనాటి సాంఘికార్థిక విద్యా సంఘాలలో పండ్రెండు ప్రధాన సంఘాలలో దుర్ఖీహిమ్ ప్రముఖసభ్యుడుగా ఉండేవాడని జార్జెస్ డేవీ చెపుతున్నాడు. దీనినిబట్టి సహకారపూరిత సంఘటితకృషిలో అతనికి ఉన్న నమ్మకం అర్థం చేసికొనవచ్చు.

ఒక్క విద్యవలన, విద్యారంగాన్ని సంస్కరించినందువలన సమకాలికసంఘంలోని చెడునంత ప్రక్షాళనం చేయవచ్చునని అతడు అంగీకరించడు. కాని వైయక్తిక పునరుజ్జీవనకృషిలోమాత్రం విద్యకు ప్రముఖస్థానం ఉన్నదని అంగీకరించాడు. విద్య మానవునిలో సాంఘికజీవిని సృష్టించినదని, ఈ సాంఘిక జీవితమనేది వారసత్వమేమీ కాకపోయినప్పటికి మానవజీవితానికి విలువను ఔన్నత్యాన్ని సంపాదించినదని అతనిభావం. అందుచేత విద్య అవసరం అవుతున్నది. కాబట్టి విద్య అనేది యువకులతరాన్ని క్రమబద్ధంగా సాంఘికీకరించే సాధనం అన్నమాట. సంఘం తన ఉనికిని ఎప్పటికప్పుడు పొడిగించుకుపోవటానికి ఇదొక మార్గమన్నమాట.

(సశేషం)

# మైలార దేవుడు

శ్రీ జి. ఆర్. వర్మ



'ఐనవోలియయ్య'• మైలారుదేవుడు.

శ్రీడాభిరామములో పేర్కొనబడిన దైవాల్లోకల్లా వింతగా — బహువ్యాప్తుడుగా — చరిత్రకు ఒక సమస్యగా కనిపించే దేవుడు మైలారుడు. ఏకవీర కాకతమ్మలగూర్చి పరిశోధించే వారిసంఖ్య అత్యల్పం కాని ఈ దేవునిగూర్చి పరిశోధించేవారిలో మనకన్న ఎక్కువగా కన్నడ మహారాష్ట్రులున్నారు.

నేను శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిని తిరుపతిలో దర్శించి చర్చించినప్పుడు వారు మైలారుడు గూర్చిన నా అభిప్రాయాలు నూతనవిశేషాలుగా గుర్తించి మంత్రశాస్త్రం కూడా జూడమన్నారు. వారి ప్రోత్సాహఫలితమే ఈ దేవుని బహురాష్ట్ర వ్యాప్త చరిత్ర విషయసంకలనం.

చెన్నపట్నం ప్రాచ్యలిఖితగ్రంథ భాండారంలో మాకు సంబంధించిన "కర్ణకులం — పెటికె బంధువులు" అనబడిన వారిగూర్చి "కర్ణకులీనుల ఘనచరిత్ర"లో నున్న విషయం..."ఋషుల్ ప్రముఖులుగొల్వ! తేకువ మాళవిదేవితో గూడి| తిరమొప్ప మల్లారి దేవుండు ..." ప్రత్యక్షుమైనట్లు వంశకర్త వీరమల్లు పరశురాముని యుద్ధగాథ సందర్భమున చెప్పుచున్నారు. అదే గ్రంథాలయంలో మరో వ్రాత ప్రతిలో—మంత్రశాస్త్రం — మైలారు రూపవర్ణన: ధ్యానం : "నీలం జీమూత వర్ణం సకల మోహనమయం త్రిశూల డమరుక ఖడ్గ పాశపాత్రం త్రిలోచనం ఉగ్రదంష్ట్రం కపర్దినం బిభ్రతి భమణిప్రభం సశక్తి సర్వభూషణ సంపన్నం స్ఫురత్ మకరకుండలం| సర్వం గాత్వ సర్వం రక్షా దేహోహరా యుద్ధే మహాబలం మంత్రం :— ఓం హ్రీం హ్రాం శ్రీం మైలారాయ మాళచిభవన్ని యోగమూర్తయే నమః ఓం హ్రీం శ్రీం ధనపతయే స్వాహా:"

మా వారిలో వివాహ సమయాన రాక్షసవిధానం సూచించె ఆచారం ఒకటుంది. వరుని బాణములతో తాకుతూ నీకే అయుష్యంవలన ప్రమాద ముండదని దీవించేట్లుంటుంది. అంతకుముందు వివాహవేదికలో మైలారదేవుని పూజిస్తారు. ఈ మైలారదేవుని రూప చిత్రం - ఒక గోనెసంచిపై రేఖాచిత్రంగా వారు పూజించడం- ఆ చిహ్నం సూర్యచంద్రులు మధ్య బాకు- ఉజ్జయినీ చిహ్నంవలె నుంటుంది.

మైలారుదేవుడు తెలంగాణా శాసనాల్లో పేర్కొనబడెను. "క్రీడాభిరామము"లో వర్ణన మరొకవిధము.

"శనివార సిద్ధి సజ్జన పారిజాతంబు
వరదాత యాదవ్యవారభోగి
మాడచీర మడంగు నాగు వినోదుండు
మాళవి ప్రియభర్త మహితయశుండు
పల్లెంబ నాయకుం డెల్ల వెల్పులరాజు
గనపవేటల వేడ్క కొండ్రభర్త
కత్రశాలస్వామి కరుణాపయోరాశి
పుణ్యకీర్తనుండైన ప్రోలియయ్య
మంచు కుంచెం గొలువంగ మాయకాళ్ళ
బట్టి కట్టంగ నేర్చిన బాసవల్లి
భైరవుని తోడబుట్టు మైలారదేవు
డోరుగంటి నివాసి మేల్లోసంగుగాత."

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు పరిష్కరించిన ఈ పద్యంలో 'మాడచీర మడంగు' పాఠం సరికాదు. లేదా ముద్రారాక్షసం అయ్యుండాలి. మైలారుడు 'మాడచీరమణుండు' ఈ దేవుడు కొండరి కుల దైవం. మహారాష్ట్రరాజుల దేవుడు. మహారాష్ట్ర



'ఓరుగంటి నివాసి'—మైలారు దేవుడు. గట్టుమల్లన్న అంటున్నారు.

ఈయన్ని ఖండేరావు, ఖండోబా అనెదరు. కన్నడిగలు మల్లారి, మార్తాండభైరవు డన్నారు.

ఏకవీర కాకతమ్మ ఒకే అమ్మవారి రూపభేదం అనుకున్నట్టే భైరవుడు, మైలారుడు ఒకే దేవుని వేరు రూపాలనవచ్చును. మైలారుని కిద్దరు భార్యలు. శైవంగా పరిగణిస్తున్నా జైనచ్ఛాయలు లేకపోలేదు. మంత్రశాస్త్రంలో చెప్పినదే కాదు అయినవోలు, వరంగల్ ఆలయాల దైవాల తీరున్నారు.

ఇంద్రుడు, సూర్యుడు, కార్తికేయుడు, శివుడు ఈ మైలారులో నున్నారు. ఈ చరిత్రలో కొందరి రాజులు, వీరుల కథలుకూడా కలిసిపోయినట్లుంది 'శబ్దరత్నాకరం' క్షుద్రదైవం అంటే, కిటెల్ నిఘంటువులో పల్లెంబదేశాధీశు డనికూడా అన్నాడు. మైలార లింగమూర్తి, అశ్వికుడు. శ్వానపరివేష్టితుడు. పశుపతి. కిరాతుడూను. రుద్రుడేమో అనిపించే అంశాలున్నాయి.

క్రీడాభిరామమున పేర్కొన్న స్థలములు: 'ఓరుగంటి నివాసి'. ఇప్పుడు ఖిల్లాప్రాంతంలో మన కగుపడదు. కాని వరంగల్లు పట్టణపారిశ్రామిక (ఆజంజాహిమిల్సు) ప్రాంతంలో ఒక పెద్దచెరువు గట్టుననున్నదొక ఆలయం. కట్టమల్లన్న-అంటే గట్టుమీద శివుడు అంటున్నారు. ఛాయాచిత్రం ప్రప్రథమంగా ఇందులో ప్రకటితమైనది. కార్తికేయుడేమో అనిపించేట్టున్న విగ్రహం. కుషానులనాటి వాడేమో అనిపించేట్లు మొలలో కత్తి—అంగీ. ఎర్రగొల్ల అర్చకుడు.

వరంగల్ పట్టణానికి పదిపన్నెండు మైళ్లలో ఉంది అయినవోలు గ్రామం. క్రీడాభిరాముడు పేర్కొన్న 'అయినవోలి మల్లయ్య' ఛాయాచిత్రంకూడా ఇందులో ప్రప్రథమంగా ప్రకటిస్తున్నాము. ఇక్కడ మకరసంక్రమణ కాలాన గొప్ప ఉత్సవం జరుగుతుంది. పదేళ్ళ క్రితం జూచివచ్చినప్పటి రంగు, రుచులు ఇప్పటికే మారిపోయాయి. సాహెబుగారిలా దేవుడు చొక్కాలాగూ తొడగడం వింతగా ఉండకపోదు. మహారాష్ట్రుల్లో మహమ్మదీయులు మైలారదేవుని మల్లుఖాన్ అంటారట.

అయినవోలియ్య రూపం అంతా ఏదో మంత్రతంత్రాల సంబంధం కలిగినట్లుంది. మైలారుడంటూనే ఆయన్ని ఖండేరావు అంటున్నారు. భార్యలపేర్లు గొల్లకేతమ్మ, మేడలదేవి అంటున్నారు. ఇందులో గోళకీమఠం, గొల్ల సంబంధం వుండేది.

మైలారుడొక క్షేత్రపాలకుడు, పంబదేవుడేమో అనుకుంటున్నాను.



# అల్బర్ట్ కామస్

ఫ్రెంచి నవలలకు ఇంగ్లీషు నవలల కున్నంత నిర్మాణ సౌష్ఠవం లేదనే అభిప్రాయం సామాన్యమై పోయింది. డ్యూమాస్, హ్యూగో, మారియాక్ వంటివా రున్నప్పటికీ, మొత్తం మీద ఫ్రెంచి నవలా సంప్రదాయం బుద్ధి ప్రధానమైనది. అల్బర్ట్ కామస్ ఫ్రెంచి సంప్రదాయానికి చెందినవాడే; కాని, వి. ఎస్. ప్రిచ్చెట్ చెప్పినట్లు, కామస్ శిల్ప ప్రతిభయొక్క ఉత్కృష్టతవల్లనే ఆయన ఆలోచనాధారకు మనం అభిముఖులము అవుతాము.

ఇంగ్లీషులో లభ్యంగావున్న కామస్ నవలలు మూడే—"ది ఔట్ సైడర్", "ది ప్లేగ్", "ది ఫాల్". వీటి మూటిలోనూ రెండవదే సందేహం లేకుండా గొప్పదని చెప్పవచ్చు. పైన అన్నట్లు ఈనవల శిల్ప సమగ్రత వల్లనే దానిలోని సిద్ధాంతాలు మనల్ని ఆకర్షిస్తాయి. ఫ్రాన్సులో జర్మన్ సైనికాక్రమణ దీనిలో ప్లేగ్ వ్యాధిగా చిత్రించబడింది. జర్మన్ ఆక్రమణను, యీ ఒక్క నవల ఎన్నో పుస్తకాలకన్నా స్పష్టంగా చిత్రించినదని "ది హిస్టరీ ఆఫ్ వెస్టర్న్ లిటరేచర్"లో శ్రీ కోహెన్ (వ్రాశారు.) బ్రతికి ఉండటమే మన పరమార్థమనుకొని మృత్యువుతో పోరాడాలని ఈ నవలలోని ముఖ్యభావం. ఒక పెద్ద ప్రమాదం సంభవించినప్పుడు, దైవేచ్ఛ అని ఊరుకోనకుండా శక్తికొలది ఎదిరించాలని కామస్ సూచిస్తాడు. "ది ఔట్ సైడర్"లో కథా ప్రాధాన్యం చివర చివరకు తగ్గిపోయి, ముఖ్యపాత్ర సిద్ధాంతాల వివరణ ఎక్కువై పోతుంది. తనకు తెలిసి తెలియకుండా చేసిన హత్యకు శిక్ష విధించినవారు ఈ నేరానికేకాక అతని ఇతర జీవిత విశేషాలకు కూడా అతనిని శిక్షిస్తారు. చనిపోయేముందు కూడా తన సంఘంలోని నీతిని అతడు స్వీకరించలేకపోతాడు. "ది ఫాల్" అసలు నవల అనటం కష్టం. పశ్చాత్తాపమనే అవస్థను ఇందులో పరీక్షించడంచేత కామస్ రోమన్ కాథలిక్ అవుతాడేమోనని కొందరనుకున్నారు. కాని అటువంటి దేమీ జరుగలేదు. ఇంచుమించు ఈ సమయంలోనే అతనికి నోబుల్ బహుమతి ఇచ్చారు.

సిసిఫస్ అనే రాక్షసునికి దేవతలు విధించినశిక్ష కామస్‌ను ఎంతో ఆకర్షించింది. జ్ఞానమెప్పుడూ సంపూర్ణం కాజాలదని, జిజ్ఞాసకు ఈ జగత్స్వరూపం కూడా ఎప్పుడూ విరోధంగా వుంటుందనీ ఇతని అభిప్రాయం. ఈ వైరుధ్యంలోనే కామస్ 'అబ్సర్డ్' (Absurd) సిద్ధాంతం ఇమిడి ఉన్నది. సిసిఫస్ కొండమీద చేర్చబోయిన రాయి పడిపోతూనే ఉంటుంది. అయినా మళ్ళీ అదే ప్రయత్నం చేస్తూనే వుంటాడు. మానవుని పరిస్థితి ఈ విధంగానే ఉన్నదన్నమాట. కామస్ ప్రజాస్వామ్యవాది కాని నియంత్రణా సహిష్ణువైన స్వభావం కలవాడు. తనకు తిరుగుబాటు (revolt) లో నమ్మకం ఉన్నదనీ, విప్లవం (revolution) పైన నమ్మకం లేదనీ కామస్ అన్నాడు.

విల్లోన్, మార్లో, షెల్లీ అందరూ బీభత్సమైన పరిస్థితులలో చనిపోయిన రచయితలే. (జేన్ ఆస్టిన్ తన జీవితంలో ఒకటే అసామాన్యమయిన సంఘటన జరిగినదని వ్రాసింది తన ఊరిలో ఒక చెట్టుపైన పిడుగు పడటం.) బైరన్ యుద్ధభూమిలో మరణించకపోయినా సాహసంగానే జీవించాడు. ఈ శతాబ్దంలో స్పానిష్ అంతర్యుద్ధంలో పాల్గొనని రచయితలు చాలా తక్కువ.

(సామర్సెట్ మామ్ కొంతకాలం గూఢచారిగా పని చేశాడు.) కామస్ ఈ కోవకి చెందిన వాడే. జర్మన్ ఆక్రమణను ఎదిరించి పోరాడినవారిలో ఒకడు, కొంత కాలం కమ్యూనిస్టుగా ఉండి, తర్వాత కమ్యూనిజమ్‌ను వదలి, చివరకు 1956 లో హంగరి విప్లవం సమయంలో హంగేరియన్లకు చాలా సహాయం చేశాడు.

కామస్ అల్జీరియా ప్రాంతపు ఫ్రెంచివాడు. (అతని రచనలలో, ప్రత్యేకంగా 'దీ ఔట్ సైడర్'లో ఒకవిధమైన 'పాగన్' (Pagan) గుణం ఉన్నట్లు పాఠకులకు అనిపిస్తుంది. మెడిటరేనియన్ ప్రాంతానికి కామస్ చెందిన వాడవటమే దీనికి కారణమేమోనని 'ది ఔట్ సైడర్' పీఠికలో సిరిల్ కానొల్లీ వ్రాశారు) అందుచేత ఎంత సానుభూతి ఉన్నప్పటికీ అల్జీరియన్ విప్లవకారులతో కలవలేక పోతున్నానని కామస్ ఒకసారి వ్రాశాడు. జనవరి 4 వ తేదీన పారిస్ వద్ద కారు ప్రమాదంలో చనిపోయినప్పుడు అతనికి నలభై ఏడు సంవత్సరాల వయస్సు.

# కైవారము

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

"వందిమాగధులు కైవారములు చేసిరి" అన్న వాక్యముతో ప్రారంభమౌతుంది "కైవారము" అన్న మాటతో మనకు పరిచయము. నిఘంటువులు చూస్తే 'స్తుతి, పొగడ్త' అన్న అర్థాలు కనబడతాయి. రాజులూ ప్రభువులూ సభలను చేరవచ్చేటప్పుడు వందిమాగధులు "పల్లవాదిత్య, శ్రీశైలాహోబల నిర్మితసోపాన" అంటూ ఆ ప్రభువుల ప్రశస్తిని సాగదీస్తూ పాడతారు. ఇవి కైవారవాక్యాలు.

పాటలలో 'కైవారప్రబంధము'లనే పాటలు కూడా ఉన్నాయి. ప్రబంధము అంటే 'ప్రముఖమైన 'బంధము' (రచన). దానిలో కైవారవాక్యాలూ ఉన్నట్లయితే అది కైవారప్రబంధ మౌతుంది. అత్యంత సరళమైన పాటలను గీతములన్నారూ, స్వర—, సాహిత్య-శబ్ద—, ములను వాడి బిగించిన రచనను ప్రబంధము లన్నారు. కైవారములుండే ప్రబంధాలు కైవార ప్రబంధాలు. కాగా, కైవారమునకు వాగ్రూపము స్తుతి. మరి క్రియారూప మనగా ఏది? "కైవారములు చేసిరి" అంటే "కైవారములు పలికిరి" అని యేనా అర్థము? కైవారవాక్యాలు పలుకుతూ వందిమాగధులు ఏమి చేసే వారు?...హంస వింశతిలో నూటఎనిమిది తిరుపతులను చెప్పేచోట "తనరు శరణ్యస్థలము శరణ్యస్వామికి విద కైవారపు చెయ్య"న్నరగడ పాదమున్నట్లు సూర్య రాయాంధ్రనిఘంటువు చెపుతోంది. "కైవారపు చెయ్యి" అంటే, "కైమోడ్పు చేతులు" కావచ్చుననుకుంటాను. 'చెయ్యి' నిశ్చయంగా ఏకవచనమే. అయినప్పుడు కైవారము ఒకచేతితో చేసేపనే అనడానికి ఆక్షేపణ ఏముంటుంది?

లేపాక్షి వర్ణచిత్రాలలో ఈశ్వరునికీ దేవికీ ఇటూ అటూ నిలబడిన వ్యక్తులు కొందరు తమ చేతులలో ఒక దానిని అరచేయి ఆకాశమువైపు తిప్పి, మోచేతిని రొమ్ము మట్టానికి పైకెత్తి అరచేతిని పైకెత్తి ఈశ్వరుని సంబోధిస్తున్నట్టు పెట్టారు. మొత్తానికి చెయ్యి స్వస్తికలోని ఒక గీతవుంటే ఆకారానికి వస్తోంది. విజయనగర చిత్రకళను గురించి వ్రాస్తూ ఒకరు దీనిని ఉపదేశ ముద్ర అన్నారు. ఉపదేశమా? ఎవరు చేస్తున్నారు? ఎవరికి చేస్తున్నారు? ఇది ఉపదేశముద్ర కాదు. ఇదే కైవారము అంటే. భక్తులు పరమేశ్వరునికి కైవారాలు చేస్తున్నారూ, అంతఃపుర కాంతలు మహారాణికి కైవారాలు చేస్తున్నారు. ఒకరో ఇద్దరో రెండు వేళ్లతో ఒక పూవునికూడా పట్టుకుని స్వామిపైపు విసరబోతున్నట్లున్నారు. అంతమాత్రముచేత అది పూజ కాబోదంటాను, కైవారమే.

ఈ కైవారము అక్కడి శిల్పాలలోకూడా గోచరిస్తోంది. అర్థమండపము ఈశాన్యమూలలోని "పద్మినీ పాంచాలపురుషులని" పేరు పొందిన రంభా నలకూబరులు ఒక చేతిని కటిబద్ధము చేసి రెండో చేతితో కైవారము చేస్తున్నారు. ముఖమండప మధ్య స్తంభాల మీది అప్సరసలు కైవారాలు చేస్తున్నారు. మార్దంగికుడు ఒకచేతితో వాయించి రెండో చేతితో కైవారము చేస్తున్నాడు.

దాక్షిణాత్య శిల్పంలో విజయవాడ ద్వారపాలుడు (మద్రాసు-మ్యూజియములో ఉన్నాడు.) కైవారహస్తము పట్టినాడు. మహాబలిపురపు గంగావతరణ చిత్రములోని ఖేచరదంపతులూ కిన్నరులూ మునులూ కైవారాలు చేస్తున్నారు గనక. ఈ శిల్ప చిత్రము మహాబలిపురపు శిల్పాలన్నిటా ప్రాచీనము. మహేంద్రపల్లవుని కాలానిది కావచ్చును. ఆయన మొదట జైనుడు. ఈ చిత్రములో వైదిక సంప్రదాయమైన నమస్కారమున్నట్లు లేదు. కైవారమే కనిపిస్తున్న దంతటా. కంచిలోని కైలాసనాథాలయము

మీది లింగోద్భవ చిత్రములో, ఎల్లోరా కైలాసమూర్తి చిత్రాలలో, తంజావూరి బృహదీశ్వరాలయపు గోడల మీద లింగోద్భవ—, నటరాజ—, చిత్రాలలో, పట్టదకల్ జంబులింగస్వామి గుడి చూరు చిత్రాలలో ఓరుగల్లు మండపం లోకప్పు శిల్పాలలో కైవార హస్తాలు గోచరిస్తున్నాయి.

చిత్ర కళలో లేపాక్షిలో మాత్రమే కాదు, జినకంచి దేవాలయచిత్రాలలోనూ మాచెర్ల వీరభద్రాలయ మండపం లోకప్పు చిత్రాలలోనూ కైవార హస్తాలున్నాయి. ఈ రెండు ఆలయాల చిత్రకళా జైనసంప్రదాయానికి చెందినదే, లేపాక్షినాట వేరె చెప్పనే అక్కరలేదు. జైన తాళపత్ర గ్రంథ చిత్రకారులే లేపాక్షి చిత్రాల్ని రచించారా అని అనుమానపడేటంత పోలిక వుంది వాటికి.

"అయితే కైవారాలు జైన సంప్రదాయమా?" అని అడిగితే "అవునని" చెప్పడానికి ఈ సాక్ష్యము చాలదు. మహేంద్రపల్లవుని కాలంలో కంచిలో జైనము బాగా వ్యాపించి వుండేదనీ, రాష్ట్రకూట రాజులు జైనమతాన్ని ప్రోత్సహించారని, ఉభికిన రెండింటి కళల్లో సరసనున్న వ్యక్తుల శరీరవర్ణ తారతమ్యమూ పార్శ్వవిన్యాసమూ వస్త్రాలంకారమూ వర్ణ కౌశలమూ జైనచిత్ర కళా సంప్రదాయం అనుసరించిన పద్ధతిలోనే వున్నాయి కనక ఈ చిత్రాలు జైనులు రచించి ఉండవచ్చునని చెప్పగలము కాని వీటినిబట్టి కైవారము జైన సంప్రదాయమే అని చెప్పలేము. అయితే అది బౌద్ధసంప్రదాయము కాదు; వైదిక సంప్రదాయము నమస్కారమూ, అంజలీ. కైవారము సంస్కృతిము కాదు! కనుక, కనుక, కైవారము మరి ఏ సంప్రదాయము కాగలదూ?

# చెకోవ్ శతవార్షికోత్సవము

శ్రీ పి. గణపతిశాస్త్రి

క్రీస్తుశకం 1881 లో రెండవ అలెగ్జాండర్ చక్రవర్తి హత్యతో రష్యా చరిత్రలో నేగాక, సారస్వతంలో కూడా ఒక వినూతనాధ్యాయం ప్రారంభించింది. స్వదేశంలో రాజకీయంగా క్రమపరిణామ, సాంఘిక వికాసము కల్పగలవన్న ఆశ ఆ సంఘటనతో ప్రజానీకంలో పూర్తిగా అంతరించింది. జాతీయ లక్ష్యసాధనలో తీరని నైరాశ్యం వ్యాపించింది.

ఆ పరిస్థితులలో రష్యా సాహిత్యాకాశంలో జాజ్వల్యమాన మూర్తితో వెలిగిన ఏకైక జ్యోతి ఆంటన్ చెకోవ్. ఇతడు 1860 లో జన్మించి 1904 లో అస్తమించాడు. ఈ సంవత్సరం శతవార్షికోత్సవ సందర్భంలో ప్రపంచ వాఙ్మయాభిమానులు ఈ కథక సార్వభౌమ ని మహానీయ స్మృతికి జేజేలర్పిస్తున్నారు.

ఇతని చిన్ననాటి రచనలలో సునిశిత వ్యంగ్యంతో మేళవించిన హాస్యాభిభత్సాల పాలె ఎక్కువ. ఆ రోజులలో హాస్యపత్రికలలోనే వీటికెక్కువగా ఆదరణ లభించింది. ఇటువంటి చిత్రణాల సంపుటి మొట్టమొదట 1886 లో వెలువడింది. ఇది విశేషంగా సామాన్య పాఠకుల మన్ననందుకొన్నది. అయితే ఆ తరవాత ప్రకటించిన కథానికలవల్లనే చెకోవ్ ప్రతిష్ఠ ప్రపంచంలో అంతటా వ్యాపించింది. అంతేకాదు. నాటకరచనలోకూడా చెకోవ్ సిద్ధహస్తుడు. విదేశాలలో వ్యాపించిన ఇతని కీర్తికివీ ప్రధాన హేతువులే.

చెకోవ్ రష్యాలో టాగన్‌రాగ్ లో సామాన్యమయిన రైతుకుటుంబంలో పుట్టి పెరిగి మాస్కోలో వైద్యవిద్య అభ్యసించి పట్టభద్రుడయినాడు. ఇతని తాత ఆ ప్రాంతంలో ఒక కమతంలో బానిస. అయితే చిట్టచివరి కాలాన అలాగ వ్యయప్రయాసలతో ఆ దుర్భర దాస్యవిముక్తి సంపాదించుకొన్నాడు.

చనిపోయేసరికి చెకోవ్ వయస్సు 44 సంవత్సరాలే! ఈ స్వల్పకాలంలోనే ఈయన ఇంచుమించుగా ఎనిమిదివందల కథలు, ఐదు నాటకాలు రచించాడు.

### కథానిక

ఇంత ఎక్కువగా కథాసృష్టి సాగించినా ఇతని రచనలలో ఎక్కడా పునరుక్తిదోషం కనబడదు. ప్రతికథ సరికొత్త శిల్పవిన్యాసంతో, సత్యాన్వేషణ దృష్టితో, వినూతన విషయ వివేచనతో సాగిపోతుంది. ఈ కథలలో కొన్ని సానపట్టిన జాతిరత్నాలవలె తళుకులీనుతాయి! చదువరుల హృదయాలలో చిరస్థాయిగా ధ్రువతారకాదీప్తిలా నిలిచిపోతుంది!

'కళాఖండం' దీని కొక చక్కని తార్కాణం. ఒక వ్యక్తి ఒక వైద్యునికి ఒక కళాఖండం బహూకరిస్తాడు. అది నగ్న స్త్రీ మూర్తులతో రూపొందించిన శిల్పము. ఆ డాక్టరది గొప్పకళాఖండమే అని అనం

దిస్తాడు. అయితే కొంత ఇబ్బందిపడి అది తిరిగి తన మిత్రుని కోసానికి బహుమతిగా అందిస్తాడు. అలా అది రెండు మూడు చేతులు దాటి చివరికది ఆ డాక్టరు దగ్గరకే తిరిగి వస్తుంది. ఈ సంఘటనతో ఈ కథ ముగిసి పోతుంది!

దూషెచ్కా అన్న కథ కూడా ఇలాంటిదే. ఒక స్త్రీ క్రమక్రమంగా ఇదరి ముగ్గురిని వివాహం చేసుకొని ఎంతో ప్రశాంతంగా జీవితం కొనసాగిస్తుంది. మొదట ఆమె ఒక నాటకశాల మేనేజర్ భార్య అవుతుంది. ఆ సమయంలో ఆమెకిక నాటకశాల తప్ప మరి ప్రపంచంలో వేరే అత్యద్భుత విషయమేది గోచరించదు! అతడు చని పోయిన తరవాత ఒక కలపవర్తకుణ్ణి పెళ్ళి చేసుకుం టుంది. ఆ సమయంలో ఆమెకిక కలప తప్ప మరే వేరొక అమూల్యవస్తువేది కనిపించదు! అతడు చనిపోయిన పిమ్మట మళ్ళీ ఒక వెటర్నరీ డాక్టర్ని పెళ్ళి చేసుకుం టుంది. అప్పుడు మరి పశువైద్యం ఒక్కటే ఆమె నిరంతర ధ్యేయం! అయితే పాపం అతడామెను విడిచి పెట్టివేస్తాడు! మిగిలిన కాలం ఆమె ఒక పసివాణ్ణి పెంచు కుని వాడిమాటలే చిలకలా అనుకరిస్తూ హాయిగా జీవి స్తుంది! ఈ విచిత్రమయిన సుసూక్ష్మమయిన మానసిక రహస్య చిత్రణలో చెకోవ్ ఆరితేరిన దిట్ట.

ఇతడు నవలలవంటి పెద్ద రచనలేవీ తలపెట్ట లేదు. చిన్న చిన్న కథలలోనే ఇతని ప్రతిభ అనన్య సామాన్య నైపుణితో ప్రతిఫలించింది.

## రూపకాలు

ఇవనావ్, సీగల్, అంకుల్ వాన్యా, త్రిసిస్టర్స్, చెర్రీఆర్చర్డ్ అని చెకోవ్ అయిదు నాటకాలు రచించాడు. ఇవి రంగస్థలంమీద కూడా బాగా రక్తికట్టాయి. అయితే వీటి ప్రదర్శనంలో చాలా జాగ్రత్తపడాలి. లేక పోతే కొన్ని కొన్ని చోట్ల సుసూక్ష్మభావ ప్రకటన సాధ్యపడదు.

ఈ రూపకాల నాయకులలో కొన్ని సామాన్య లక్షణాలు కనిపిస్తాయి. వీరందరూ చాలా మృదుల హృదయులు. చిన్న చిన్న ఇబ్బందులకే గుండెనిబ్బరం లేక ఇట్టే నీరసపడతారు! అకుంఠితదీక్షతో తల పెట్టిన పని ఏది తుదముట్టించలేరు! అయితే ఈ నాట కాలలో నీతి, నిజాయితీ లేని వట్టి మోటుమనుష్యులే తాము తలపెట్టినవన్నీ సాధిస్తారు. వీరి ఆఘాతాలతో సంస్కృతి, నీతి, నియమాలు మొదలయిన వన్నీ పూర్తిగా తుడిచిపెట్టుకుపోతాయి!

మంచి మనుష్యులందరూ పాపం నైరాశ్యంతో కుంగి, కృశించి చిట్టచివరి కాత్మహత్య తప్ప గత్యంతరం లేదని భావిస్తారు. వీరు ప్రతిభావంతులే కావచ్చును. కాని జీవితంతో పోరాడలేక పరాజితులై అలసిపోతారు!

చెకోవ్ తరవాత రష్యా వాఙ్మయంలో సాంకే తిక (Symbolism) వాదం తల ఎత్తింది. చెకోవ్ లో కొంత సాంకేతికత కనబడినా, ఇతడే సిద్ధాంతాలకు కట్టుబడి తన రచనలు సాగించలేదు. జీవితంలో యథార్థ సత్య స్వరూపనిరూపణమే వాఙ్మయ పరమా వధి అని చెకోవ్ నిర్వచించాడు.

ఈ రచయిత తాత్కాలిక సాంఘిక సమస్యల జోలికి పోకపోవచ్చును. కాని ఇతని రచనలలో అంతటా సునిశితమయిన సాంఘికావహేళన నిగూఢ వ్యంగ్య రూపంలో కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. కథ లలో ప్రతిపదము ఒక విశిష్టమైన సార్థకతతో ప్రతి ధ్వనిస్తుంది.

చెకోవ్ సాటిలేని మేటిశిల్పి అనీ గద్యంలో పుష్కిన్ కవితో తులతూగజాలిన వాడనీ టాల్ స్టాయి చేసిన ప్రశంస ప్రత్యక్షరము యథార్థమే!

# గ్రంథ విమర్శనము

## మేల్కొన్న ఆకాశం

[రచయిత: మాదిరాజు రంగారావు. ప్రతులకు: రచయిత. 3-4-685 నారాయణగూడ, హైదరాబాదు. 68 పేజీలు. వెల రూ 1-25 న. పై.]

ఇందులో ఇరవై మూడు ఖండికలున్నాయి. రచయిత వేరొక శీర్షిక లుంచలేదు. అయినా 'మేల్కొన్న ఆకాశం' అనే పుస్తకం పేరే గ్రంథస్థ విషయానికి ఏకసూత్రత ఘటించి వస్తువును సూచించగలదు. ఇందులో కవి ఎక్కువగా కాంతిగీతం, కలలు, ఆలోచనలు, దేవుడు, చైతన్యాలవంటి విషయాలమీద వ్రాశారు. బహుశః ఈ గ్రంథం కవిలో కలిగిన జాగృతిని సూచిస్తుందనవచ్చు.

'సగం మూసుకున్న తూరుపు కనురెప్పలు
తెరిచేలేని మాయమత్తు మమకారపునీడలు
మొదట అద్దంలో నా ముఖబింబంలో చూచా'
'ఈనాటి వరకూ కళ్లు మూసి ఎరుగని
సూర్యుని మనసులో తిరిగే చీకటే
బంతిని 'గోల్' చేయాలనే ఊహతో
వెన్నెల ముసుగులు ధరించి తిరిగే
మనిషి ముఖం తరువాత అద్దంలో చూచా'—

ఇలాంటి కవితా స్ఫురణగల పంక్తులు పాఠకుని కేపాటి ప్రతిఫలమౌతాయో చెప్పడం కష్టం. ఏమంటే ఇందులో ఉన్నవాటిలో ఎక్కువగా intellectual abstractions కనబడతాయి; అనుభవదారిద్ర్యం దానికి కారణం కావచ్చు. ప్రథమ పంచమ ఖండాలే మాట కపవాదంగా నిలవొచ్చు — పోతే పంద్రెండో ఖండికలోలాగ 'వ్యష్టి రూపాల స్వరూపం. సైకత క్షుత్ సమాహారైకసూత్రం, సంస్కృతీ చిత్రజీవనసంపుటి యుగ పరిణామ చిహ్నం మానవుడు' అని వ్రాస్తే అది దిట్టమైన వచనమౌతుందేమో కాని కవిత్వమవలేదు మరి, abject pessimism తో 'అగ్నికుండమైపోతేనేం లోకం', 'శ్మశానంగా మారిపోనీ ప్రపంచం', 'ఎక్కడైతేనేం గడవడానికి కాలం' అంటూ వ్రాసిన చిత్రిత్తి పాఠకునికి [illegible]గవౌతుంది. అలనాడెప్పుడో శ్రీనాథుడు 'శేముషీవిశేష సముదంచితా కుహరంబుల నించి కలంచి' కబ్బాలు వ్రాసేవారిని నిరసించినాడు. రంగారావుగారు అనుభవాన్ని పొందుపరచుకొని వ్రాయడ మారంభిస్తే ముందుముందైనా ఈయన చేతిలో మంచి కవిత్వం మొలకెత్తగలదని మా ఆశ.

## ఉన్మత్తుడు

[ఏకాంకిక. కర్త: భాగవతుల ఉమామహేశ్వర శర్మ. ప్రకాశకులు: ప్రవాసి ప్రచురణలు. ఆంధ్ర విజ్ఞానసమితి, జమ్‌షెడ్‌పురము. 61 పేజీలు. వెల 50 నయా పైసలు.]

ఇది నాలుగు రంగాలుగా విభజించి వ్రాసిన ఏకాంకిక. ఆర్థిక సంక్షోభంలో పడి ఆఘాతాలు తింటూ బ్రతుకలేక బ్రతుకుతున్న ఒక గుమాస్తా జీవితాన్ని ఈ రూపకం చిత్రిస్తుంది. సంభాషణలు సహజంగా సరళంగా ఉన్నాయి. కృష్ణానదీవరదలుకూడా గుమాస్తా 'రాజా' జీవితాన్ని గాయపెట్టడం ఈ కథలో ఉంది. ఇంత చిన్న రూపకంలో 17 గురు పాత్రలున్నారు. మొదటిదృశ్యంలో వచ్చే ఒక ఐదుగురు నాలుగవ దృశ్యంలో వచ్చే ఐదుగురి పాత్రల ధరించవచ్చునని గ్రంథకర్త సూచనచేసినా పాత్రల సంఖ్య పండ్రెండుమందికి తగ్గదు. రూపకంలో పాత్ర భావాన్నీ మాటలను కుదించి ప్రకాశింపచేస్తేనే దానికి 'లిఫ్ట్' వస్తుంది. మొత్తానికి రచన 'లైట్'గా బాగానే సాగింది.

జమ్‌షెడ్‌పూర్ ఆంధ్ర విజ్ఞానసమితివారు ప్రవాసాంధ్రుల రచనలు ప్రకటింపజేయ బూనుకోవడం అభినందింపదగినది. ముందుముందు మరింత ఉత్తమ రచనలందివ్వగలరని ఆశించవచ్చు.

## గ్రంథ స్వీకారము

### ఆంధ్రనందా శతకము

రచయిత: శ్రీ నిడుదవోలు వేంకటరావు. ప్రచురణ: ఆంధ్రనలంద, గుడివాడ. కృష్ణాజిల్లా మూల్యం 0-8-0.

### శ్రీ రామకృష్ణుని జీవిత చరిత్ర

రచయిత: ప్రకాశకుడు. శ్రీ చిరంతనానంద స్వామి. సాహిత్య అకాడమీ వారిచే 500 రూపాయలు బహుమతినందిన గ్రంథం. పుట: 460. మూల్యం: 2-75. ప్రతులకు: రచయిత, భీమవరం.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.